# చతుర

సంపుటి: 2

సంచిక: 8

సెప్టెంబర్

1979


## ఈనెల సమగ్రనవల

నూనూగు మీసాల నూత్న యవ్వనంలో అప్పుడే అడుగిడిన అతను తొలి చూపులోనే ఆమెను గాఢంగా ప్రేమించాడు. అణువణువునా ఆమెనే నింపుకుని ఆరాధించాడు. ఆమెకోసం తన భవిష్యత్తునే పణం పెట్టాడు. ఆమె కన్నెత్తి చూడకపోయినా, పన్నెత్తి పలకరించక పోయినా సహించి, ఆమెతో తన భవిష్యత్తును గురించి సౌధాలు నిర్మించుకున్నాడు. చివరికా 'ప్రేమాగ్ని'కి శలభంగా బలి అయింది ఎవరు ? ఎందుకు ? ఎలా ?

నండూరి రామకృష్ణ

తాజా నవల

# ప్రేమాగ్ని

## ఈ నెల ముఖపత్రం

'ప్రేమాగ్ని' నవలలోని ప్రధాన పాత్ర స్వభావ స్వరూపాలను చిత్రకారుడు 'సూర్య' చేసిన రూపకల్పన.

## రెండవ కవరు

సాంప్రదాయక దుస్తులు, ఆభరణాలతో కాశ్మీర యువతి
ఫొటో : ఎల్.ఆర్. గ్రోవర్, రోహ్‌టక్

## మూడవ కవరు

ఈనాడు ప్రపంచ ప్రసిద్ధ యాత్రా కేంద్రంగా మారిన ఖజురహో ఆలయంలో అసంఖ్యాక మిధున శిల్పాల్లో ఒకటి.
ఫొటో : శ్రీహరి గంగూలీ, కలకత్తా


చతురమ
ఈనాడు కాంపౌండ్
సోమాజిగూడ, హైదరాబాద్–500 004

# ఆదిమజాతి

కేరళలోని వైనాడ్ ప్రాంతపు ఆదిమ జాతి ప్రజలు అణగదొక్కబడుతున్న పద్ధతులు ఉత్సాహం ఉన్నవాళ్ళు నవలలు రాసుకోడానికి కావలసినంత ముడిసరుకు సరఫరా చేసేవిగా ఉన్నాయి. గతంలో అమెరికన్స్ రెడ్ ఇండియన్లని తుడిచి పెట్టడానికి అవలంబించిన పద్ధతులకి ఇవి ఏమాత్రం తీసిపోవని అభిజ్ఞులంటున్నారు.

నిజానికి అంతకంటే ఎక్కువగానే వైనాడ్ ఆదిమ జాతి ప్రజలను మన నాగరిక ప్రజలు మోసం చేస్తున్నారు. వైనాడ్ ప్రాంతానికి కేంద్ర పట్టణం పుల్లపల్లి.

పుల్లపల్లిలో ఒక రైతు దగ్గర భూమి కొన్న షావుకారు రిజిస్ట్రార్ సమక్షంలో ఆ భూమి ఖరారు కింద రు. 2,500 ఇచ్చి, ఆ రిజిస్ట్రేషన్ తతంగం పూర్తిచేసుకుని బయటకు రాగానే మోసం చేసి ఆ డబ్బంతా తిరిగి కొట్టేశాడు.

సారాసీసాలు పగలగొట్టాడన్న నెపం మీద ఒక రైతుకి ఉన్న కొద్దిపాటి సాగు భూమినీ హస్తగతం చేసుకున్నారు. ఆ ప్రాంతంలోని ప్రజలు విపరీతంగా తాగుతారు.

అయినా అదికూడ నాగరిక ప్రజలకొకలుసే !

ఈ పుల్లపల్లి ప్రాంతంలోనే వాల్మీకి మహర్షిఆశ్రమం ఉండేదని పురాణాలు వర్ణిస్తున్నాయి.

కానీ అజితా నక్సలైటు ఉద్యమం ఇక్కడే ప్రారంభమయింది. ఇక్కడి కురుబియాస్ కుమమాస్ అనే కొండజాతి వాళ్ళు గతంలో స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నవారే ! అయినా వాళ్లు పైకి రాలేక పోవడానికి కొన్ని కారణాలున్నాయి.

ఎలాగోలా పనియాలబానిసత్వం,కురుబియాల్లోని అస్పృశ్యత, నాయకర్ల మోటుతనం, కురుమాల తాగుడు వ్యసనం, ఆదియాల మూఢ నమ్మకాలు, ఆదియా స్త్రీలలోని అధిక కామవాంఛ, మొత్తంమీద అందరిలోనూ ఉన్న నిరక్షరాస్యత, అజ్ఞానం తొలగిన నాడు గాని ఈ వైనాడు ఆదిమజాతి అభివృద్ధిలోకి రాదు.



పుల్లపల్లి జనాభా ఈనాడు 75 వేలు. ఇక్కడ సెంటు భూమి 5 వేలు అంటే ఆశ్చర్యం అక్కర్లేదు. ఇక్కడున్న అయిదు సినిమా హాల్స్‌లోనూ ఎప్పుడూ కొత్త సినిమాలే ఆడుతుంటాయి. ఎక్స్‌ప్రెస్ బస్ సర్వీసు సౌకర్యం కూడా ఉంది.

# మర్కట ప్రేమ

భారతదేశాన్ని 17వ శతాబ్దంలో దర్శించిన ఫ్రెంచి యాత్రికుడు జియో వన్ని కెరెరి-కర్ణాటకలో ఒక కోతి, ఒక అమ్మాయి మధ్యన సాగిన ప్రణయాన్ని వర్ణించాడు. ఆకోతి తన ఇష్టంవచ్చినప్పుడల్లా ఆ అమ్మాయి ఉండే ఇంట్లోకి ప్రవేశించి అందరినీ భయపెట్టి తనపని పూర్తిచేసుకుని పోయేదట. ఆడవాళ్ళని చూసి కోతులు ఉద్రేకం చెందుతాయని, కలకత్తా జూ అధికారులు అంటారు. ఫిలిప్పైన్ జాతి స్త్రీలు కొందరు అడవికి తరచుగా వెళ్ళి కోతులతో ప్రణయం సాగిస్తారని కొందరు పరిశీలకులు భావిస్తున్నారు.



కొయ్య తెప్పమీద ప్రయాణిస్తున్న ఒక అమ్మాయి ప్రమాదవశాత్తూ సముద్రంలో కొట్టుకుపోయి, గుడ్‌హోప్ అగ్రం చేరుకుందట. ఆ అమ్మాయిని ఒక కోతి లాక్కుపోయి తన గుహలో దాచుకుందట.

ఆ తరువాత వాళ్ళకి ఇద్దరు పిల్లలు పుట్టారు. కొంత కాలానికి అటుగావచ్చిన కొందరు నావికులు, ఆ అమ్మాయిని కోతిబారినుండి రక్షించారు. కోతి నావికుల్ని ఎదిరించలేక తనకు పుట్టిన పిల్లల్ని ఇద్దరినీ చంపేసి కసితీర్చుకుందట.

పండుకోతులమాదిరి, ముఖం ఎర్రగా ఉండేవి మాత్రమే ఆడవాళ్ళని చూసి ఉద్రేకపడతాయని వెల్లడయింది. బ్రెజిల్‌లో ఒకస్త్రీకి ఒంటినిండా వెంట్రుకలున్న మూగ పిల్లవాడు పుట్టాడు. ఈ పిల్లవాడు కోతికి పుట్టినవాడే అయి ఉంటాడని పరిశీలకులు అంటున్నారు.

# తరిగే సంపద

కూర్చుని తింటే కొండలయినా తరిగిపోతాయంటారు. పెట్రోలూ అంతే కదా! భూమిలో మొత్తం ఒక లక్ష తొంభై వేల కోట్ల పీపాల పెట్రోలు నిల్వలున్నాయని శాస్త్రజ్ఞులు అంటున్నారు. నానాటికీ పెరుగుతున్న పెట్రోలు వాడకాన్ని బట్టి, ఎంత పొదుపుగా వాడుకున్నా ఇరవై ఒకటవ శతాబ్దం చివరకు పెట్రోలు ఒక్క చుక్క కూడ మిగలదు.

గాలిలోని ప్రాణవాయువు కూడ అంతకంతకూ తరిగిపోతోంది. ప్రాణాల్ని నిలబెట్టే ప్రాణవాయువు '2060' వరకు వస్తుందని అంచనా. ఇహ బొగ్గు సంగతి సరేసరి. మరో నూటడెబ్భై సంవత్సరాల తరువాత బొగ్గుముక్క కలికంలోకి కూడ దొరకదు.

బొగ్గు, పెట్రోలు లేనినాడు మానవుడి మనుగడేలేదు. రైళ్ళు, ఫ్యాక్టరీలు ఎక్కడి



వక్కడ బంద్. నల్ల బంగారం అనబడే పెట్రోలు లేకపోతే ప్రపంచం తల్లకిందలైనా ఆశ్చర్యంలేదు. ప్రాణ వాయువు దొరకనినాడు ప్రాణికోటి నశించిపోతుంది.

వీటన్నిటినీ దృష్టిలో ఉంచుకుని, శాస్త్రజ్ఞులు అణుశక్తి, సౌరశక్తిలపై బ్రహ్మాండమైన పరిశోధన జరుపుతున్నారు. అణుశక్తి సాయంతో విద్యుత్తును తయారు చేసే దేశాలలో అమెరికాది అగ్రస్థానమైతే జపాన్‌ది అయిదవ స్థానం. అణుశక్తి కోసమై కోట్లకొద్దీ ఖర్చు చేయడం పేద దేశాలకు సాధ్యంకాదు గనుక, మన దేశం సౌరశక్తిని వినియోగంలోకి తేవడానికి శతధా కృషి చేస్తోంది.

ఇంధనం కొరత ఎంతగా ఏర్పడినా జల విద్యుచ్ఛక్తిమీద ఆధారపడిన మన దేశానికి ఏ కొరతా రాకపోవచ్చు.

## జలరాక్షసి

జానపద కథల్లో తరచుగా ప్రస్తావించబడే సముద్ర రాక్షసిని ఫొటో తీయాలనే కాంక్ష మళ్ళీ మొదలయింది. స్కాట్లండులోని లాక్ జలసంధిలో పెద్ద పెద్ద సముద్ర జంతువుల్ని ఫొటో తీయడానికి ఇప్పుడు డాల్ఫిన్ చేపలని వాడుతున్నారు. తర్ఫీదు పొందిన డాల్ఫిన్స్ లైట్లు, కెమేరాలు భుజాలకు తగిలించుకొని నీటిలో తిరుగుతాయి. వాటి భుజాలకు తగిలించబడిన ఆటోమేటిక్ కెమేరాలు ఫొటోలు తీసుకుంటాయి. ఈ విధంగా మనుషుల అవసరం లేకుండా సముద్రం అడుగున ఉండే పెద్ద పెద్ద షార్కు చేపలు, సముద్రపు తాబేళ్ళని ఫొటోలు తీయడం సాధ్యపడింది.

బోస్టన్‌లోని అప్లైడ్ సంస్థవారు నిర్వహిస్తున్న ఈ పరిశోధనలో డాల్ఫిన్స్‌కి చన్నీటిలో కూడా తిరిగేందుకు శిక్షణ ఇస్తున్నారు. "డాల్ఫిన్స్ సామాన్యంగా మంచినీటిలో తిరగలేవు. కాని మేము



తర్ఫీదు ఇవ్వడం వల్ల 20 గంటలవరకూ మంచినీటిలో తిరగగలుగుతున్నాయి" అని పరిశోధనా సంస్థ నాయకుడు రైన్ అంటున్నారు. ఈ సంస్థకి డాల్ఫిన్స్ గురించిన పరిజ్ఞానం, డాల్ఫిన్స్ శిక్షణలో నిపుణులైన శాన్‌డీగో పరిశోధనా సంస్థ వారు కల్పించారట.

# శవాల కార్లు

అయిదేళ్ళ క్రితం ఈదీ అమీన్ తనకు వ్యతిరేకంగా గూఢచారి చర్యలు చేస్తున్నాడన్న నెపంతో ఒక జర్నలిస్టు రెండు కాళ్ళూ తుపాకి గుళ్ళతో తూట్లు చేయించాడట. కాళ్ళు పోగొట్టుకున్న జర్నలిస్టు దారినపోయ్యే దానయ్యా సాయంతో బయటపడి కీన్యా చేరాడు. అమీన్ సైనికులు కనిపించిన ఏదైనా అందమైన కారు ఎక్కాలనిపిస్తే, కారులో కూర్చున్నవాళ్ళని కిందకి నెట్టి, ఎక్కి కూర్చోడమేనట. ఆడవాళ్ళకి అసలు రక్షణలేదు. సిపాయి కోరుకున్న చిన్నది పక్కలోకి రావలసిందే అభ్యంతర పెడితే ప్రాణానికే ముప్పు.

అమీన్ వ్యతిరేకులు ఎవరైనా కనిపిస్తే వాళ్ళని చంపి కారు డిక్కీలో తోసి,



నిర్మానుష్యంగా ఉన్న అడవిలో విసిరే వారు.

"మన దేశంలో ఎక్కువగా అమెరికా కార్లు వాడతారు ఎందుకు?" అని అమీన్‌గారి అంగరక్షకుడితో ఓ పెద్ద మనిషి తన సందేహం వెలిబుచ్చగా "ఏముంది. అమెరికన్ కార్లు పడవల్లాగా విశాలంగా ఉంటాయి. డిక్కీలో ఐదు శవాల్ని తోసినా ఇంకా ఖాళీ ఉంటుంది" అని ఆ అంగ రక్షకుడు అసలు విషయం దాచకుండా చెప్పాడు.

# కలం జరిపిన పెళ్ళి

ఉత్తర ఇటలీకి చెందిన ఆల్టగరోలో కోపంలో ఒళ్ళు తెలియక తన తల్లిని, తండ్రిని తుపాకీతో నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపాడు, వారించబోయిన ముగ్గురు పొరుగింటివాళ్ళకి కూడ అదేగతి పట్టింది. యథావిధిగా కోర్టు తతంగం జరిగిన తర్వాత 'ఆల్ట్'కి యావజ్జీవ కారాగార శిక్ష పడింది. జైల్లో ఐదేళ్ళ జీవితం గడిపిన తర్వాత ఓరోజు ఆల్ట్ స్త్రీల పత్రికలోని 'కలం స్నేహితుల' ప్రకటన చూసి ఒంటరిగా కూర్చుని చేసేదేముందని కార్లా అనే 17 ఏళ్ళ అమ్మాయితో 25 ఏళ్ళపాటు కలం స్నేహం నడిపాడు.

వారిద్దరూ ఉత్తరాల్లోనే ఒకరి కొకరు మనసిచ్చి పుచ్చుకున్నారు. ఈలోగా ఆల్ట్ యొక్క ఆదర్శవంతమైన ప్రవర్తన, మంచితనం చూసి, జైలు అధికారులతన్ని విడుదల చేశారు.

ఆల్ట్ ఆరు పుష్పగుచ్ఛాలు కొని తను చంపిన అయిదుగురి సమాధులపైనా ఐదు ఉంచి ఆరోది కార్లాకిచ్చి ఆమెని అర్ధాంగిగా చేసుకున్నాడు. తర్వాత రెడిమేడ్ దుస్తుల షాపు పెట్టుకుని ఏ



లోటూ లేకుండా జీవితం సాగిస్తున్న ఆల్ట్, ఇప్పటికీ స్థానిక పోలీసుస్టేషన్లో వారానికి రెండుసార్లు హాజరు వేయించుకోవాల్సిందే.

# భాషలనిధి

ఢిల్లీలోని డిఫెన్సు కాలనీలో నివసిస్తున్న డా॥ సిద్ధేశ్వర వర్మ 92 ఏళ్ళ వయసులో కూడా యువకులకంటే ఉత్సాహంగా పనిచేస్తారు. ఆయనకున్న విజ్ఞాన తృష్ణ అపారం. కృష్ణా, రామా అంటూ ప్రశాంతంగా కాలం గడపవలసిన వయసులో 'శిలప్పధిగారమ్' అనే తమిళ ఇతిహాసాన్ని ఉర్దూలోకి అనువదిస్తూ పైగా అందులోని రెండు పద్యాల అర్థం కుదరక రెండేళ్ళుగా తమిళ పండితుల్ని సంప్రదిస్తూ పరిశోధన చేస్తున్నారు.

వర్మగారికి 35 భాషలు తెలుసు. అయినా కొత్త భాషలు నేర్చుకోవాలనే కుతూహలం ఎక్కువవుతూనే వుంది. అందుకే ఆయనకు 'సప్తబ్రహ్మ' అనే బిరుదు ఇచ్చి గౌరవించారు.

వేదాల గురించి తెలియచేస్తూ జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషల్లో చాలా గ్రంథాలు రాశారు.

జమ్మూలోని వేల్స్ కళాశాలలో సంస్కృత పండితుడుగా పనిచేసి 1941లో పదవీ విరమణ చేశారు. ఇప్పటికి 50 సంవత్సరాల నుంచి భాషా పరిశోధనచేస్తూ చాలా శాస్త్ర గ్రంథాలను హిందీలోకి అనువదించారు. ఆయనకు తెలిసిన ప్రతిభాషలోనూ లెక్కలేనన్ని పుస్తకాలు రాసినా అదంతా భాషాభిమానం గాని, డబ్బు సంపాదనకు కాదట.

వర్మగారు పొద్దున్నే నాలుగున్నరకు లేచి రెండు గంటలసేపు యోగాసనాలు వేసిన తరువాత పళ్ళు, తేనె, రొట్టె, కాయగూరలు, పెరుగువంటి సాత్వికాహారం మాత్రమే తీసుకుంటారు. జీవితంలో ఇంతవరకు టీ రుచి చూడలేదు. కళ్ళజోడు వాడవలసిన అవసరం రాలేదు.



89 ఏళ్ళ వయసులో హిమాలయాల కెళ్ళి అక్కడి ఆదివాసి ప్రజల భాష, టిబెట్ భాషలు నేర్చుకున్న ఈయనగారి వాంఛితం కనీసం 140 ఏళ్ళు బ్రతకాలని!

హౌరా మెయిలు వాల్తేరు స్టేషనులో ఆగింది.

ప్లాట్‌ఫారం మీది కేకలతో రమణకి మెలకువొచ్చింది. బద్ధకంతో ఒళ్ళు విరుచుకున్నాడు. రైలాగి చాలా సేపయినట్లుందని లేచి చకచకా సామాను సర్దటం మొదలుపెట్టాడు. బెడ్డింగూ, పెట్టె రెండే కాబట్టి సర్దటం పది నిమిషాలు కూడా పట్టలేదు. కూలీని పిల్చి సామాను అప్పగించి తనూ వెనకనే నడిచాడు.

సందడి!

రైల్వే స్టేషన్లో కనబడే సందడి ఎక్కడో కాని కనపడదు సాధారణంగా.

టైము చూసుకున్నాడు రమణ. తొమ్మిదయింది. గంటలో గదికెళ్ళి స్నానం, భోజనం కానిచ్చి ఆఫీసులో ఉండాలి. లేటవుతుందేమో అనుకుంటూ నడక వేగం పెంచాడు రమణ. స్టేషను బయటికి వచ్చేసరికి పావుగంట పట్టింది.

సామాను దింపాడు కూలీ.

"ఎంతిమ్మంటావోయ్?"

"నాలు రూపాయలియ్యండి సార్"

"ఒక పెట్టె బెడ్డింగుకి నాలుగు రూపాయలా?"

"బ్రిడ్జిమీంచి సుట్టు తిరిగొచ్చాం కదండీ"

"అయితే మాత్రం - లెక్క ప్రకారం తీసుకో. రెండు రూపాయలిస్తాను."

"కుదర్దు బాబూ"

"నీకు కుదిరినా కుదరకపోయినా నేనిచ్చేది అంతే" అంటూ సామాను రిక్షాలో పెట్టించి కూలీ చేతిలో రెండు రూపాయలు పెట్టాడు రమణ. కాసేపు సణిగి వెళ్ళిపోయాడు కూలీ.

విశాఖలో రోడ్లన్నీ ఎత్తుపల్లాలతో ఉంటాయి. కొన్ని కొన్ని చోట్ల మరీ ఘోరం. కాసేపు అతిమెల్లగా, మరికాసేపు అతి వేగంగా పోతోంది రిక్షా. మెయిను బజారు దగ్గర సినిమా హాలు ఎదురుగుండా సందులో ఉంది రమణ ఉండేగది. పదిరోజుల తర్వాత మళ్ళీ విశాఖనీ, విశాఖ రోడ్లనీ చూస్తుంటే కొత్తగా ఉంది రమణకి.

రిక్షా ఆగింది ఎందుకో. ఏమిటన్నట్టు చూశాడు రమణ.

"చైను పడింది బాబూ. ఒక్క నిమిషం" అంటూ కిందికి దిగాడు రిక్షా అతను.

విసుగు పుట్టింది రమణకి. ఎప్పుడయితే తొందరగా వెళ్ళాలని ఉంటుందో సరిగ్గా అప్పుడే మరింత ఆలస్యమవుతుంది. కాసేపు కుస్తీపట్టి మళ్ళీ రిక్షా ఎక్కాడు రిక్షా అతను.

చుట్టూ చూస్తుంటే అల్లంత దూరంలో మూర్తి కనిపించాడు. కిళ్ళీకొట్టు దగ్గర నిలబడి పేపరు చదువుతున్నాడు. మొహం కనిపించటంలేదు.

"మూర్తీ!" అంటూ కేకేశాడు రమణ.

రమణవేపు తిరిగాడతను.

మూర్తి కాదు.

అదోలా చూశాడతను. ఎబ్బెట్టుగా తోచింది రమణకి. రిక్షా అతని ముందునించి పోతుంటే అన్నాడు.

"క్షమించండి. నా ఫ్రెండనుకున్నా."

"ఫరవాలేదులెండి" అన్నాడతను.

ఆశ్చర్యమేసింది రమణకి. ఎన్ని పోలికలో! వెనకనించి అచ్చం మూర్తిలాగానే ఉన్నాడు అతనెవరోగాని ఒడ్డూ పొడుగూ అంతా సరిపోయింది. పైగా ఆ తెల్లటి బట్టల్లో అతన్ని చూసి తప్పకుండా మూర్తే అని అనుకున్నాడు.

మూర్తి రూపం కళ్ళ ముందు మెదిలింది రమణకి. అయినా తన పిచ్చిగాని, ఎక్కడో హైదరాబాదులో ఉన్న మూర్తి ఇక్కడికెలా వస్తాడు? మరిచిపోయాడా తనని అంత తేలిగ్గా? నాలుగేళ్ళపాటు ఒకళ్ళనొకళ్ళు అతుక్కుపోయి కవలల్లా కలిసిపోయిన స్నేహం!

ఆ స్నేహాన్ని తలుచుకుంటే ఇప్పటికీ మనసంతా ఓ తియ్యటి అనుభూతితోనిండి పోతుంది. వాళ్ళింట్లో కూడా ఎంతగా కలిసిపోయాడో తను. రావుగారు కూడా తనని సొంత కొడుకులా చూసుకొనేవారు. అందరూ మూర్తినీ తననీ చూసి ఒకే పేగు తెంచుకు పుట్టినవాళ్ళమనుకునేవారు.

సంవత్సరమయింది తను విశాఖ వచ్చి. మొదట్లో వారానికి రెండో మూడో ఉత్తరాలొచ్చేవి మూర్తినుంచి. తరవాత ఉన్నట్టుండి ఉత్తరాలు రావటం మానేశాయి. మళ్ళా ఓ అయిదు నెలల తరవాత ఒక ఉత్తరం రాశాడు. ఎన్నిసార్లు చదివాడో ఆ నాలుగు ముక్కలూ. తరువాత ఏ కబురూ లేదు. పర్సులో జాగ్రత్తగా దాచాడా కవరుని. బయటకి తీసి మళ్ళీ చదివాడు రమణ.

"రమణా-

నాకు ఉద్యోగం వచ్చిందిరా. ఏడొందల జీతగాడిని నేనిప్పుడు. జీవితంలో మరో దశ మొదలయింది.

పరిష్కారం కనబడని సమస్య- నన్ను పనికిరానివాడిగా, మతిలేనివాడిగా చేసిన సమస్య ఒకటి నన్ను వేధిస్తోంది. ఆ ఏడుకొండలవాడ్ని వేడుకొంటున్నా నన్నాదుకోమని.

ఇదివరకులా నీతో చెప్పుకుందామనుకున్నా నా బాధని. కాని నువ్వూ నాలాంటి పిచ్చివెధవ్వే. నాకంటే ఎక్కువ బాధపడతావు. బహుశా విశాఖ వస్తానేమో వచ్చేనెల్లో. అప్పుడు చెబుతా నీకు.

నీవాడు

మూర్తి."

రమణ మనసు ఎందుకో బాధతో మూలిగింది. మూర్తిని చూడాలనిపించింది ఆ క్షణంలో అకస్మాత్తుగా.

మెయిను బజార్లోకి వచ్చింది రిక్షా.

"ఎటు పోనిమ్మంటారు బాబూ ?"

ఈ లోకంలోకి వచ్చాడు రమణ. గుర్తులు చెప్పాడు రిక్షా అతనికి. గది ముందర తాళం తీస్తుంటే ఇంటాయన పలకరించాడు.

"ఇప్పుడేనా రావటం బాబూ ?"

"అవునండీ"

"పది రోజుల్నుంచీ నువు లేకపోతే ఏమిటో వెలితిగా అనిపించిందయ్యా! నాకూ దానికీ కూడా ఏం తోచలేదనుకో. అది మరీను. రోజూ అడుగుతోంది నన్ను రమణెప్పుడొస్తాడూ అని"

నన్నగా నవ్వాడు రమణ ఆ ఆప్యాయతకి ఏమనాలో తెలియక.

"స్నానం కానీ తొందరగా. భోజనం వడ్డించమని చెప్పాను"

"అలాగేనండీ"

"ఆఫీసుకి వెళ్తావా ఇవాళ ?"

"వెళ్ళాలండీ"

"మరయితే తొందరగా కానీ" అంటూ ఇంట్లోకి వెళ్ళాడాయన.

ఆ ఇల్లు చాలా చిన్నది. ఓ వంటిల్లూ, మూడు గదులూ, వెనకాతల కాస్త ఖాళీ స్థలం. రోడ్డు మీదికి రెండు గుమ్మాలున్నాయి. ఓ గదిలో రమణుంటున్నాడు. ఆ గది వంటిల్లు ముందరది.

స్నానం చేస్తుంటే అనిపించింది రమణకి- సంవత్సరంలో వీళ్ళకి ఎంత

దగ్గరే పోయానా అని. తల దువ్వుకుంటూ ఉంటే మళ్ళీ వచ్చారు చలపతిరావుగారు.

"స్నానం అయిందా బాబూ ?"

"అయిందండీ"

"పద పద భోజనం వడ్డించింది నీ కోసం" అంటూ చేయి పుచ్చుకుని లోపలికి తీసుకెళ్ళాడు రమణని.

"ఏమిటోయ్ మమ్మల్ని పూర్తిగా మర్చిపోయావా ఏం ? వెళ్ళాక పది రోజుల్లోనూ మొక్కుబడి కన్నట్టయినా ఓ ఉత్తరం ముక్క రాయొచ్చుగా ?" అంది పార్వతమ్మగారు.

"కాదండీ! మొదట నాలుగైదురోజులూ పని చాలా ఎక్కువగా ఉండటంతో రాయ లేకపోయా. తరవాత ఎలాగూ బయలు దేరుతున్నా కదా అని ఊరుకున్నా" అన్నాడు రమణ.

"ముందర భోజనం చెయ్యనియ్యవోయ్ తరవాత మాట్లాడొచ్చు" అంటూ మంద లించారు చలపతిరావుగారు.

వాళ్ళిద్దరి కబుర్లూ వింటూ గబగబా భోజనం కానిచ్చాడు రమణ. చేయి కడుక్కోవటానికి లేస్తుంటే అన్నా రాయన

"అన్నట్టు చెప్పటం మరిచిపోయా నోయ్. నీ కోసం పోస్టుమాన్ నాలుగైదు సార్లొచ్చాట్ట. ఏదో పార్సిలొచ్చిం దట. దార్లోనే కదా పోస్టాఫీసు. వెళ్ళే టప్పుడు చూసుకో అదేమిటో"

"అలాగే" అంటూ గదిలోకి వచ్చాడు రమణ. పదయింది. గదినించి ఆఫీసు ఓ ఫర్లాంగు దూరం. హడావిడిగా బట్టలేసుకుని గదికి తాళం వేసి బయలు దేరాడు. పోస్టాఫీసుకెళ్ళి సంతకం పెట్టి పార్శిల్ తీసుకున్నాడు. ఎవరిదగ్గర్నుంచా అని అడ్రసు చూశాడు.

మూర్తి దగ్గర్నుంచి!

చాలారోజుల తర్వాత మూర్తి దస్తూరీ చూడటంతో ఏదో వింతగా అని పించింది. ఆఫీసుకెళ్ళిన తరవాత ఊడ దీసి చూడొచ్చులే అనుకున్నాడు.

పదింబావయింది ఆఫీసులో అడుగు పెట్టేసరికి. కొలీగ్స్ అందరూ నవ్వుతూ పలకరించారు వంతు వంతునా. రమణ ఊరెళ్ళింది ఆఫీసు పని మీద. వెళ్ళి సూపరింటెండెంట్ ని కలిసి టూరు విశేషా లన్నీ ఆయనకి చెప్పి తన సీటులోకొచ్చి కూచున్నాడు.

మూర్తి పంపించిందేమయి వుంటుందో అర్థం కాలా రమణకి. పార్శిల్ విప్పు తుంటే కాస్త చేతులు వణికాయి. తీరా తీస్తే అదొక పాత డైరీ.

పైన ప్లాస్టిక్ కవరు కాస్త చిరిగి పోయి ఉంది. తెరవగానే లోపల ఓ కవరు కనబడింది. డైరీ టేబులు మీద పెట్టి కవరు చించాడు.

"రమణా

బహుశా ఇదే నా ఆఖరి ఉత్తరం అనుకుంటా.

నన్ను క్షమించు.

నన్ను వేధించిన సమస్య.

రాహువులా మింగేస్తోంది నన్ను.

మా నాన్నగారికి ఢిల్లీ ట్రాన్స్ ఫరయింది నాలుగునెలల క్రితం. ఒంటరినై పోయాను. చుట్టూ సముద్రం ఉన్నా తాగటానికి గుక్కెడు నీళ్ళుండవు.

అలాగే నా చుట్టూ ఎన్నో పరిచయాలు. కానీ హైదరాబాదు మొత్తం నాకంటూ ఒక్క మనిషి లేదు.

నేనిప్పుడు నీకు పంపిస్తున్న డైరీని

నువ్వు చదివిన తరవాత, జ్యోతికి అంద చేయాలి. మా నాన్నగారి తరవాత నువ్వొక్కడివే నాకు మిగిలిన ఆప్తుడివి.

ఈ నా కోరిక నువ్వు తీరుస్తావనే నా నమ్మకం.

జ్యోతి ఎవరో నీకు తెలియదు కదూ?

ఏమని చెప్పమంటావు ఆమె గురించి?

నేను ఆరాధించే దేవతని చెప్పనా?

నాకు ప్రాణం పోయగలిగే ఊపిరని చెప్పనా?

బహుశా ఒక్క మాటలో చెప్ప లేనేమో.

అసలు మాటల్లో చెప్పగలనా?

నా ఆలోచనలన్నీ ఆమెకి తెలియాలి. ఇదివరకే చాలా చెప్పానామెకు. ఎన్నో ఉత్తరాలలో నా ఆశలు నింపి పంపా నామెకు–

అయినా – ఎప్పటి కప్పుడు ఇంకా ఎంతో చెప్పాలనిపించేది.

ఇక నాకా అవకాశం ఉండదు. అందుకే ఈ డైరీ పంపిస్తున్నాను.

నన్నూ, వెర్రి తలలువేసే నా మన సునీ కాగితం మీద పెడితే – నా కెంతో ఉపశమనం కలిగేది. అలా ఎన్నో రోజులు రాసిందే ఈ డైరీ.

నేను రచయితను కాను,

ఇది రచన అంతకంటే కాదు.

నా మనసు చెప్పిందీ, నేననుభవించిందీ రాశాను.

తొమ్మిది నెలల క్రితం పరిచయ మయింది జ్యోతి నాకు. అయినా ఎన్నో యుగాలనుంచీ ఆమెని చూస్తున్నట్టుంది ఇప్పుడు.

ఆమె చుట్టూ నా భవిష్యత్తునలా పెన వేశాను. ఎన్నో కలలు కన్నాను. అందుకే–

ఇన్నాళ్ళూ నేననుభవించిన ఆరాటం, నన్ను చిత్రహింస పాలు చేసిన ఆవేదనా జ్యోతికి తెలియాలి. ఆమె అర్థం చేసు కోవాలి. ఒక్క కన్నీటి బొట్టు నా కోసం జ్యోతి ఖర్చు చెయ్యాలి.

మనిద్దరం ఇన్నేళ్ళూ ఎన్నిటినో పంచుకున్నాం, ఇద్దరం కలిసి ఇంకెన్నో పంచుకోవాలను కున్నాం. సాధించాలను కున్నాం.

కానీ నేను నిన్ను మోసం చేస్తున్నాను.

నీకు తోడుగా నేనుండక పోవచ్చు.

కారణం ఏమిటో నేనెందుకిలా చేస్తు న్నానో నీకు చెప్పటం నా ధర్మం.

ఈ డైరీ చదువు. నా బాధ నీ కర్థ మవుతుంది.

చదివిన తరవాత జ్యోతికి అంద చెయ్యి.

నా జీవితానికి ఓ ముగింపూ నా సమస్యకి సరయిన సమాధానం దొరి కాయి.

నువ్వొచ్చినప్పుడు ఈ మూర్తి కన బడకపోతే కోపం పెట్టుకోకు.

ఎప్పటికీ నీ వాడిలా ఉండాలనుకునే
నీ
మూర్తి

చేతులు వణకటం మొదలెట్టాయి రమణకి. అంతా అయోమయంగా ఉంది.

కింద పి.యస్. అని ఓ అడ్రసు రాసి వుంది. కుమారి జ్యోతి, కేరాఫ్ రామనాథ శర్మ, 3-4-88/1 బర్కత్‌పురా హైదరాబాదు.

ఎవరీ జ్యోతి?

గాబరా పుట్టింది రమణకి. ఏదో జరగకూడనిది జరిగిపోయిందనిపించింది.

ఎలా? ఏమయిందో తెలుసుకోవటం ఎలా?

మూర్తి నాన్నగారు కూడా హైదరాబాదులో లేరు. ఒకవేళ ఆయన ఇది వరకు హైదరాబాదులో ఉన్న ఆఫీసుకి ఫోను చేస్తే ఏమైనా తెలుస్తుందేమో అనుకుంటూ సూపరింటెండెంట్ టేబిల్ దగ్గరికి వెళ్ళాడు. రావుగారి ఆఫీసు నంబరు చూసుకుని ఎస్.టి.డి. చేశాడు హైదరాబాదుకి.

వెంటనే జవాబొచ్చింది.

"హలో! నేను వైజాగ్‌నుంచి మాట్లాడుతున్నాను. రావుగారబ్బాయి మూర్తి మీకు తెలుసా?"

"........."

"ఆఁ...నేనతని స్నేహితుణ్ణి."

"......."

"రావుగారికి ట్రాన్స్‌ఫరయిందని నాకు తెలుసు. వాళ్ళబ్బాయికి ఉద్యోగం వచ్చింది కదా. హైదరాబాదులో ఎక్కడుంటున్నాడో అడ్రసు కావాలి"

"......."

"నారాయణగూడా దగ్గరా? ఎడ్రసు తెలుసా మీకు?"

"......."

"తెలియదా? ఈ మధ్య మీకేమయినా కనిపించాడా?"

"......."

"లేదా?"

"......."

"సరే చాలా థాంక్సండీ" అంటూ పెట్టేశాడు రమణ. కంగారు మరీ ఎక్కువయింది. ఒళ్ళంతా చెమటలు పట్టాయి.

"ఏమిటండీ! ఏమయింది?'' అడిగాడు సూపరింటెండెంట్ రమణ వాలకం చూసి.

''నా కర్జంటుగా సెలవు కావాలండీ''

''సెలవా! దేనికి?''

''హైదరాబాదు వెళ్ళాలండీ."

''మార్చి నెలాఖరు కదా. మీకు తెలియందేముంది. ఊపిరి సలపనంత పని. అయినా ప్రసాదుగారి నడగండి. ఆయన సరేనంటే నాకేం అభ్యంతరం లేదు.''

ఆఫీసరు గదిలోకెళ్ళాడు రమణ. విష్‌చేసి వచ్చిన పని చెప్పాడు. కష్టమని చెప్పాడాయన.

పీకలదాకా కోపం వచ్చింది రమణకి. తమాయించుకున్నాడు. ఓ నిమిషం సేపు ఏం మాట్లాడలేకపోయాడు. నెమ్మదిగా అన్నాడు చివరికి.

''సార్! నా ఉద్యోగం కంటే ముఖ్యమైన విషయం ఇది ..."

''అయితే ఏమంటావు?" అన్నాడాయన నిర్లక్ష్యంగా.

ఒళ్ళు మండింది రమణకి

"దయచేసి మీరు పర్మిషనిస్తే నాకు రాజీనామా చేసే బాధ తప్పుతుంది'' అన్నాడు.

ఎగాదిగా చూశాడాయన రమణని.

''ఏమిటోయ్ అంత ఆవేశంగా మాట్లాడుతున్నావు? అయినా అంత అర్జంటు పనేముందయ్యా నీకు?''

"క్షమించండి, ప్రాణాల మీద కొచ్చింది కాబట్టి అలా మాట్లాడాను. నేను వెళ్ళాలి! ప్లీజ్! వెళ్ళక తప్పదండీ''

''ఎన్ని రోజుల సెలవు కావాలి?''

''వారం రోజులు కావాలండీ.''

''సరే. వెళ్ళి అప్లికేషన్ సూపరింటెండెంట్‌కి ఇవ్వు. అన్న మాట ప్రకారం వారం రోజుల్లో ఇక్కడుండాలి. మళ్ళీ అక్కడి కెళ్ళిన తర్వాత ఎక్స్‌టెన్షను లెటర్సు రాయబోకు''

ఆ తొందరలో ఆఫీసరుకి కృతజ్ఞతలు

కూడా చెప్పకుండా ఇవతలికొచ్చాడు రమణ. కాగితం మీద సెలవుకి అప్లికేషను రాస్తుంటే గుర్తుకొచ్చింది రమణకి.

తనదగ్గర డబ్బులేదు. ఎవర్నడగాలి?

నెలాఖరు రోజులు. మూడొందలన్నా కావాలి. చేతికి వాచీ,ఉంగరం కనబడ్డాయి తళతళా మెరుస్తూ. గాలి పీల్చుకున్నాడు.

అప్లికేషను ఇచ్చేసి, మూర్తి పంపించిన డైరీ తీసుకుని తొందరగా బయట పడ్డాడు ఆఫీసులోంచి.

రిక్షా ఎక్కి గదికి బయలుదేరాడు. ఒకటే ఆతృతగా ఉంది రమణకి. హైదరాబాదులో అడుగు పెట్టేదాకా మనసు కుదుట పడేదేమో.

చలపతిరావుగారు ఎక్కడికో వెళ్ళినట్టున్నారు. రెండు జతల బట్టలు బ్రీఫ్ కేస్‌లోవేసి తాళం వేసి, దారిలో డబ్బు తీసుకుని స్టేషనుకొచ్చాడు.

హైదరాబాదు వెళ్ళే ఎక్స్‌ప్రెస్‌కు ఇంకా గంటన్నర టైముంది. టికెట్ కొన్నాడు.

స్టేషనుబయట బార్ కనబడింది.లోపలి కెళ్ళి క్యాబిన్‌లో కూచుని ఓ హాఫ్‌బాటిల్ విస్కీ ఆర్డరిచ్చాడు. రెండు గుక్కలు కడుపులో పడిం తర్వాత – కాస్త నరాలు సర్దుకుని, మనసు కుదుట పడింది. నిబ్బరం వచ్చింది రమణకి.

పెట్టెలోంచి మూర్తి పంపిన డైరీ తీశాడు.ఓ రెండొందల పేజీలుంటాయేమో!

వాడు రాసిన కవరు కనిపించింది. మళ్ళీ చదివాడు.

రాస్కెల్! వాడు ఎదురుగా నిలబడి మాట్లాడుతున్నట్టే ఉంది. కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి రమణకి.

డైరీ తెరిచాడు.

మొదటి పేజీలో...

''ఈ డైరీ ఎంతమంది చదివినా ఫరవాలేదు.చదివిన మనిషి నేననుభవించిన చిత్రహింస· అర్థం చేసుకుని నే చేసిన తప్పులూ, వేసిన తప్పటడుగులూ – తన జీవితంలో పునరావృతం కాకుండా చూసుకుంటే నాకంతే చాలు.''

కడుపులోంచి బాధ ఉప్పెనలా ముంచుకొచ్చింది రమణకి. బలవంతాన ఆపుకున్నాడు.

డైరీ అంతా తిరగేశాడు ఓ సారి. ఏరోజు కారోజు రాసినట్టులేదు. ఓ క్రమమైన పద్ధతిలేదు. కానీ ప్రతీపేజీ అక్షరాలతో నిండిపోయి ఉంది.

మూర్తి రూపం ప్రతి అక్షరంలోంచీ తొంగి చూస్తున్నట్టనిపించింది.

గ్లాసులో మిగిలిన విస్కీ గడగడా తాగేసి చదవడం మొదలెట్టాడు రమణ.



''మన ఆశలూ ఆలోచనలూ చెప్పుకునేందుకు సరయిన మనిషి దొరకనప్పుడు ఏం చేయాలి?

నా బాధ ఎవర్తో చెప్పుకోవాలో అర్థం కావటం లేదు. అందుకే – నన్ను నేను కాగితం మీద రాస్తున్నాను.

నువ్వు లేనప్పుడు నా జీవితం మరపు రాని, మరిచి పోలేని మలుపు తిరిగింది.

ఆ మలుపు నా అదృష్టం అనుకునే వాణ్ని.



నువ్వెళ్ళిపోయిన నెల రోజులూ ప్రతీ నిమిషం ఏదో వెలితిగా ఉండేది. చుట్టూ ఎంత మంది స్నేహితులున్నా నువ్వులేని లోటు కొట్టొచ్చినట్లు కనపడేది.

ఆ పరిస్థితుల్లో ఒకరోజు రవీంద్ర భారతికెళ్ళాను - సినిమా వాళ్ళకెవరికో సన్మానం జరుగుతోందంటే. హాలంతా నిండి పోవటం మూలాన ఎంతోమంది నిల బడ్డారు కూడా. ఎవరో వాలంటీరు వచ్చి నన్ను పలకరించగానే ఇన్విటేషను చూపించాను.

రావుగారు రాలేదా అని అడిగాడు నన్ను. మా నాన్నగారు అటువంటి వాటికి రారని వాడికి తెలియదుకదా పాపం. పనిమీద వెళ్ళారని చెప్పాను. ఎవరో కూచున్న వాళ్ళని లేపి నన్ను కూచోబెట్టాడు.

వేదిక మీద 'సినీ రచయిత కాబోలు' సన్మానించబడే నటుణ్ణి పొగుడుతూ ఆకాశంలోకి ఎత్తేస్తున్నాడు. నాకు

ఎందుకో నవ్వొచ్చింది. బలే గమ్మత్తుగా ఉంటాయి ఈ ఉపన్యాసాలు. వేదిక మీదికి నలుగురు ఎక్కారంటే చాలు, ఒకళ్ళనొకళ్ళు పొగుడుకోవటం తప్పించి ఏం ఉండదు. కానీ జనానికి ఈ సోదంతా ఓ సరదా.

అందులో సినిమా వాళ్ళు.

వాళ్ళు దగ్గినా తుమ్మినా అందమే.

ఉపన్యాసాల ఘట్టం అయిపోగానే తెర జారింది. పది నిమిషాల విరామం.

నా ముందు వరసలో ఇద్దరు అమ్మాయిలు కూచున్నారు. ఎడమవేపు, ఎర్ర చీర కట్టుకున్న అమ్మాయి ఏదో చెబుతోంది. పక్కన– కుడివేపున కూచున్న అమ్మాయి నవ్వుతోంది. ఆ మాట్లాడే తీరుని చూస్తుంటే ఎర్రచీరలో అమ్మాయిని చూడాలనిపించింది. వాళ్ళు లేచి కాఫీకి వెళ్తే బావుండుననిపించింది.

నే ననుకొన్నట్టుగానే–ఇద్దరూలేచి నిలబడ్డారు. పక్కకి తిరిగినప్పుడు ఎర్ర చీర అమ్మాయి ఆకారం పూర్తిగా కనబడింది. ఎందుకో నా గుండె కాస్త వేగంగా కొట్టుకోవడం మొదలెట్టింది.

చామనఛాయలో ఉందా అమ్మాయి. నా వేపు లిప్తపాటు చూసింది. నుదుట కుంకుమ బొట్టు మెరుస్తోంది. నేనూ ఆమె వేపుచూస్తూ ఉంటంతో మొహం తిప్పేసుకుంది వెంటనే.

ఇద్దరూ ఏదో మాట్లాడుకుంటూ వెళ్ళిపోయారు. అలాగే అచేతనంగా కూర్చుండి పోయాను కుర్చీలో. ఆ అమ్మాయి పేరేమిటో తెలుసుకోవాలనిపించింది. లేచి క్యాంటీనుకి వెళ్ళాను.

ఓ మూలగా కనబడ్డారిద్దరు, కాఫీ తాగుతూ. వాళ్ళకి కాస్త దగ్గరలో నిలబడ్డాను నేనూ కాఫీ తీసుకుని. వాళ్ళ మాటల్లో తెలిసింది ఆ అమ్మాయి పేరు.

జ్యోతి!

జ్యోతిలాగే వుంది మనిషికూడా.

ఆ మనిషి నాక్కావాలనిపించింది!

తొలి చూపులో ప్రేమంటారు చూడు నాలో భావన ప్రేమా, వ్యామోహమా, నాకు ఆ క్షణంలో తెలియలేదు. అందరూ ప్రేమన్నారు దాన్ని.

మళ్ళీ వాళ్ళ వెనకాలే వెళ్ళే బావుండదని, నేనే ముందర హాల్లోకి పోయి కూచున్నా. తెర లేవగానే సంగీత విభావరి నా ఆలోచనలు ఆ అమ్మాయి చుట్టూ తిరుగుతున్నాయి. సరిగ్గా నా ఎదురుగుండా కూచున్నారు వాళ్ళు. ఆమె జడలో మల్లెలు గుబాళిస్తున్నాయి.

మత్తెక్కింది నా ఊపిరికి!

ఆ అమ్మాయినే చూస్తూ కూచున్నా చాలాసేపు. అటూ ఇటూ కదిలినప్పుడు తప్ప మొహం కనిపించటంలా–

జనగణమన పాడుతుంటే నాకు తెలివొచ్చింది. అందరూ నిలబడ్డారు. నే కూచునే ఉంటంతో నలుగురైదుగురు నా వేపు చూశారు. ఇబ్బందిగా అనిపించి నేనూ నిలబడ్డాను. ఆ నాటి హడావిడి ముగిసింది. బయటికి నడుస్తూ ఓ సారి నేనున్న వేపు చూసిందా అమ్మాయి.

మళ్ళీ ఓ అరక్షణం ఆమె కళ్ళు నన్ను పలకరించాయి.

ఆమె వేపే చూస్తూ నేనూ బయటికి నడుస్తున్నాను. వెనకనుంచి ఎవరిదో చెయి భుజంమీద పడటంతో ఉలిక్కిపడ్డాను.

వెనక్కి తిరిగితే వేణు కనిపించాడు.

"ఏరా రెండుసార్లు పిలిచినా వినబడ లేదా?" అన్నాడు.

"సారీ ఏదో ఆలోచిస్తున్నారా."

"నాకు తెలుసులే నీ పరధ్యానం ఏమిటో" అంటూ మోచేతో పొడిచాడు.

వాడిని అక్కడ ఏం మాట్లాడనివ్వకుండా బయట హోటల్లోకి తీసుకెళ్ళాను. ఇద్దరం కూచున్నాం.

"ఒరే వేణూ-ఆ అమ్మాయి..."

"జ్యోతి-ఆ అమ్మాయి పేరు."

"నాకు తెలుసు ఇంకా వివరాలు చెప్పు."

"ఎం.ఏ. ఫైనల్ చదువుతోంది."

"వాళ్ళ నాన్న"

"రామనాథశర్మ అని రైల్వేలో స్టేషను మాష్టరుగా చేసి రిటైరయ్యారు"

ఇంక తరువాత ఏం అడగాలో, ఎలా మాట్లాడాలో తోచలేదు. నన్నాట పట్టించాలనుకున్నాడు కాబోలు వేణు. గ్రాంధికం మొదలెట్టాడు.

"యువరాజా! తమరి కుతూహలము చూచుచున్న నాకు కడుంగడు ఆశ్చర్యము కలుగుచున్నది"

"ఎందుకు ?"

"బర్కత్‌పూరా అను వాడయందు వారి నివాసము. పాండవుల వంటి సోదరులు ఆమెను ఎల్లవేళల యందు వేయి కన్నులతో రక్షింతురు."

"దుర్మార్గుడా! నేను కీచకుడిలా కన బడుతున్నానా ?"

"కాదులే. అయినా ఎందుకు నీకీ వివరాలు ?"

"ఆ అమ్మాయి..." ఆగాను. ఏం చెప్పాలో అర్థం కాలా.

"ఏమిటోయ్ ?"

"నాకు ఈ మధ్యన ఏవో పెళ్ళి సంబంధాలు వచ్చాయి. ఇప్పట్నించే పెళ్ళి చేసేద్దామని మా వాళ్ళ ఆలోచన. ఆ అమ్మాయి నాకెంతో నచ్చింది. అందుకే నిన్నివన్నీ అడుగుతున్నా ?"

"ఆమెను పెళ్ళి చేసుకుందామనా ?"

"అవును"

"బావుంది నీ సెలక్షను. నాకు తెలిసింది చెప్పాను. నీకింకా ఏమన్నా తెలుసుకోవాలనుకుంటే శకుంతలగారు తెలుసుగా నీకు. నాటకాలు వేస్తూ ఉంటుంది చూడు?"

"ఆవిడ తెలియకేం-చిన్నప్పట్నించీ తెలుసు నాకు"

"ఆవిడని అడిగితే ఆ అమ్మాయి గురించి అంతా చెబుతుంది. అవునూ పెళ్ళిమీద గాలి మళ్ళిందేమిటి ఉన్నట్టుండి ?"

"నా కసలు ఇప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోవాలనే ఉద్దేశం ఉండేది కాదు. నీకూ తెలుసా విషయం. కాని ఎందుకో ఈ అమ్మాయిని చూడగానే అనిపించింది ;— పెళ్ళాడి నా మనిషిని చేసుకోవాలని"

"చెప్పానుగా నీకు. శకుంతలగారింటి కెళ్ళు. ఆవిడకంతా తెలుసు ఆ అమ్మాయి గురించి"

"అలాగేలే"

"ఇంకేమిటి కబుర్లు?"

"నువ్వే చెప్పాలి"

"ఉద్యోగం చేద్దామనా ? ఇంకా చదువుదామనా?"

"మా నాన్నగారు చదవమంటున్నారు ఇంకా. ఏమో ఏంచేస్తానో నాకే తెలియదు. లేద్దామా టైమయింది ?"

"పద పోదాం"

ఇద్దరం లక్డీకాపూల్ దాకా వచ్చి విడిపోయాం. మెల్లిగా నడుస్తూ ఇంటికి బయలు దేరాను. నా మనసులో ఆ

అమ్మాయి రూపం ముద్రించుకుపోయింది బొమ్మ గీసినట్లు.

ఎందుకు నాలో ఈ స్పందన?

సమాధానం దొరకలా రాత్రంతా ఆలోచించినా.

తియ్యటి కలలు కంటూ తెలతెలవారుతుండగా నిద్రపోయాను.

అలా ప్రవేశించింది జ్యోతి—నా జీవితంలోకి, నా మనసులోకి.



మర్నాడు పొద్దున్నే లేవలేకపోయాను.

పదకొండయింది మెలకువొచ్చేసరికి. స్నానం, భోజనం కానిచ్చి కూచోగానే ఆ అమ్మాయి గుర్తొచ్చింది. ఆలోచిస్తూ పడుకున్నాను. సాయంత్రం ఇంక ఉండబట్టలేక శకుంతల గారింటికి బయలు దేరాను.

బయలుదేరానన్న మాటేగాని అసలా విడను ఎలా కదపాలో తోచలా. ఏమయినా సరే అడగాలని నిశ్చయించుకున్నా. చిక్కడపల్లిలో ఎక్కడో ఉంది ఆవిడిల్లు. అడ్రసు వెతుక్కుంటూ వెళ్ళేసరికి చీకటి పడింది.

ముందర వసారాలోంచి ఎవరివో నవ్వులు వినిపించాయి; గేటు తీసిన చప్పుడికి శకుంతలగారు కిటికీలోంచి నన్ను చూసి గుమ్మం దగ్గర కొచ్చారు.

"ఏమిటి బాబూ ఇలా వచ్చావు ?"

"మా పెద్దమ్మ గారింటి కొచ్చానండీ. మిమ్మల్ని చూసి చాలా రోజులయింది కదా అని ఇటువేపొచ్చాను. కులాసానా?"

"ఆఁ ఏదో ఇలా ఉన్నాం, లోపలికి రా; తలుపు దగ్గర నిలబడ్డావేం ?"

లోపలికి అడుగు పెట్టగానే గుండె ఝల్లుమంది. ఆ అమ్మాయి...జ్యోతి. అక్కడే వుంది. నన్ను ఆ అమ్మాయికి పరిచయం చేశారు శకుంతలగారు.

"రావుగారు తెలుసుగా జ్యోతీ నీకు ? ఆయన పేరు వినే ఉంటావు. వాళ్ళ పెద్దబ్బాయి మూర్తి బి. ఎస్సి. పాసయ్యాడు"

నావేపు తిరిగి "ఈ అమ్మాయి జ్యోతి. ఎం.ఎ. చేస్తోంది. అయ్యో కాఫీ నీళ్ళు మరిగి పోతూంటాయి. మర్చేపోయానో సంగతి. మాట్లాడుకుంటూ ఉండండి" అంటూ లోపలికెళ్ళారు శకుంతలగారు.

ఏం మాట్లాడను, ఏమని మాట్లాడను ఆపాటి పరిచయంతో.

ఆ అమ్మాయి తలొంచుకుని ఏదో పత్రిక తిరగేస్తూ కూచుంది. కళ్ళారా చూస్తూ కూచున్నా నేను కూడా.

ఎంతో బావుంది. చక్రాల్లాంటి కళ్ళు. నవ్వినపుడు బుగ్గలు సొట్టబడి చూట్టానికి ముద్దొస్తూ ఉంటుంది.

ఏదో బలమైన ఆకర్షణ !

సాదాచీర కట్టుకుంది, పమిట భుజం చుట్టూ కప్పుకుని ఎంతో నిండుగా కనిపించింది.

పది నిమిషాలు నిశ్శబ్దం కాపరం చేసింది. ఏమన్నా మాట్లాడదామనిపించింది ఆ పది నిమిషాలూ.

కానీ—

ఎంత ప్రయత్నించినా మాట గొంతుక దాటి రాలేదు.

నన్ను రక్షించటానికే అన్నట్టు లోపల్నుంచి శకుంతల గారమ్మాయి వచ్చింది ఫలహారం తీసుకుని.

శకుంతలగారి అమ్మాయి - రాధ- నిజానికి జ్యోతి కంటే అందంగా ఉంటుంది. పసిడిరంగు, చక్కని కనుముక్కు తీరు, కుందనపు బొమ్మలా ఉంటుంది. ఎన్నోసార్లు చూశా నా అమ్మాయిని.

కానీ, చిత్రం !

జ్యోతిని చూసినప్పుడు నాలో కలిగిన చైతన్యం రాధనే కాదు, ఏ అమ్మాయిని చూసినా నా కనిపించలేదు.

అందుకే అన్నారు కాబోలు అందం చూసే కళ్ళలో ఉంటుందని.

పలకరించింది రాధ నన్ను చనువుగా.

అప్పుడే నావేపు చూసింది జ్యోతి. ఆ కళ్ళు నన్ను అయస్కాంతంలా ఆమె వేపు లాగుతున్నట్లనిపించింది.

"ఎం. ఏ.లో మీ సబ్జెక్టు ఏమిటి ?" అడిగాను జ్యోతిని.

"తెలుగు"

"మేం ఇద్దరం ఒకే గూటి పక్షులం" అంది రాధ నవ్వుతూ.

"అహాఁ అలాగా"

"నేనొస్తానే ఇక" అంది జ్యోతి.

"ఇదేమిటి టిఫిను చేయకుండానే వెళిపోతావా ? పెట్టినవన్నీ పెట్టినట్టే వున్నాయి. ప్లేటు ఖాళీ అయ్యేదాకా వెళ్ళటానికి వీల్లేదు"

"ఆకలి లేదు. ఉంటే నాకు మీ ఇంట్లో మొహమాటం దేనికి ? ఆయన్ని ఖాళీ చేయమను. నావల్ల కాదు"

"పోనీ కాఫీ అయినా తాగిపో"

"ఒద్దొద్దు. వెళిపోవాలి. మా నాన్నా, అమ్మా బెంగుళూరు వెళ్ళారు. ఇంట్లో అక్క ఒక్కతే ఉంటుంది. టైము కూడా చాలా అయింది" అంటూ నా వేపు తిరిగి వస్తానండీ అన్నట్టు తలూపి వెళ్ళిపోయింది జ్యోతి. రాధ కూడా సాగనంపి రావటానికి వెళ్ళింది.

ఏమిటో జ్యోతి వెళ్ళిపోగానే మనసంతా ఖాళీగా అనిపించింది. ఆమెతో గంటలు తరబడి కూచుని, ఆమె కళ్ళలోకి చూస్తూ, కబుర్లు చెప్పే అవకాశం నాకొస్తే ఎంతో బావుంటుందనుకున్నా.

శకుంతల గారొచ్చారు కాఫీ తీసుకుని.

"వాళ్ళు వెళ్ళిపోయారా?"

"ఆ వెళ్ళారండీ"

"ఇదెక్కడి కెళ్ళిందీ?"

"రాధా? ఆ అమ్మాయితో వెళ్ళింది. బస్టాండుదాకా దింపి రావటానికేమో"

"చీకటి పడింది కదా...ఇదుగో కాఫీ తీసుకో చల్లారి పోతోంది"

ఇద్దరం కాఫీ తాగాం.

"మంచి చురుకైన పిల్ల జ్యోతి. చదువుమీద ఎంత శ్రద్ధో. బి.ఏ.లో యూనివర్సిటీ ఫస్టు తెలుసా ?"

ఆవిడ ఉన్నట్టుండి ఆ అమ్మాయి గురించి తనంతట తానే మాట్లాడటం మొదలెట్టే సరికి నేనొచ్చిన పని ఎలా ప్రారంభించాలో అర్థం కాలేదు.

ఏమనుకుంటుందో వివరాలడిగితే ? అంతా చెప్పాలి ఆవిడకు. లేకపోతే 'పరాయి ఆడపిల్ల మీద ఇతని కెందుకింత ఆసక్తి' అనుకోవచ్చు.

ఎలా మొదలు పెట్టాలో తెలియలేదు.

"నీ బి ఎస్సి అయిపోయింది కదా, క్లాసొచ్చిందా ?"

"ఆ. సెకండ్ క్లాసొచ్చిందండీ"

"ఎం.ఎస్సీ. చేస్తావా ?"

"మా నాన్నగారు చెయ్యమంటున్నా రండీ! ఇంకా ఏం నిశ్చయించుకోలేదు"

"నిశ్చయించుకునేందుకు ఏముంది బాబూ దీంట్లో. ఎంతవరకూ చదువు కున్నా, చెప్పించేందుకు మీ నాన్న గారున్నారు కదా?"

"అవున్లెండి. బహుశా ఎం.ఎస్సీ. చేస్తా ననుకుంటా. ఇంకా టైముంది కదా. వచ్చే నెల్లో కానీ కాలేజీలు తెరవరు"

"చేరిపో నాయనా హాయిగా. తెలివైన వాడివి. నువ్వూ మీ నాన్నగారంత పెద్ద ఆఫీసరువి కావాలి"

"'పండితపుత్రా శుంఠా' అంటారు. మరి ఏమవుతుందో చూడాలి" అన్నాను నవ్వుతూ.

"అలా ఎందుకనుకుంటావు? ఈ సామెతలు నీలాంటివాళ్ళకు్కాదు."

టైము చూసుకున్నా తొమ్మిదయింది. ఎలా అయినాసరే అడగాలనిపించింది. అడిగాను చివరికి.

"ఈ అమ్మాయి..అదే జ్యోతి-మీకెన్ని రోజులనుంచి తెలుసు?"

"నాలుగేళ్ళబట్టి తెలుసు. బి. ఏ లో కూడా రాధా, ఆమె క్లాస్‌మేట్స్. ఏం... దేనికి?"

"ఆ అమ్మాయి గురించి నాకు కొన్ని వివరాలు కావాలండీ"

"వివరాలంటే?"

"వాళ్ళ కుటుంబం గురించి"

"దేనికో చెప్పే..."

ఒక్క క్షణం తటపటాయించాను.

"దేనికయ్యా?"

"మీరిప్పుడప్పుడే ఎవరితోనూ అన బోకండి.అనుకున్నవి జరుగుతాయో లేదో మనకి తెలియదు."

"ఏమిటయ్యా?"

"ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోవా లనుంది"

"పెళ్ళా ?"

"అవునండీ ! ఇన్నాళ్ళూ నాకసలు పెళ్ళి మీద ఆలోచనే ఉండేది కాదు. అలాంటిది ఈ అమ్మాయిని చూడగానే ఎందుకో పెళ్ళి చేసుకోవాలనిపించింది"

"అసలు ఈ అమ్మాయిలో ఏం చూసి నువ్విష్టపడ్డావు ?"

"ఏం చూసి అనడిగితే ఎలా చెప్ప మంటారు ? తొలి చూపులో ఘాటు ప్రేమని సినిమా డైలాగు చెప్పనా ?"

"అహ ! ఆ పిల్లని పెళ్ళిచేసుకోవాలనే ఉద్దేశం నీకు ఎందుకు కలిగిందా అని ?"

"అలా హోమ్లీగా **ఉండే** అమ్మాయి లంటే నాకిష్టం. అందుకని"

"బాగానే ఉంది మూర్తీ నువు చెప్పింది. కానీ..."

"ఆ అమ్మాయి ఎం.ఏ. చేస్తోంది. నేనొట్టి గ్రాడ్యుయేట్‌ని. అదేనా మీ అను మానం? అది సమస్య కాదనుకుంటాను"

"అదికాదులే ఆ పిల్ల నీ కంటే పెద్ద దేమో"

ఖంగు తిన్నాను నేను.

"నా వయసు ఇరవై నాలుగు"

"వయసు సరిపోతుందిలే. కాని వాళ్ళ పెద్ద వాళ్ళేమంటారో"

"మా వాళ్ళను పంపించమంటారా మాట్లాడటానికి ?"

"వద్దు మూర్తీ తొందర పడకు. ఇప్పు డడిగితే బావుండదు"

"దేనికని ?"

"నువు కూడా ఎం. ఎస్‌సి పూర్తి చెయ్యి. మంచి ఉద్యోగం చూసుకో. చక్కగా సెటిల్ అయింతర్వాత అడిగితే దర్జాగా, హుందాగా వుంటుంది"

"ఉద్యోగం నాకు సమస్య కాదండీ. మా నాన్నగారికి చెప్పే రేపీపాటికి కనీసం ఓ ఏడెనిమిదొందలొచ్చే ఉద్యోగం వేయిస్తారు"

"అసలు నీకిప్పుడే తొందరెందుకయ్యా పెళ్ళికి?"

"పెళ్లికి తొందర కాదండీ. నా ఆరాటం మీ కర్థం కావటంలా"

"ఏమిటి ?"

"ఎలా చెప్పమంటారు ?"

"ఏం కాదు. చెప్పు"

"మీకో కథ చెప్తాను వినండి. నేనో ఇంగ్లీషు సినిమా చూశాను. ఆ కథే ఇది. దాంట్లో ఓ కోటీశ్వరుడి కూతుర్ని ఓ పేద వాడు ప్రేమిస్తాడు. వెళ్లి ఆ పెద్ద మనిషిని అడుగుతాడు ఆ అమ్మాయిని తనకిచ్చి పెళ్లి చెయ్యమని. నవ్వొస్తుంది కోటీశ్వరుడికి. చివరికి జాలేసి ఎప్పుడో సముద్రంలో మునిగిపోయిన తన ఓడనీ, దాంట్లోని బంగారాన్నీ వెతికి తెస్తే కూతుర్నిచ్చి పెళ్లి చేస్తానంటాడు. ఈ అమాయకుడు కోటీశ్వరుడి మాటలు నమ్మి ఓ ఇరవయ్యేళ్లు రాత్రనకా, పగలనకా కష్టపడి కావలసింది సాధిస్తాడు. సాధించాక ఎన్నో ఆశలతో, ఎంతో ఉత్సాహంతో కోటీశ్వరుడి దగ్గరికి వెళ్తాడు. ఇతను వెళ్ళేసరికి ఎవరిదో పెళ్లి జరుగుతూ ఉంటుంది. ఆ పెళ్ళి కూతురి తల్లి ఎవరో తెలుసా ?"

''ఎవరు ?''

''ఈ అర్భకుడు ప్రేమించిన మనిషి ?''

విరగబడి నవ్వారు శకుంతలగారు. నన్ను గేలిచేస్తున్నట్లనిపించింది నాకెందుకో.

"మూర్తీ! నీకాభయం ఏం అక్కర్లేదు. నీకోటి చెప్పనా?"

"ఏమిటి?"

"జ్యోతికి వాసంతి అని ఓ అక్కయ్యుంది. ఆ అమ్మాయి రీసర్చ్ చేస్తోంది."

"అయితే ?"

"ఆ అమ్మాయికి పెళ్ళయ్యేవరకూ వాళ్ళు జ్యోతి విషయం ఆలోచించరు. వాళ్ళమ్మగారు మా ఇంటికి వస్తూనే ఉంటారు. ఇంతెందుకూ లోగడ ఇద్దరు ముగ్గురు ఇలాగే అడిగితే వల్ల కాదన్నారు."

"గట్టిగా తెలుసా మీకు?"

"తెలుసు కాబట్టే చెబుతున్నాను. వాళ్ళ నాన్నగారంతా ఓ పద్ధతి ప్రకారం చేసే మనిషి. మిన్నువిరిగి మీద పడినా సరే ఆయన అనుకున్నది అనుకున్నట్టు, అనుకున్నప్పుడు చేస్తారు. అర్థమయిందా? అందుకని నువ్వు హాయిగా ఎం.ఎస్‌సి. పూర్తి చేయి ముందర. తర్వాత చూద్దాం."

"కొన్ని రోజులు ఆగమన్నా ఆగుతానండీ. వాళ్ళు అవునో కాదో చెబితే చాలు నాకు."

"లాభం లేదయ్యా,!వాళ్ళసలు మాట్లాడరు."

"పోనీ ఆ అమ్మాయిని కలిసి, అసలు విషయం చెప్పి, ఆమె అభిప్రాయం ఏమిటో తెలుసుకోమంటారా?"

"అబ్బే, అసలు ఆ ఆలోచనే లేదు జ్యోతికి. ఎం.ఏ. పూర్తికాగానే రీసర్చ్ చేయాలనుంది కూడా. ఒక వేళ నువ్వ

డిగినా నవ్వి తీసిపారేస్తుంది."

"అంతేనంటారా?"

"అంతే. ఓ రెండు మూడేళ్ళు పడు తుంది వాళ్ళకర్థమయ్యే పెళ్ళయేటప్పటికి. నువ్వేం తొందరపడకు. ఈ లోపల నువ్వు నే చెప్పినట్లు చెయ్యి."

ఆ అమ్మాయితో ఎంతో చనువుంది కదా, ఓ తల్లిలా నా మనసు అర్థం చేసు కుని సహాయం చేస్తుందనుకున్నా.

అణగారి పోయాను నే నావిడ మాట లకి.

చివరికి చేసేదిలేక అన్నాను-

"సరే. మీరు చెప్పినట్లే చేస్తాను. మరింక నే వెళ్ళొస్తానండీ."

"అలాగే! నే నప్పుడే అనుకున్నాలే. ఎప్పుడో తప్ప మా ఇంటికి రానివాడివి ఉన్నట్లుండి ఊడిపడ్డావంటే ఏదో పని మీదే వచ్చావని" అన్నారావిడ నవ్వుతూ.

నేనూ నవ్వాను ఏమనాలో తోచక. ఇంటికొచ్చేశాను. మనసంతా భారంగా



ఉంది. నా గదిలోకి వెళ్ళి పడుకున్నాను చీకట్లోనే. ఓ గంటసేపు అలాగే కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ పడుకున్నా.

ఎవరో లైటు వేశారు.

నాన్నగారు.

"అన్నం తిన్నావా?" అనడిగారు.

"లేదు ఇప్పుడే వచ్చాను. మీరు తిన్నారా?"

"నేనూ తినలేదు. పద ఇద్దరం తిందాం"

ఇద్దరం అన్నానికి కూచున్నాం. నాకు హితవుతప్పిందేమో అన్నం సయించటం లేదు.

"ఏమిటిరా అలా ఉన్నావు?"

"మీకో విషయం చెప్పాలి."

"ఏమిటి?"

"నన్నర్థం చేసుకుంటారా?"

చిత్రంగా చూశారాయన నా వేపు-నవ్వారు.

"చెప్పు..."

"నేనో అమ్మాయిని చూశాను."

".........."

"పెళ్ళి చేసుకోవాలనుంది."

".........."

"ప్రేమా-ప్రేయసీ కాదులెండి. పెళ్ళి చేసుకోవాలనుంది అంతే!"

".........."

"ఆ అమ్మాయి పేరు జ్యోతి. ఎం.ఎ. చదువుతోంది. మనవాళ్ళే. మీకు అభ్యంతరం ఉండదనుకుంటా."

".........."

"మీకు తప్పకుండా నచ్చుతుంది. ఎంతో హోమ్లీగా ఉంటుంది. సాదా మనిషి."

"........."

"పెద్ద అందమైంది కాదు. ఎర్రగా బుర్రగానూ ఉండదు. పొట్టిగా ఉంటుంది. కానీ నాకు నచ్చింది."

అప్పటివరకూ ఆపుకొన్న నవ్వును ఇంక దాచుకోలేకపోయారు నాన్నగారు.

"చాల్లే ఇంక చెప్పకు. రేపు నాకు అడ్రసు తెచ్చిపెట్టు" అంటూ చేయి కడుక్కొని లేచి తన గదిలోకి వెళ్ళిపోయారు.

నాన్నగారు తలచుకుంటే ఏ పనయినా అవుతుంది.

పట్టరాని సంతోషం నన్ను ముంచేసింది ఉప్పెనలా.

ఇందాకట్నుంచీ ఆరాటం మూలాన అన్నం సయించలేదు. ఇప్పుడు ఆనందం పట్టలేక చేయి కడిగేశాను కంచంలో.

పాట పాడాలనిపించింది.

ఎగిరి గెంతాలనిపించింది.

ఎవరితోనన్నా చెప్పాలనిపించింది ఇదంతా. ఎవరితో చెప్పను?

అలాగే కూచుండిపోయాను కుర్చీలో. ఎంతసేపు కూర్చున్నానో నాకు తెలియదు. అమ్మ వచ్చి నన్ను కదిపేదాకా మరో ప్రపంచంలో తేలిపోయాను.

"ఏరా! నువ్వింకా నిద్రపోలేదా?" అడిగింది అమ్మ.

ఉలిక్కిపడ్డానప్పుడు.

"ఇదిగో! ఇప్పుడేకదే అన్నం తిన్నది"

"నీకేమయినా మతిపోయిందా? మీరు ఇద్దరూ అన్నానికి ఎప్పుడు కూచున్నారో తెలుసా? పదిన్నరకి."

"అయితే?"

"ఇప్పుడు ఒంటిగంటయింది."

"ఛ! నిజంగానా?"

"ఛా ఏమిటి నీ మొహం. లే! వెళ్ళి

పడుకో!"

గదిలోకి వెళ్ళి మంచంమీద వాలాను, కమ్మటి కలలు కంటూ ఎప్పుడు నిద్రలోకి జారానో నాకే తెలియదు.



"సార్" అన్నాడు బేరర్.

తలెత్తి చూశాడు రమణ ఏమిటన్నట్టు.

"బిల్ తెచ్చాను సార్ !"

టైము చూసుకున్నాడు. ఇంకా పదిహేను నిమిషాలు టైముంది రైలు బయలుదేరటానికి. ఇంకాస్త ఆలస్యమైతే రైలు తప్పిపోయేది.

బేరర్ ఎంతో మంచివాడిలా కనిపించాడు రమణకి. రెండు రూపాయలు టిప్ ఇచ్చి స్టేషనుకొచ్చాడు.

రిజర్వేషను చేయించుకోలేదు కాబట్టి, జనరల్ కంపార్ట్మెంటు చూడటం మొదలెట్టాడు. ఎంత వెతికినా ఎక్కడా ఖాళీ సీటు కనిపించలేదు. జనం విపరీతంగా నిండిపోయి, రైలు కదిలితే పడిపోతుందేమో అనిపించింది.

రైలు కదిలింది.

చేసేదిలేక తనూ ఎక్కాడు. నిలబడటానికి కూడా చోటు దొరకటం కష్టమైపోయింది. ఎంతో మంది నిలబడ్డారు.

పైన బెర్తుమీద ఎవరిదో దుప్పటి పరచి వుంది. ఎవరిదో అడిగాడు రమణ కింద సీట్లో కూచున్నావిడని.

కిటికీ దగ్గర కూచున్నాయన అన్నాడు రమణతో.

"అది మాదండీ!"

"అలాగా. మాస్టారూ మీరెక్కడిదాకా వెళుతున్నారు?"

"హైదరాబాదుదాకా" అన్నాడాయన.

"పైన పడుకుంటారా మీరు?"

"మరింకెందుకు పరిచాననుకున్నారు దుప్పటి?"

తెలివిగా మాట్లాడాననుకొని పోజు పెట్టాడాయన.

ఒళ్ళు మండింది రమణకి.

"సీట్లో కూచున్నారుకదా! మీరు పడుకుంటానికి వేసుకున్నారని నాకు తెలియదు లెండి. బావుంది కూచోటానికి సీటూ, పడుకోటానికి బెర్తూ. కానీ గొడవేంటంటే ఇది రైలు. అందులోనూ నరకంలాంటి జనరల్ కంపార్టుమెంటు. మనిల్లు కాదు. ఇంట్లోలా బెడ్రూమూ, డ్రాయింగు రూమూ వగైరాలు ఇక్కడ వుండవు. కూచోటానికి చోటు దొరికితే చాలు ఎవరికైనా! అందుకని మీరు క్రింద కూచున్నప్పుడు నేను పైన పడుకుంటాను. మీరు పైన శయనిస్తే నేను కింద కూచుంటాను. సరేనా సార్?" అంటూ పైకి ఎక్కాడు రమణ.

"ఏమిటి జబర్దస్తీ చేస్తున్నారా?"

"అబ్బే సర్దుబాటు. 'సొంత లాభం కొంత మానుకు పొరుగువాడికి తోడు పడవోయ్' అంటారు చూడండి"

ఏమనుకున్నాడో ఆయన "నేను పడుకుంటాను మీరు కింద కూచోండి" అన్నాడు.

కూచున్నాడు రమణ కిటికీ దగ్గర సీటులో. ఎండ మండిపోతోంది. హోరున వడగాలి.

రమణ చొరవా, ధైర్యం కాసేపు

వింతగా చూశారు చుట్టూ ఉన్నవాళ్ళు. తరువాత ఎవరి గొడవలో వాళ్ళు మునిగి పోయారు.

మూడేళ్ళ సంవత్సరంలో ఎంతో మారి పోయాడనిపించింది రమణకి. ఆడపిల్లలూ ప్రేమించటాలూ ఇవన్నీ నవ్వితేసిపారేసే వాడు. ఆవులిస్తే పేగులు లెక్కబెట్టగలడు. చావు తెలివి వాడిది.

ఎంతోమందికి ఇటువంటి విషయాల్లో సరైన సలహా ఇచ్చి సహాయంచేసేవాడు. వాడి సలహా విన్న వాడు ఆచరణలో పెట్టే జీవితంలో గెలిచేవాడు.

అటువంటిది ఈ గొడవలో ఇంతగా మునిగిపోయి తనూ మిగతావారందరిలా ఓ వెర్రిబాగులవాడిలా తయారయ్యా డంటే ఆశ్చర్యమేసింది రమణకి.

డైరీ తెరిచి మళ్ళీ చదవటం మొద లెట్టాడు రమణ.

* * *

ఆ రాత్రి నాన్నగారితో మాట్లాడి నందుకు మనసు ఎంతో తేలికపడింది. మర్నాడు పొద్దునే లేచి స్నానం చేసి పూజ చేసుకున్నా-నేను కోరుకున్న మనిషి నాకు దక్కేలా చేయమని. భోంచేసి గదిలోకెళ్ళి పడుకున్నా.

ఎందుకో మనసు శంకించింది నా ఆశ నెరవేరుతుందా లేదా అని. ఆ అమ్మాయి ఎం.ఏ. చేస్తోంది. నేను గ్రాడ్యుయేట్‌ని. చదువుకున్నది కాబట్టి వంటింటి కుందేలు కాదు. ఎందరో మనుషులతో ఎన్నో పరి చయాలు ఉండి ఉంటాయి.

అటువంటప్పుడు ఆ అమ్మాయి ఇంకె వర్నయినా పెళ్ళి చేసుకోవాలనుకొని ఉంటే?

ఆమె ఆశలూ, కోరికలూ ఆమెకీ ఉంటాయి.

కన్నెపిల్లలు సహజంగా కలలు కన్నట్టు ఈమె కూడా బాగా చదువు కున్నవాడూ, డబ్బున్నవాడూ, అందమైన వాడూ భర్తగా కావాలని కోరుకుంటే?

ఏమో!

ఆమెని చూస్తుంటే అలా అనిపించదు ఎందుకో. సాదాగా ఉంటుంది. అటువంటి వాళ్ళు ఆకాశానికి నిచ్చెన వెయ్యరు, నేల మీద నడుస్తారు.

నాన్నగారితో అప్పుడే ఈ విషయం చెప్పేయటంలో నేను తొందర పడ్డానా అని అనుమానం వేసింది.

ఆ అమ్మాయి చిన్నపిల్ల కాదు. ఆమె అభిప్రాయం తెలుసుకోకుండా నేనిలా చేయటం నాకెందుకో సబబుగా తోచలేదు.

ఆ అమ్మాయిని కలిసి తెలుసుకుంటే... ఏమనుకుంటుందో.

చాలా సేపు ఆలోచించాను ముందు వెనుకలు. ఆలోచనకి అంతు దొరకలేదు. చివరికి ఆ అమ్మాయిని కలిసి నా మనసులో మాట చెబుదామనుకున్నాను.

కాని-ఎలా?

ఎక్కడ కలవాలి ఆమెని? వాళ్ళింటికి వెళ్ళలేను. నాకూ, ఆ అమ్మాయికీ ఇద్దరికీ తెలిసినవాళ్ళెవరున్నారు. శకుంతలగారు తప్ప ఇంకెవరూ లేరు. ఆవిడతో లాభం లేదు. మరెలా? ఏ దారీ కనిపించలేదు.

బర్కత్‌పూరాలో ఎక్కడో వాళ్ళ ఇల్లు? ఎటూ తెగక-ఆ చుట్టుపక్కల ఎక్కడన్నా కనబడుతుందేమోనని సాయంత్రం బట్టలేసుకుని బయలుదేరాను.

నారాయణగూడాలో మురళి బాబాయి కనిపించాడు. ఏదో కంపెనీలో సేల్స్ రిప్రజెంటేటివ్‌గా పనిచేస్తున్నాడు. పలక

రించాడు ఆప్యాయంగా.

అవటానికి బాబాయే అయినా మా ఇద్దరికీ వయసులో నాలుగైదు సంవత్సరాల కంటే ఎక్కువ తేడా లేకపోవటంతో బంధుత్వం కంటే స్నేహం ఎక్కువ. అంతా చెప్పాలనిపించింది మురళితో.

"ఈ మధ్య కనపడటం లేదే?" అన్నాను.

"ఎక్కడా! ఒక్క నిమిషం తీరిక దొరకటంలా. నువ్వు రావచ్చుకదరా ఇంటికి?"

"నీ సలహా, సహాయం కావాలి మురళీ నాకు. ఏం చేయాలో తోచటంలేదు."

"ఏమిటి"

ఇద్దరం బర్కత్‌పూరా పార్కు దాకా నడిచాం. జరిగిందంతా చెప్పాను మురళికి వివరంగా. అంతా విన్నాడు.

"మీ నాన్నతో అప్పుడే ఎందుకు చెప్పావు?" అనడిగాడు.

"ఇంకెవరితో చెప్పాలో తెలియక ఆయనతో చెప్పాను."

"మీ నాన్న కబురు పంపించటం బావుండదురా. ఆ అమ్మాయి అభిప్రాయం ఏమిటో నువ్వు ముందర తెలుసుకుంటే మంచిది"

"అంతే నంటావా?"

"అవును. ఆ అమ్మాయి పేరు జ్యోతి అన్నావు కదూ?"

"అవును."

"ఎం.ఏ. తెలుగు కదా? చూశానను కుంటా రెండు మూడు సార్లు యూనివర్సిటీలో"

"నీకు తెలుసా?"

"చామనచాయలో ఉంటుంది. కాస్త పొట్టి కదూ?"

"అవున్లే–నీకెలా తెలుసు?"

"మొన్నకూడా చూశారా ఇక్కడేదో మీటింగులో."

"మురళీ! నా మనసులో మాట నీతో చెప్పాలనుంది. ఎంతోమంది ఆడపిల్లల్ని చూశాను. తిరిగాను కానీ నాలో ఎప్పుడూ వాళ్ళతో ఓ స్నేహభావం తప్ప వేరే ఆలోచనే ఉండేది కాదు. అసలు నేనో ఆడపిల్లతో మాట్లాడుతున్నాననే ధ్యాస కూడా ఉండేది కాదు. ఈ అమ్మాయిని రెండుసార్లు చూశానంతే ఇప్పటి వరకూ ఈ అమ్మాయిలో ఆకర్షణ ఏమిటో కాని నన్ను పిచ్చివాడికింద చేసింది–"

"ప్రేమలో పడ్డావన్న మాట?"

"ప్రేమంటారా దీన్ని? ఏమో నాకు తెలియదు. అయినా ఆ మాటలో నాకు నమ్మకం కూడాలేదు. కానీ ఆ అమ్మాయితో జీవితాంతం గడపాలనుంది."

కాసేపు మాట్లాడలేదు మురళి.

"ఇప్పుడు ఆమెను ఎలా కలవాలో అర్థం కావటంలా. చీకటి పడ్డాక వాళ్ళింటికి వెళ్దామనుకుంటున్నా."

"ఇంటికా?"

"అవును"

"ఇంటికెళ్ళి ఏం చేస్తావు?"

"వాళ్ళ నాన్నగారితో మాట్లాడదామని."

"ఎందుకు ఆయనతో మాట్లాట్టం?"

"ఆయన కాస్తన్నా ఆసక్తి చూపిస్తే మన వాళ్ళనెవర్నయినా పంపిద్దామని. మా నాన్న వాళ్ళ దగ్గరికెళ్ళి 'కాదు' అనిపించుకోవటం నా కిష్టం లేదు. అందుకే అసలు వాళ్ళభిప్రాయం ఏమిటో ముందుగా నేను తెలుసుకుంటే బావుంటుంది."

"నీకసలు బుర్రలేదు. నువ్వెళ్ళటం ఎందుకు? ఎంత చులకనయి పోతావో

తెలుసా?"

"మరేం చెయ్యమంటావు? నాకేం చెయ్యాలో తోచటంలా. ఒకటే ఆత్రుతగా ఉంది."

"కాస్త కళ్ళెం వెయ్యి. ముందు ఆ పిల్లని కలుసుకో. అసలా అమ్మాయి అభిప్రాయం తెలుసుకోకుండా పరిగెడితే ఎలా?"

"ముందర నేనూ అదే అనుకున్నా. కానీ మళ్ళీ అనిపించింది ఏమనుకుంటుందో నని."

"ఏం అనుకోదు. ఆ అమ్మాయేం పాలు తాగే పసిపాప కాదుగా? ఆ మాత్రం అర్థం చేసుకోలేదా నిన్ను? నీ ఉద్దేశం ఆమెకు చెప్పు."

"చెప్పి..."

"వీలయితే ఒప్పించు పెళ్ళికి"

"ఒప్పిస్తే?"

"నే చూస్తా తరువాత సంగతి. వాళ్ళ పెద్దవాళ్ళతో నేను మాట్లాడతా."

"వాళ్ళు ఒప్పుకోకపోతే?"

"నీకెందుకు ఆ గొడవంతా? ఆమె చేత 'అవును' అనిపించు. మీ ఇద్దరికీ పెళ్ళి జరిగేటట్టు చూసే పూచీ నాది."

"నిజంగా"

"ఓ! నా మాటమీద నేనుంటాను"

"నాకు కొండంత ధైర్యంగా ఉంది మురళీ! నీ మాటలు వింటుంటేచాలు. ఈ మాత్రం ఊరట కలిగించే మనిషి కోసం వెతికాను.''

నవ్వాడు మురళి.

"నమ్మవు చెబితే. ఆమెను చూసి నాలుగు రోజులు కూడా కాలా. ఎన్నో ఏళ్ళ పరిచయం ఉన్నట్టు అనిపిస్తోంది. ఆమెకు నేనెంతో దగ్గరయ్యాను. కానీ ఆమె నాకింకా దూరంలోనే ఉంది."

"గాభరా పడకు. నే చూస్తానంతా. కానీ నువ్వు మాత్రం నే చెప్పినట్టు చెయ్యి. ముందు ఆ అమ్మాయి అభిప్రాయం తెలుసుకో. ఎందుకో చెప్పనా? చచ్చేదాకా తెల్లారిలేచి ఒకళ్ళ మొహం ఒకళ్ళు చూసుకుంటూ బ్రతకాల్సింది మీరిద్దరూ."

"అలాగే మురళీ! నువ్వు చెప్పినట్టే చేస్తాను."

"నేను రేపు ఊరెళ్తున్నా. మూడ్రోజుల్లో వస్తాను మళ్ళీ. రాగానే నీకు ఫోను చేస్తా. ఈలోపల నువ్వామెను కలుసుకో."

ఇద్దరం లేచాం పార్కులోంచి. బాగా పొద్దుపోయింది. తొమ్మిదయింది. ఆటో ఎక్కి వెళ్ళిపోయాడు మురళి. అతను ఇచ్చిన సలహా నాకెందుకో చాలా నచ్చింది. జ్యోతి గురించే ఆలోచిస్తూ నడుస్తున్నాను.

రోడ్డుకి అటువైపున ఇద్దరమ్మాయిలు నడుస్తున్నారు చకచకా. అందులో ఒక అమ్మాయి జ్యోతిలాగే అనిపించింది. స్ట్రీట్ లైట్ వెలుతురు వాళ్ళమీద పడ్డప్పుడు చూశాను.

జ్యోతి!

గుండె దడదడా కొట్టుకోవటం మొదలెట్టింది. ఆమెను చూడగానే నేనెందుకలా అయిపోతానో?

పలకరించాలి. కాని ఏమని పలకరించను. చప్పట్లు కొట్టి పిలిస్తే బావుండదు. రోడ్డుమీద వాళ్ళు నా వేపే చూస్తారు.

వై.యం.సి.ఏ. బిల్డింగు పక్కన సందులో ఓ ఇంట్లోకి వెళ్ళారు వాళ్ళిద్దరూ. మళ్ళా రోడ్డుమీదికి వచ్చినప్పుడు కలవొచ్చునని సందు మొదట్లో నిలబడ్డాను.

ఆశ్చర్యమేసింది నాకు. ఆమెను ఎలా కలవాలా అని సతమత మవుతుంటే కాక తాళీయంగా ఆమె కనబడటం. టెలిపతీ అంటారు చూడు అటువంటిదేమైనానా ? నవ్వొచ్చింది నాకు. ఆమె గురించి నేనాలో చిస్తున్నట్టు నా గురించి కూడా ఆమె తలుచుకుని ఉంటుందన్న సిద్ధాంతం ఏమిటి ?

అరగంట గడిచిపోయింది అలాగే.

సందు చివరగా ఉన్న ఇంట్లోంచి ఇద్దరూ బయటికొచ్చారు. మళ్ళీ గుండె దడ ఎక్కువయింది నాకు. దగ్గరకొచ్చే శారు. తలొంచుకుని నడుస్తూ నన్ను దాటి ఇంకాస్త ముందుకెళ్ళారు. దాటి పోతుంటే కాని నాకు ధైర్యం రాలేదు పిలవటానికి.

"ఏమండీ!" పిలిచాను.

వినిపించుకోలేదు వాళ్ళు. అసలు నా గొంతులోంచి మాట బయటికొచ్చిందా లేదా అని అనుమానం వేసింది నాకు. భ్రమ పడ్డానేమో పిలిచానని.

మళ్ళీ పిలిచాను ఇంకాస్త గట్టిగా.

"ఏమండోయ్ జ్యోతిగారూ!మిమ్మల్నే"

ఆగారు ఇద్దరూ.

"మీరా?" అంది జ్యోతి కళ్ళు పెద్దవి చేసుకుని.

"ఏమనుకోకండి మిమ్మల్నిలా రోడ్డు మీద పిలిచి నిలబెట్టినందుకు. వేరే గత్యంతరం లేకపోయింది"

"ఫరవాలేదులెండి"

"మీరిప్పుడింటికి వెళిపోతున్నారా?"

"అవును. ఏనికండీ"?

"మీతో కాస్త మాట్లాడాలి వీలుం టుందా?"

"చెప్పండి"

"ఇక్కడిలా నడిరోడ్డుమీద చెప్పలేను. దగ్గర్లో మా పెద్దమ్మగారిల్లుంది. అక్కడి కెళ్దాం వస్తారా?"

"........."

పోనీ మా ఇంటికెళ్దాం వస్తారా?"

"ఇక్కడ చెప్పలేరా?"

"మీకేమన్నా పనుంటే వెళిపోండి. తరవాత మాట్లాడుకోవచ్చు"

"పనేం లేదుకాని ఇప్పుడు పదయి పోయింది. మా ఇంటివాళ్ళు గేటు తాళం వేసేసారండీ లేటయితే"

"అలాయితే ఓ పని చేయండి. రేపెప్పు డయినా కలవగలరా?"

"రేపు రవీంద్రభారతిలో ఫంక్షను ఒక టుంది. సాయంత్రం అక్కడికి వస్తాను"

"అక్కడ మాట్లాడుకుందామా?"

"అలాగే"

"సర్లెండి రేపు కలుస్తాను. మళ్ళీ చెబు తున్నాను. అపార్థం చేసుకోకండేం ఇలా రోడ్డుమీద నిలబెట్టినందుకు?"

"అబ్బే ఫరవాలేదులెండి. వస్తాను" అంటూ వెళిపోయింది జ్యోతి.

వెనకనుంచి అలాగే చూస్తూ నిలబడి పోయాను. ఆమె నడక చాలా బావుందని పించింది. హుందాగా రాణీలా ఉంది.

ఇంటికొచ్చేసరికి పదకొండయింది. నిద్రపోదామని మంచంమీద వాలి కళ్ళు మూసుకున్నా, బలవంతంగానయినా నిద్ర పడుతుందేమోనని. లాభం లేకపోయింది.

"మనసు పరుగులు తీస్తుంటే నిద్రెలా పడుతుంది?

ఆమెతో ఏం చెప్పాలి? ఎలా మొదలు పెట్టాలి?

'మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. తొలి చూపులోనే నా హృదయాన్ని మీ కర్పించాను. మీరు లేని నా బ్రతుకో ఎడారి' అంటూ నాటక ఫక్కీలో




చెప్పాలా?

లేకపోతే—

ముక్కుసూటిగా 'మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుంది. మీ అభిప్రాయం కావాలి నాకు' అంటూ చెప్పనా?

మొత్తానికి చాలా చిక్కు సమస్యలా కనబడింది.

ఆలోచనలు - ఎన్నో దృశ్యాలు సినిమా రీలులా కళ్ళముందు కదిలాయి. రాత్రంతా ఒక్క క్షణం కూడా కళ్ళు మూయలేదు.

కళ్ళుమూసి తెరిచేలోపల మర్నాటి సాయంకాలం వస్తే బావుండుననిపించింది.

కానీ—

కాలం మనకోసం పరిగెడుతుందా? మనం ఆగమంటే ఆగుతుందా?



మర్నాడు తెల్లవారు ఝామునే లేచాను. షవర్ కింద చన్నీళ్ళతో గంటసేపు స్నానం చేశాను. కాస చలివేసినా ఒంట్లో వేడి తగ్గింది. హుషారు పుట్టింది.

ఇంట్లో అప్పటికి ఇంకా ఎవరూ నిద్ర లేవలా. కాఫీ కలుపుకొని తాగి బట్టలేసుకుని వెంకటేశ్వరస్వామి గుడికి బయలుదేరాను. అంత పొద్దున్నే గుడికొచ్చేవాళ్ళు తక్కువ కదా? ఓ పదిమంది కనబడ్డారంతే. ఆ గుడిలో కొబ్బరికాయ–వెంకటేశ్వరస్వామి విగ్రహం ఉన్న గర్భగుడిలో తీసుకోరు. అందుకని మెట్లదగ్గర ఆంజనేయస్వామికి సమర్పించి పైకి వెళ్ళాను దండం పెట్టుకోవటానికి.

ఆ గర్భగుడిలో నాకెప్పుడూ–ఎందుకో కాని వింతగా అనిపిస్తుంది. వేరే గుడికి వెళ్ళినప్పుడు లోపల ఓ వింత సువాసన ముక్కుపుటాలకి సోకుతుంది. కాని ఇక్కడ ఏదో అద్దాల బీరువాలో తాజ్ మహల్ చూసినట్టనిపించింది.

విగ్రహం ఆపాదమస్తకం చూడగానే–ఆ ఏడుకొండలవాణ్ణి చూసినప్పుడు నాలో ఎప్పుడూ మెదిలే భావం – గుండెలో చోటు చేసుకుంది. వేడుకున్నా మనస్ఫూరిగా నా ఆశ ఫలిస్తే కొండమీద పెళ్ళి చేసుకుంటానని.

కొండ కిందకొచ్చేసరికి ఏడయింది. హోటల్లోకి వెళ్ళి కూర్చున్నా. సాయంత్రం దాకా ఎలా గడపాలి? వేణూ గుర్తు కొచ్చాడు. ఖైరతాబాదులో ఉంది వాడిల్లు.

వెళ్ళేటప్పటికి వాడూ స్నానం చేసి కూర్చుని వాళ్ళ తమ్ముడికి ఏవో లెక్కలు చెబుతున్నాడు 'రాముడు మంచి బాలుడు' అన్న వాక్యం గుర్తొస్తుంది వాడిని చూసిన వారికెవరికైనా. ఒద్దంటున్నా వినకుండా వాళ్ళమ్మగారు కాఫీ టిఫినూ ఇచ్చారు. తీసుకున్నాక ఇద్దరం బయలుదేరాం. మేం ఎప్పుడు కలిసినా – పొద్దున్నయినా, సాయంత్రమైనా – పబ్లిక్ గార్డెన్స్‌లో కూచుంటాం.

కబుర్లు చెప్పుకుంటూ అలాగే కూచున్నాం ఒంటిగంటవరకూ. శకుంతల గారినీ, జ్యోతినీ, నేను కలవటం–మాట్లాడటం అంతా వాడికి చెప్పాను. ఇంటికెళ్ళి భోజనంచేసి సినిమాకి వెళ్దామన్నాడు వాడు. వాళ్ళింటికెళ్ళి ఇద్దరం అన్నంతిని దగ్గర్లో ఉన్న సినిమాహాల్‌కి వెళ్ళేటప్పటికి సరిగ్గా మ్యాట్నీ టైమయింది.

ఆ సినిమా ఓ ట్రాజెడీ!

డబ్బులుపెట్టి బాధ కొనుక్కున్నట్టయింది సినిమా చూస్తున్నంతసేపూ. బయటకొచ్చాక గుండె తేలికపడింది. హీరో బాగా డబ్బున్నవాడు. ఓ మధ్య తరగతి అమ్మాయిని ప్రేమిస్తాడు. అడ్డంకులన్నీ ఎదుర్కొని పెళ్ళిచేసుకుంటాడు. తరువాత కష్టపడి పెద్ద ఆఫీసరవుతాడు. అప్పుడే విధిఆడుకుంటుందవాళ్ళతో. ఆ అమ్మాయికి బ్లడ్ క్యాన్సర్ ఒస్తుంది.

హీరో ఆ అమ్మాయికి తెలియనివ్వడు అసలు విషయాన్ని. ఎంత అనారోగ్యంగా ఉన్నా ఆమె మాత్రం వెనకటిలాగే ఉంటుంది. ఆమె నవ్వినప్పుడల్లా హీరో పక్కకిపోయి ఆమెకి తెలియకుండా వెక్కి వెక్కి ఏడుస్తూ వుంటాడు. పాత కథే.

సినిమా మొత్తం మీదా నన్నో ఘట్టం ఎంతగానో కదిలించింది. ఆమె మంచం మీద పడుకుని వుంటుంది. ఫలహారమన్నా తినమని బ్రతిమిలాడుతూ ఉంటాడు హీరో. ఆమె చుబుకం మీద ముద్దుపెట్టుకుని వేడుకుంటున్నట్టు పెడతాడు మొహం. ఆమె నవ్వులాటకి తన అరికాలుని అతని మొహం దగ్గర పెడుతుంది.

ఆ చిలిపితనం అతని బాధని పదింతలు చేస్తుంది, అరికాలు తన మొహానికి అదుము కుంటాడు ఆవేశంతో.

ఎప్పుడూ ఏ సినిమాలోను కంటతడి పెట్టని నాకు అది చూడగానే కళ్ళమ్మట నీళ్ళుకారాయి.

జీవితంలో విషాదాన్ని ఏ మనిషీ భరించలేడు.

కానీ-ట్రాజెడీ కథలూ - సినిమాలూ ఎంతోమందికి చాలా నచ్చుతాయి. కారణం? ప్రతివాడికీ ఏవో బాధలూ సమస్యలూ ఉంటాయి. విషాదాంతమున్న పుస్తకం చదువుతున్నప్పుడో, ఓ సినిమా చూస్తున్నప్పుడో, ప్రతి మనిషి గుండెలో బాధా బయటి కొస్తుంది. గుండె బరువు తగ్గుతుంది.

నాకూ అలాగే అయింది.

పనుంది మళ్ళీ కలుస్తానని చెప్పి వెళ్ళిపోయాడు వేణూ. రవీంద్రభారతి కెళ్ళాను. అంతా చూశాను. ఎక్కడా కనబడలేదు జ్యోతి. కార్లమీద,స్కూటర్ల మీద చాలామంది దిగుతున్నారు.

అసలు జ్యోతి వస్తుందో రాదో అని అనుమానం వేసింది. రవీంద్రభారతి పక్కన పచ్చటి లాన్‌లో కూచుంటూ వుంటారు చాలామంది. అక్కడికి వెళ్ళాను చూద్దామని.

రాధా, తనూ ఇంకెవరో కుర్రాళ్ళూ కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆకుపచ్చ ఫుల్‌వాయిలు చీరకట్టుకుంది.

ఆ అమ్మాయిలో ఏముందో నాకు తెలియదు కాని, చూడగానే నా గుండెవేగం ఎక్కువవుతుంది. గుండెమీద చేయి పెట్టుకుని చూస్తే, ఎవరో అరచేతిమీద చెక్కపెట్టి కొడుతున్నట్టనిపిస్తుంది.

ఓ రెండు నిమిషాలు అలాగే ఇరవై గజాల దూరంలో నిలబడ్డాను గుండెదడ సర్దుకుంటుందని. ఇంతలో తనే నావేపు చూసింది. క్షణం అలాగే చూసి నవ్వింది పల్చగా.

నేనూ నవ్వాను పలకరింపుగా. జ్యోతి నవ్వినప్పుడు మొహం ఎంతో బావుం టుంది. ఆ నవ్వు, అందుకే నాకెంతో ఇష్టం.

దగ్గరికెళ్ళి అడిగాను.

"ప్రోగ్రాం చూడరా?"

"చీఫ్‌గెస్ట్ రాలేదండీ! ఇంకా మొదలు కాలేదు. అందుకే ఇక్కడ కూర్చున్నా."

జ్యోతిని ఒక్కతినీ విడిగా పక్కకి తీసుకెళ్ళాలి. ఎలా? ఆమె కళ్ళలోకి సూటిగా చూశాను. అర్థం చేసుకుంది. ఓ పావుగంటలో వస్తానని వాళ్ళతో చెప్పి నాతో అంది-

"రండి లోపలికెళ్దాం ఓ సారి."

ఇద్దరం నడుస్తుంటే అన్నాను,

"వెంకటేశ్వరస్వామి గుడికె ళ్దాం వస్తారా?"

''అబ్బా. అంతపైకి ఎక్కే ఓపిక లేదండీ ఇప్పుడు. ఇక్కడే కూచుందాం.''

ఇద్దరం గేటు దగ్గర కొత్తగా వేసిన లాన్స్‌లో కూచున్నాం.

"ఏమిటో చెప్పండి?" అంది.

కాసేపు నాకు మాటలు రాలా. ధైరవ తెచ్చుకుని అన్నాను.



''మా పెద్దవాళ్ళను మీ నాన్నగారి దగ్గరికి పంపిద్దామనుకున్నాను"

"దేనికి?''

ఎందుకో కాస్త ఆవేశం వచ్చింది నాలో. మాటలు ఒక్కసారిగా బయట పడ్డాయి.

"మీరు నన్ను పిచ్చివాడిని చేసేశారు. నా నిదానం పోయింది. విచక్షణ అంతకంటే పోయింది."

నావేపు చూసింది తలెత్తి.

"పెళ్ళి విషయం మాట్లాడటానికి పంపిద్దామనుకున్నా.''

"పెళ్ళా?" అంటూ కళ్ళు పెద్దవి చేసుకుంది ఇదివరకులా.

''అవును. కాని ఆలోచిస్తే నాకనిపించింది అది పద్ధతి కాదని. ఎందుకంటే నేను ఒట్టి గ్రాడ్యుయేటుని. మీరు ఎం.ఏ. చేస్తున్నారు. నేనాశపడ్డాను మిమ్మల్ని చేసుకోవాలని. కానీ, మీ ఆశలూ కోరికలూ మీకూ ఉండొచ్చు సహజంగా. అందుకని ముందర మీ అభిప్రాయం తెలుసుకుని మీరు అవునంటే పెద్దవాళ్ళని పంపిద్దామని."

"అసలు నా గురించి మీకేం తెలుసండీ నన్ను పెళ్ళిచేసుకుందామనుకున్నారు?"

''మంచి ప్రశ్న అడిగారు. కాని, ఏం తెలియాలంటారు? పెద్దవాళ్ళు ఏర్పాటు చేసే పెళ్ళిళ్ళలో ఈ మాత్రం అవకాశం కూడా దొరకదు. మీకు తెలుసుగా?"

"ఆ...అదంతా ఓ అర్థంలేని పద్ధతి లెండి.''

''ఏం, దాని గురించే మీరు రిసెర్చి చేయాలనుకుంటున్నారా?" అన్నాను నవ్వుతూ

''కాదులెండి" అంది తనూ నవ్వుతూ. ప్రాక్టికల్‌గా చెబుదామనుకున్నాను.

''మీకు నన్నర్థం చేసుకోవడానికి టైము పట్టొచ్చు. ప్రయత్నం చెయ్యండి.''

"నాకిప్పుడప్పుడే ఆ ఆలోచన లేదండీ. రిసెర్చి అయ్యేదాకా పెళ్ళి విషయం ఆలోచించదల్చుకోలేదు."

"రిసెర్చి చెయ్యొచ్చు. అది అడ్డు కాదుగా.''

"చదువుకీ, పెళ్ళికీ ఎలా కుదుర్తుంది చెప్పండి?"

"పెళ్ళి చేసుకుని చదువుకుంటున్న వాళ్ళు ఎంత మంది లేరండీ! అది సమస్యంటారా?"

"మీకు నా స్వభావం, నా గురించీ ఏమీ తెలియదు. అందుకే ఇలా మాట్లాడుతున్నారు."

"ఏమిటో చెప్పండి?"

"శ్రద్ధగా చదివి నేననుకున్నది సాధించాలి అంటే నేను నా భర్తను సుఖపెట్టలేకపోవచ్చు. భర్తను సంతోషపెట్టాలీ అంటే చదువు గంగలో కలిసిపోతుంది."

"అలా ఎందుకనుకుంటారు? సర్దుబాటులో ఉంటుంది అంతా. పెళ్ళి చేసుకున్నంత మాత్రాన మొగుడూ పెళ్ళాలు పొద్దున్నించీ సాయంత్రందాకా ఒకళ్ళ మొహం ఒకళ్ళు చూసుకుంటూ కూచోరుకదా? ఎవరి పనులు వాళ్ళు చేసుకుంటారు. మీ ఆశలకూ, ఆశయాలకూ నేనెప్పుడూ అడ్డురాను. పైపెచ్చు నేనూ సహాయకారిగా ఉంటాను."

"........."

"నేను...మీకు తగినవాడిని కాకపోవచ్చు కానీ..."

"ఆ ప్రసక్తి లేదులెండి. నేనెప్పుడూ

ఆ విషయం ఆలోచించలేదంతే."

"పోనీ ఇప్పుడు ఆలోచించండి. నేను చెప్పేది మీరు మొత్తం వినండి. మధ్యలో మాట్లాడకండి. ఏం?"

"చెప్పండి."

"దేవుడి దయవల్ల మా నాన్నగారికి చాలా పలుకుబడి వుంది. మీరు నన్ను ఉద్యోగంలో చేరమంటే, మా నాన్నగారితో చెప్పి, కనీసం ఓ ఏడెనిమిదొందలు వచ్చే ఉద్యోగం నెలరోజుల్లో వేయించుకుంటాను. మీకేమన్నా చిన్నతనంగా ఉంటే నేను ఎం.ఎస్.సి. చేస్తాను. తర్వాత రీసర్చి చేస్తాను."

"మనకోసం మనం చదువుకుంటాం కానీ ఇంకోళ్ళ కోసమా చెప్పండి? మీకు ఆసక్తనేది ఉండాలి."

"నాకు ఆసక్తి ఉందండీ, కానీ మీకు చెప్పాలిగా అంతా. నేను భవిష్యత్తులో నడిచే దారి ఏదో, నిర్ణయించే అధికారం మీకిస్తున్నాను. శకుంతలగారు చెప్పారు మీ అక్కయ్యకు పెళ్ళయే వరకూ మీ వాళ్ళు మీ పెళ్ళి విషయం ఆలోచించరని. నేను ఆగుతాను. మీరు మాటిస్తే ఎన్నేళ్ళయినా ఆగుతాను."

"మీకెలా చెప్పాలో నాకర్థం కావటం లేదు"

"ఇప్పటికిప్పుడు మీరు అవునో కాదో చెప్పనక్కరలేదు నాకు. మీరు అవుననగానే ఎత్తుకెళ్ళిపోయి తాళి కట్టేస్తాననుకున్నారా? కాదు. నాక్కావలసింది మీ అభిప్రాయం మాత్రమే! బాగా ఆలోచించండి కొన్ని రోజులపాటు."

"అలాగేనండి"

"ఒకటి గుర్తుంచుకోండి! మీ నిర్ణయం పాజిటివ్‌గా ఉంటే అది నాకు ఎంతో బలాన్నిస్తుంది. ప్రపంచంలో నా అంత అదృష్టవంతుడు లేడనుకుంటాను."

నేను మాట్లాడటం ఆపగానే తలెత్తి నా వేపు చూసింది.

ఎంత అందమైన కళ్ళు!

ఆ కళ్ళలో నాక్కావలసిన భావాలు వెతుక్కున్నాను.

ఎంతో సేపు మాట్లాడాలనిపించింది ఇంకా.

ఎవర్నయినా నా మనిషిఅని అనుకున్న తర్వాత ఆ మనిషితో మన ఆలోచనలూ ఆశలూ అన్నీ చెప్పుకోవాలనిపిస్తుంది.

నాకు జ్యోతి కావాలి.

నేను జ్యోతికి కావాలో లేదో తెలియదు.

ఛీఫ్ గెస్ట్ వచ్చేసినట్టున్నాడు. రవీంద్రభారతి ఆవరణంతా నిర్మానుష్యం అయింది. 'ఇంకెక్కువసేపు కూచోపెడితే జ్యోతికి విసుగుపుట్టొచ్చు' నని భయమేసింది?

"వెళ్దాం రండి" అన్నా.

మళ్ళీ వారం తరవాత కలుస్తానని చెప్పి ఇంటికి వెళ్ళిపోయాను. గుండె బరువు కాస్త తగ్గింది. ఎందుకో జ్యోతి నన్ను కాదనదని అనిపించింది.

నా భవిష్యత్తు ఆమెతో ఎలా ఉంటుందో ఊహించుకుంటూ నిద్రపోయాను.

* * *

మర్నాడు పొద్దున లేచేసరికి ఎంతో ఉత్సాహంగా ఉన్నాను. రాత్రి హాయిగా నిద్రపోవటం వల్లనేమో, హుషారొచ్చింది. ఇంట్లో వాళ్ళు నవ్వారు నా హుషారుచూసి. స్నానం, భోజనం అయిపోగానే జ్యోతిని కలవాలనిపించింది



మళ్ళీ. క్రితం రోజు కలిసి మళ్ళా వెంటనే వెళ్తే ఆమెకు ఇబ్బందిగా ఉండొచ్చు.

కాని...

ఆమెను చూడాలి. ఎలా ? కనీసం దూరంనుంచయినా చూసొచ్చేద్దాం అనిపించింది.

యూనివర్సిటీకి బయలుదేరాను. గంట పట్టింది అక్కడికి చేరుకునే సరికి. యూనివర్సిటీ వాతావరణం ఎంతో బావుందనిపిస్తుంది వెళ్ళినప్పుడల్లా. అక్కడ దాదాపు ప్రతీ మనిషిలోనూ ఓ రకమైన నింపాదితనం కనబడుతుంది.

బస్సు దిగగానే జ్యోతికోసం నా కళ్ళు వెతికాయి. ఎక్కడా కనబడలేదు. లైబ్రరీలో ఉంటుందేమోనని వెళ్ళాను. ఎంత వెతికినా కనిపించలేదు. ఫరూక్ కనబడ్డాడు. బాటనీలో రీసర్చ్ చేస్తున్నాడు అతను. అతనికీ నాటకాలూ అవీ అంటే సరదా. పలకరించాను హిందీలో. నన్ను చూసి ఆశ్చర్యపోయాడు గాబోలు "దారి తప్పి వచ్చావేంటి ?" అన్నాడు.

"ఇక్కడ కాస్త పనుండి వచ్చాలే."

"ఈ మధ్య కనబడటం మానేశావే?"

"ఎక్కడికీ కదలటంలేదు. ఇంట్లోనే కూచుంటున్నా. ఏమిటి విశేషాలు ?"

"నువ్వే చెప్పాలి. నాదేముంది అంతా రొటీన్ లైఫ్. ఏమన్నా పుస్తకాల కోసం వచ్చావా?"

"కాదులే. ఇక్కడ జ్యోతి అనే అమ్మాయి తెలుసా? ఎం. ఏ. ఫైనల్ చేస్తోంది."

"ఏ సబ్జెక్టు?"

"తెలుగు"

"ఎలా ఉంటుంది?"

"కాస్త పొట్టిగా ఉంటుంది. చామన ఛాయ. కళ్ళు చక్రాల్లా ఉంటాయి."

"బి.ఏ.లో యూనివర్సిటీ ఫస్ట్ కదూ?"

"అవును"

"ఆ అమ్మాయా? తెలుసులే. కాని ఏమిటి కథ?"

"ఏం అలా అడుగుతున్నావు?"

"నీ వర్ణన చూస్తుంటే..."

"కథ కాదులే ఇది. నా గోడు. వింటానంటే చెప్తాను."

అంతా చెప్పానతనికి. నవ్వాడు నా యాతన చూసి.

"అంత నచ్చిందా ఆ అమ్మాయి నీకు ? పెద్ద అందగత్తె కాదే"

"అందం కొరుక్కుతినమంటావా ? నాకు నచ్చిన తోడు నాక్కావాలి."

"ఇప్పుడు కలవాలని వచ్చావా ?"

"అబ్బే కాదు. నిన్నే కలిశాగా."

"మరెందుకొచ్చావు ?"

"నిజం చెప్పమంటావా ?"

"చెప్పు"

"నన్ను పిచ్చివాడి కింద జమ కడతావా ?"

"చెప్పు ఏమిటో"

"ఆమెని దూరంనించి ఒకసారి చూసి పోదామని"

"చూసి ?"

"వెళిపోతాను."

అంత దూరంనించి ఊరికే చూసి పోదామని శ్రమ పడొచ్చావన్నమాట ?"

"అవును. కలిస్తే బావుండదు. నాకేం పెద్ద పరిచయం లేదు. ఊరికే పదిసార్లు కనబడితే అపార్థం చేసుకోవచ్చు."

"ఎందుకు అలా అనుకుంటావు ?"

"కాస్త చనువిచ్చి ఇతనితో మాట్లాడినందుకు నెత్తినెక్కుతున్నాడని అనుకోవచ్చుగా."

"అవున్లే అదీ నిజమే."

"ఇప్పుడు ఎక్కడుంటుంది తను ?"

"ఆ వెనకాతల బిల్డింగులో ఉంటుంది. ఈ టైములో వాళ్ళకి క్లాసుండదు. అక్కడ నడవాలో కూచుని కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు పద వెళ్దాం."

ఇద్దరం వెళ్ళాం అక్కడికి. అక్కడా కనబడలేదు జ్యోతి. నీరసం ముంచుకొచ్చింది నాకు.

"ఏం చేయాలో అర్థం కావటం లేదు ఫరూక్. ఈ ఆరాటం ఎవరర్థం చేసుకోగలరు ? తన అభిప్రాయం ఆమె ఎన్ని

రోజుల్లో చెబుతుందో. అసలు ఏమంటుందో అని భయంగా వుంది."

"ఓ పని చేయరాదూ ?"

"ఏం చేయమంటావు ?"

"నువ్వూ ఎం.ఏ.లో చేరిపో, అప్పుడామెను రోజూ చూస్తూ ఉండొచ్చు. నీ బాధా తీరుతుంది. ఆమెకి ఆలోచించుకోవటానికి టైమూ దొరుకుతుంది."

"మా నాన్నగారు ఎం.ఎస్‌సి.లో చేరమంటున్నారు."

"అలాగా. అయితే నీ ఇష్టం. నీ జీవితం. నిర్ణయం కూడా నువ్వే తీసుకో."

ఏం మాట్లాడలేకపోయాను. పనుందని వెళ్ళిపోయాడు ఫరూక్. ఒక్కడినీ లైబ్రరీలో అలాగే కూర్చున్నాను.

కళ్ళలో మెదిలింది జ్యోతి రూపం. అలాగే నిలిచిపోయింది ! ఆశ్చర్యమనిపిస్తూ ఉంటుంది నాకు. అప్పటికి రెండు మూడుసార్లు చూశానంతే జ్యోతిని. ఆమె రూపం నా మనసులో ఫొటోలా నిలిచిపోయింది.

ఎంతోమందిని చూస్తూ ఉంటాం మనం. కొంతమందిని చూసిన మరుక్షణం మరిచిపోతాం. కొంతమందిని మాత్రం ఎప్పుడో ఎక్కడో చూసినట్టూ, ఎంతో పరిచయమున్నట్టూ అనిపిస్తుంది. ఇంద్రియాలన్నిటినీ ఆకట్టుకునే మనిషి ప్రతీ మనిషి జీవితంలోనూ ఎప్పుడో ఒకసారి తారసపడొచ్చు.

నా విషయంలోనూ అదే జరిగింది.

ఆ అమ్మాయిని చూడగానే ఎంతో పరిచయమున్న మనిషిలా కనపడింది. ఆమెకు కూడా ఇలాంటి స్పందన కలిగిందో లేదో నాకు తెలియదు. కలిగితే నా అదృష్టం. లేకపోతే అది నా దురదృష్టం.

భరించలేని తపన ? ఆ అమ్మాయితో మాట్లాడాలనీ కబుర్లు చెప్పాలనీ. జ్యోతి నవ్వు మొహం గుర్తొచ్చింది. ఎంత బావుంటుంది. నవ్వుతుంటే పసితనమూ ర్తీభవించినట్టుంటుంది ఆ మొహంలో. అటువంటి మనిషి హృదయం కఠినంగా ఉండదు. నన్ను అర్థం చేసుకోగలదు.

టైము ఎంతో తొందరగా గడిచిపోయింది ఆలోచనలతో. నిరాశతో బయటికొచ్చాను.

యూనివర్సిటీ లైబ్రరీ బిల్డింగు ఓ గుట్టమీద కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. ఇతర బిల్డింగుల కంటే ఎంతో ఎత్తుగా ఉంటుంది. బిల్డింగు సింహద్వారం నుంచి మెయిన్ రోడ్డు మీదికి వంపులుతిరుగుతూ రోడ్డు.

తలొంచుకుని నడుస్తున్నాను మెల్లగా. పరధ్యానంగా ఉండటంతో ఎదురు దెబ్బ తగిలి కాలి బొటనవేలు చిట్లింది. జివ్వుమంది ప్రాణం. సలుపు మొదలయింది. జేబు రుమాలు లేదు కట్టు కడదామంటే! చేసేదిలేక అలాగే నడుస్తున్నాను. మలుపు తిరుగుతుంటే జ్యోతి కనబడింది పది గజాల దూరంలో. వెంట ఆమె స్నేహితులెవరో ఉన్నారు నలుగురు. ఆ నలుగురికీ దుష్ట చతుష్టయం అని పేరు పెట్టాలనిపించింది ఎందుకో. గుండె కొట్టుకోవటం మొదలెట్టింది వేగంగా. కాలి బాధంతా మరిచిపోయాను. శారీరకంగా నేనేం బలహీనుడిని కాదు. మరెందుకీ కంగారు. వేరే ఆడ పిల్లల్ని చూసినప్పుడు ఏం అనిపించదే ?

నన్ను చూసి ఏమనుకుంటుందో అని

పించింది. దగ్గరకొచ్చారు వాళ్ళు. పలకరించింది జ్యోతి.

"ఏమిటి కాలికేమయింది ?"

"ఏం లేదు. కాస్త చిన్న ఎదురు దెబ్బ" అన్నాను.

రక్తం బాగా కారింది అప్పటికే.అంతా రక్తం మరకలతో నిండివున్నా నేను మామూలుగా మాట్లాడుతూ వుంటే వాళ్ళకి ఆశ్చర్యమేసింది కాబోలు. వింతగా చూశారు నా వేపు. జ్యోతిని చూసి నొప్పి మరచిపోయానని వాళ్ళకేం తెలుసు.

ఎన్నో చెప్పాలనిపించింది ఆమెతో. వాళ్ళందరి ముందర ఏం చెప్పగలను?ఎలా చెప్పగలను?

"వేలు బాగా చిట్లినట్లుంది. అక్కడ ఆర్ట్సు కాలేజీ బిల్డింగులోకి వెళ్ళి ఫస్ట్ ఎయిడ్ తీసుకోండి. లేకపోతే సెప్టిక్ అవొచ్చు" అంది జ్యోతి.

"అలాగే" అంటూ వెళ్ళిపోయానక్కడి నుంచి. కాస్త కట్టు కట్టించుకుని ఇంటికి చేరుకున్నా సాయంత్రానికి. నాన్నగారు అప్పటికే వచ్చేశారు. అమ్మ కాస్త కంగారు పడింది కట్టు చూసి. 'పెద్ద దెబ్బేం కాదు' అని ధైర్యం చెప్పి నా గదిలోకి వెళ్ళాను.

జ్యోతి గుర్తుకొచ్చింది మళ్ళీ. ఆమెను ఎందుకు మర్చిపోలేక పోతున్నానో బుర్ర బద్దలు కొట్టుకున్నా నా కర్థం కాలా.

ఫరూక్ చెప్పింది కరెక్టనిపించింది. నిద్రలోకి జారాను కలలు కంటూ.

* * *

నా మనసు నిండా వున్న ఆలోచనలూ, ఆశలూ రాసుకుంటూ పోతే జీవిత కాలం సరిపోదేమో.

అందుకే అంటారు - మనసుకంటే వేగంగా పరిగె త్తేది ఏదీ లేదని.

ఇంట్లో ఊరికే కూర్చోటం నాకెంతో విసుగు. కానీ ఆశ్చర్యం...ఈ నాలుగు రోజులూ ఎక్కడికీ కదలకుండా ఇంట్లోనే కూర్చున్నాను జ్యోతి గురించి ఆలోచిస్తూ. ఎడతెరిపిలేని ఆలోచన. నాకేమన్నా పిచ్చి పట్టిందేమోనని అనుమానమేసింది. అయిదో రోజున ఏం తోచక వేణు దగ్గరికి బయలుదేరాను.ఇంట్లోనే వున్నాడు వెళ్ళేటప్పటికి. ఇద్దరం గుడికెళ్ళాం.

"ఎంతవరకూ వచ్చిందిరా" అన్నాడు వేణు.

"ఆ రోజు సాయంత్రం కలిసి చెప్పారా అంతా. ఆలోచించి చెప్పమన్నా తన అభిప్రాయాన్ని. తరువాత ఒక్కసారి కలిశానంతే! ఏం మాట్లాడలేదు ఆ అమ్మాయి"

"నీ తొందర చూస్తుంటే నాకు నవ్వొస్తుంది. ఒక్క రోజులో నిర్ణయం చెప్పమంటే ఎలా చెప్పగలదు ఏ అమ్మాయైనా! ఆలోచించుకోవాలిగా తను కూడా"

"నిజమే నువు చెప్పింది.కానీ నాకెంతో ఆరాటంగా ఉందిరా! నా గురించీ, నా స్వభావం గురించీ ఆమెకేమీ తెలియదు. ఆమె మనస్తత్వం గురించి నాకు తెలుసని కాదు. కానీ నేనో నిర్ణయానికొచ్చాను. ఆమె కూడా నాలా అదే నిర్ణయాని కొస్తుందో లేదోనని నా భయం"

"ఓపిక పట్టాలిరా ఇటువంటి విషయాల్లో. నువ్వేం పనికిరానివాడివీ కాదు, చెడ్డవాడివీ కాదు. ఆమే దార్లోకొస్తుంది"

"ఎలా ? నన్ను కలుస్తూ ఉంటే కదా నామీద ఆమెకో అభిప్రాయం అంటూ ఏర్పడేది?"

"కలుస్తూ వుండు"

"బావుండదురా అలా చీటికీ మాటికీ

కావాలని కలిసే. మామూలుగా కలుస్తామా అంటే ఆమెదో దారీ, నాదో దారీ"

"మరేం చేస్తావు?"

"ఎం.ఏ.లో చేరదామనుకుంటున్నా"

"ఎం.ఏ.లోనా ?"

"అవును. ఎం.ఏ. తెలుగు చేద్దామని"

"నీకేమైనా పిచ్చి పట్టిందా?"

"అదొక్కటే నాకిప్పుడు కనిపిస్తున్న మార్గం"

"నీ భవిష్యత్తు పాడుచేసుకుంటావా? ఎం.ఎస్‌సి. చేద్దామనుకున్నావుగా?"

"ఎన్నో అనుకుంటాం మనం. అన్నీ జరుగుతాయా అనుకున్నట్టు? నాకు ఉద్యోగం దొరకదనే బాధలేదు. ఇప్పుడున్న డిగ్రీతో ఉద్యోగం వేయించమన్నా మా నాన్నగారు పది రోజుల్లో ఇప్పించగలరు. నీకు తెలుసుగా?"

"నాకెందుకో నచ్చటంలేదు నీ పద్ధతి"

"మరేం చేయమంటావు?"

"నేచెప్పేది జాగ్రత్తగా విను మూర్తీ! జీవితంలో పెళ్ళి, భార్యా ముఖ్యమైనవే. కాదనను. కానీ వీటికంటే విలువైనవి ఎన్నో ఉన్నాయి. కానీ ఈ ఒక్క విషయానికే అనవసరమైన ప్రాముఖ్యం ఇస్తున్నావు నువ్వు"

కాస్త కోపం వచ్చింది నాకు. మెల్లగా మొదలుపెట్టాను.

"వేణూ! ఫ్రాయిడ్ ఏమన్నాడో తెలుసా ? ఈ ప్రపంచంలో ప్రతివాడికీ పిచ్చి ఉంటుంది. కానీ ఎవడూ పిచ్చివాడు కాదు. అంటే అర్థం - ఒకో మనిషి జీవితంలో ఒకో సంఘటనకి కాని, ఒకో విషయానికి కాని ఎంతో ప్రాముఖ్యం ఇస్తాడు. నేనే విషయంతో నా సంతోషం, సుఖం, నా భవిష్యత్తూ ముడిపడి ఉంటుందనుకున్నానో-అది నీకు ఎంతో చిన్న విషయంగా, అనవసరమైందిగా కనబడొచ్చు. ఎవరి పిచ్చి వారికానందం"

"కోపం వచ్చేసింది నీకు. నన్నపార్థం చేసుకోకు. నీ భవిష్యత్తు ఏమవుతుందో అన్న ఆందోళనతో అలా అన్నానే కాని నిన్నూ, నీ మనసునీ అర్థం చేసుకోక కాదు. నువు కోరుకుంది నీకు దొరికి సంతోషంగా ఉండాలని నాకు మాత్రం వుండదూ ?"

"నాకేది మార్గం?"

"నే చెప్పినట్టు చేస్తావా?"

"ఏమిటది?"

"ఆ అమ్మాయిని వెళ్ళి కలిసి నీ మనసులో ఉన్న మాట చెప్పు. నీకు రోజూ తనని చూడాలని ఉంటుందనిచెప్పు. వీలయినప్పుడల్లా ఎక్కడయినా నిన్ను కలవమని చెప్పు. బహుశా నీ బాధ అర్థం చేసుకుంటుందనే నా నమ్మకం"

"బావుంటుందంటావా ?"

"తప్పేంలేదు." ఆ అమ్మాయేం చిన్నపిల్ల కాదుగా. చాలా తెలివైంది కూడా."

"ఎవరేమనుకున్నా నే లెక్కచేయను. కానీ జ్యోతి ఎక్కడ అపార్థం చేసుకుంటుందోనని నా భయం.ఎలా చెప్పమంటావు?"

"ఏం ఫరవాలేదు. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నావుగా. నీ మనస్తత్వం, పద్ధతీ ఆమె దగ్గర ఏం దాచబోకు. నీలోని లోపాలు కప్పిపెట్టటానికి ప్రయత్నించబోకు. నీ మంచితనంతోపాటు నీలోని బలహీనతలని కూడా భరించే మనిషిని ఎన్నుకోవాలి నువు భార్యగా"

"సరే అలాగే చేస్తాలే" అన్నా చివరికి.



ఇద్దరం మెల్లగా నడుస్తూ ఖైరతాబాదు దాకా వచ్చాం. ఇంటికెళ్లిపోయాడు వాడు. జ్యోతితో ఏం మాట్లాడాలి, ఎలా మాట్లాడాలి అని ఆలోచిస్తూ ఇంటికి చేరుకున్నా.

*　　　*　　　*

ఓ వారం రోజులు అనుక్షణం ఆరాటంతో, ఆలోచనలతో గడిచిపోయాయి. ఎంత ప్రయత్నించినా ఆమెని కలవటం కుదరలేదు. వాళ్ళ ఇంటికెళ్లా మనుకునేవాడిని ప్రతిరోజూ. కాని మళ్ళీ

ఏదో జంకు. వాళ్ళిల్లు బర్కత్‌పూరాలో ఉంది. రోజూ పొద్దున్నా, సాయంత్రం అక్కడ నిలబడేవాడిని. గంటలు నిమిషాల్లా గడిచిపోయేవి. చుట్టుపక్కల ఎవరుపోతున్నా ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసేవాడిని.

చివరికి ఓ రోజు పొద్దునే ఎనిమిది గంటలకి జ్యోతి కనబడింది. ఆనందంతో మనసు ఉరకలు వేసింది. ఆమె దగ్గరకు వస్తున్న కొద్దీ కంగారు కాస్త ఎక్కువయింది. కాస్త ధైర్యం తెచ్చుకుని విష్ చేశాను. నవ్వుతూ పలకరించింది.

"మీతో మాట్లాడాలి" అన్నా.

"ఏం మాట్లాడతారు?'' అంది చిలిపిగా.

ముద్దొచ్చింది ఆమె అలా అడిగినప్పుడు.

"ఓ పది నిమిషాలు నాతో కూచోగలరా?''

"దేనికండీ''

"మీరు యూనివర్సిటీకివెళ్తున్నారా?''

"అవునండీ! కొన్ని కాగితాలు తెచ్చుకోవాలి.''

"బస్‌లో వెళ్తూ మాట్లాడుకుందామా టైము వేస్టు కాదు?''

బస్‌లో వెళ్తూ మాట్లాడటం ఇష్టం లేదేమో దగ్గర్లో పార్కులో కూచుందామంది. ఇద్దరం ఓ మూలగా కూచున్నాం.

"నాకు మిమ్మల్ని రోజూ చూడాలనిపిస్తుంది. చూడకుండా ఉండటం కష్టంగా ఉంది."

"........."

"నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలన్న నిర్ణయానికొచ్చాను. కాబట్టి అలా అనిపించవచ్చు. కానీ మీరు నిర్ణయం తీసుకోవటానికి టైంపడుతుంది. అవునా?"

అవునన్నట్టు తలూపింది.

"మంచో చెడో ఓ అభిప్రాయమంటూ మీకు కలగాలంటే నా గురించి మీరు తెలుసుకోవాలి. ఒక్కరోజులో తేలే వ్యవహారం కాదిది.''

''.........''

"అందుకే ఈ సమస్యకి, మీకు ఏ ఇబ్బందీ లేకుండా ఓ మార్గం ఆలోచించాను.''

"సమస్య నాకేం లేదండీ''

''సమస్య నాదే. మీదికాదు. బాధపడేదీ నేనే. మీరుకాదు. నామాట వింటారా?"

''చెప్పండి.''

"మీకు వీలయినప్పుడల్లా నన్ను కలవగలరా?"

తలెత్తి నా కళ్ళలోకి చూసింది.

''కనీసం వారానికి ఒక్కసారి ఓ అరగంటో, గంటో నాతో గడపండి. నాకది టానిక్‌లా పనిచేస్తుంది. ఈ చిత్రహింస ఉండదు నాకు. మీరెక్కడికి రమ్మంటే అక్కడికి వస్తాను."

''.........''

"ఇంకోటికూడా. ఎప్పుడైనా మీకు నా ప్రవర్తనలో కాని, ఉద్దేశాల్లోకాని ఏదన్నా తప్పనిపిస్తే నా మొహం మీద చెప్పొచ్చు మీరు. అలా మీరు చెప్పిన తర్వాత, మీరెందుకు ఇలా అన్నారని కారణం అడగను నేను. మళ్ళా నా మొహం చూపించను మీకు. ఏమంటారు?"

కాసేపు మాట్లాడలేదు ఎవరమూ.

"చెప్పండి'' అన్నా.

"ఎలా కుదురుతుందండీ?"

''వారానికి ఎన్ని గంటలో చెప్పండి"

".........

"నూట అరవై ఎనిమిది. ఇన్నిగంటలూ నిద్ర పోయినప్పుడు తప్పించి నేను మీ గురించే ఆలోచిస్తున్నా. అటువంటిది మీరు నా కోసం ఒక్కగంట ఖర్చు చేయలేరా?"

ఇబ్బందిగా చూసింది.

"మీరేం వంటింటి కుందేలు కాదుగా. చదువుకున్నవారు. మగవాళ్ళతో మాట్లాడటం ఏం ఇబ్బంది కాదే?"

"అదేం కాదండీ. నేను ఆడా మగా ఎవరితోనైనా ఒకలాగానే మాట్లాడతాను."

"అయితే నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోమని అడిగినందుకు నాతో మాట్లాడలేరా!"

నవ్వొచ్చిందేమో పెదిమలు విచ్చుకున్నాయి.

"ప్లీజ్ చెప్పండి"

"నా బస్సొచ్చిందండీ" అంది పై పెదవి నొక్కిపట్టి నవ్వాపుకొంటూ.

ఆ అమ్మాయి సీరియస్‌గా ఆలోచించటం లేదని అర్థమయింది నాకు. కాస్త కోపం కూడా వచ్చింది.

"బస్సొచ్చింది కదా? వెళ్ళండి. కానీ ఒకటి చెబుతున్నాను. మీరు సీరియస్‌గా ఆలోచించటం లేదేమో నా విషయం. నేనెంత గట్టిగా ఈనిర్ణయం తీసుకున్నానో మీకు తెలియదు. అది మీకు తెలియటానికి..."

నా వేపు చూసింది.

"నా వేలు ఒకటి కోసేస్తాను. రేపు చూపిస్తా మీకు నా మొండివేలు" అన్నాను.

లిప్తపాటు షాక్ తిన్నట్టు చూసింది. వెంటనే లేచి వెళ్ళి బస్సెక్కింది.

ఆమె వెనక్కి తిరగ్గానే నేనూ అక్కణ్నించి బయలుదేరాను. ఏం చేయాలో తోచలేదు. హోటల్లో కూచున్నా వెళ్ళి. చాలా బాధ పడ్డాను ఎందుకు అడిగానా అని. మనసంతా చికాగ్గా అయింది. ఎలా అయినా సరే ఆమెతో అన్నట్టు వేలు కోసేయాలి.

ఎలా?

ఎవరూ కావాలని వేలు కోసుకోరు!

ఆ రోజు ఆ క్షణాల్లో నా ఆవేశానికి నిదర్శనం బ్లేడు పెట్టి నేను వేలు కోసుకోవటం.

నాకే అనిపించింది ఆ అమ్మాయి మీద నాకున్న భావన ఏమిటో తెలుసుకోవాలని! వేలు కోసుకుంటే తెలుస్తుందనుకున్నాను. విచక్షణ పోయింది.

ఈఆరాటం, ఆత్రుత-ఆ అమ్మాయితో పడుకోవాలనే వాంఛ కాదని నా మనసు పదేపదే చెబుతోంది.

మరయితే ఏమిటి దీనికి కారణం?

కళ్ళు మూసుకుని బ్లేడు పెట్టి చిటికెన వేలు సగానికి కోశాను. ఆ క్షణంలో పెద్ద బాధనిపించలేదు. మరు నిమిషం మొదలయింది చెప్పలేనంత నొప్పి. రక్తం విపరీతంగా కారటం మొదలెట్టింది. వేలు మొత్తం తెగలేదు మధ్యలో ఎముక ఉండటం వల్ల. కానీ చాలా లోతుగా దిగింది బ్లేడు. భరించలేక పోయాను ఆ బాధని.

వెంటనే బయటకొచ్చి ఆటో ఎక్కి హాస్పిటలుకి వెళ్ళాను.

ఎలా తెగిందని అడిగారు డాక్టర్లు. ఏదో కుంటిసాకు చెప్పాను.

నా కంటే ప్రమాదమైన కేసొకటి రావటం మూలాన అలాగే కూర్చోపెట్టారు నన్ను.

చాలా సేపయిం తర్వాత ఓ లేడీ







డాక్టర్ నా దగ్గర కొచ్చింది.

"కుట్లు వెయ్యాలి" అంది.

"వెయ్యండి."

అసిస్టెంటుని పిలిచి అన్నీ తెమ్మంది. అనస్తేషియా ఇస్తారేమో అనుకున్నా. కానీ ఏం లేకుండానే కుట్లు వేయటం మొదలెట్టింది. ఆమె మీద పీకలదాకా కోపం వచ్చింది. ఏం అనలేక పోయాను. బాధ మరీ ఎక్కువయిపోయింది. ఒక్క నిమిషం జ్యోతి గుర్తుకొచ్చింది !

చిత్రం! అంత బాధలోనూ అనిపించింది. పిచ్చి ఆలోచన!

'నేనింత బాధపడుతుంటే, దేవుడు ఆ అమ్మాయి మనసులో కాస్తన్నా ప్రేమ పుట్టించకపోతాడా' అని.

కుట్లువేసి కట్టు కట్టాను.

ఇంటికి బయలుదేరాను. శకుంతల గారింటికి వెళ్ళామనిపించింది. వెళ్ళాను. ఇంట్లోనే వుందావిడ.

జరిగినదంతా చెప్పాను శకుంతల గారికి.

"నీ పద్ధతి ఏం బాగాలేదయ్యా" అందావిడ అంతా విన్న తరవాత.

"ఏం చెయ్యమంటారు చెప్పండి? నేనేమన్నా తప్పు చేశానంటారా?"

"తప్పుకాదా? ఇంత తొందరేమిటి చెప్పు? ఆ పిల్ల నీక్కావాలని కోరుకోవటం తప్పుకాదు. నువ్వామెను పెళ్ళి చేసుకోమని అడగటం తప్పుకాదు. ఇవాళ వెళ్ళి మళ్ళా కలవటం ఏమంత మంచిది కాకపోయినా, నీ ఉద్దేశం మంచిదే కాబట్టి అదీ ఫరవాలేదు. కానీ వేలు కోసుకోవటం ఏమిటి చెప్పు? చిన్న పిల్లాడి చేష్టలా ఉంది ఇదంతా."

నా కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి.

"చిన్న పిల్లాడు బజార్లో ఓ ఆట వస్తువుని చూసి వెంటనే అది నాకు కావాలి అని మారాం చేసినట్లుంది నీ వాలకం."

"నా బుర్ర పనిచేయటం లేదండీ"

"అంత తొందరెందుకు నీకు? ఇటువంటి పన్లా చేసేది? ఆ అమ్మాయి నిన్నో సినిక్ అనుకునే ప్రమాదం కూడా వుంది తెలుసా?"

"శకుంతలగారూ! వేలు కోసుకోగానే సినిమాల్లో చూపించినట్లు ఆమె నా ఒళ్ళో వచ్చి వాలుతుందని కాదు నే అనుకుంది. అసలు ఈ విషయం గురించి ఆమె ఆలోచించటం లేదని నా బాధ. వేలుకోస్తే అన్నా-ఇతను పరిహాసాలాడటం లేదు, నిజంగానే చెబుతున్నాడు అని అర్థం చేసుకుంటుందని"

"అసలు నువ్వలా ఆ పిల్లని బజార్లో నాలుగు సార్లు కలవటం కూడా మంచిది కాదు. పదిమందికీ అలుసైపోదూ ఆ పిల్ల? నిన్ను చూసి రేపు ప్రతీ కుర్రాడూ అలాగే చేస్తే?"

నాకు ఓ ఖ్కు ముండుకొచ్చింది. ఆశ్చర్యం కూడా వేసింది. జ్యోతి ఎంతో మంది మగపిల్లలతో మాట్లాడుతూ వుంటుంది. నేను మాట్లాడటం మూలాన చులకనయి పోతుందా?

"శకుంతలగారూ! మీరు మాట్లాడే దాంట్లో అర్థంలేదు. ఏమిటి మీ ఉద్దేశం?"

"ఇది పద్ధతి కాదు. ఒకసారి చెప్పావు కలిసి. మళ్ళీ మళ్ళీ ఎందుకు కలవటం? అసలు నీకోటి చెప్పనా?"

"ఏమిటి?"

"నీ స్వభావం, ఆమె స్వభావం రెండూ కలవ్వు తెలుసా?"

కొంతమందికి దేవుడు ఎదుటి వాళ్ళను నగ్నంగా చదివే శక్తి నిస్తాడు. చాలా మందిని అర్థం చేసుకున్నా నేను. జ్యోతినే నేనర్థం చేసుకోలేకపోయింది. శకుంతల గారిని మాత్రం ఆ క్షణంతో పూర్తిగా చదివాను.

నా కర్థమైంది జ్యోతిని నేను పెళ్ళి చేసుకోవటం ఆవిడ కెందుకో ఇష్టం లేదని. బయటికి అడుగుదామనుకున్నా కారణం. కానీ నిగ్రహించుకున్నాను.

"శకుంతలగారూ! నేను కలవటం వల్ల ఆమె కంటే ఎక్కువ మీరు బాధపడు

తున్నారు పాపం. మీకు నేను మాటి స్తున్నా. ఆమె తనంతటగా పలకరించే దాకా జ్యోతితో మాట్లాడనులెండి"

ఇంకేం మాట్లాడకుండా ఇంటికొచ్చే శాను. వేలు తీపు మొదలెట్టింది. జ్వరం కూడా వచ్చింది. కాస్త చెయి కదిపితే చాలు భరించలేని బాధ. మామూలు రోజుల్లోనే నిద్రపట్టని నాకు, ఆ బాధతో ఎలా నిద్రపడుతుంది ?

ఏం చెయాలి ?

నర్సింమూర్తిగారు గుర్తొచ్చారు. యూనివర్సిటీలో తెలుగు రీడర్ ఆయన. మా నాన్నగారి ద్వారా ఆయనతో పరిచయముంది. జ్యోతి ఆయనకు తెలిసే వుంటుంది. ఆయన్ని కలిసి చెబితే నా బాధ అర్థం చేసుకుని నాకేమన్నా సహాయం చెయ్యొచ్చు.

ఒక్క ఉదుటున లేచాను పడుకున్న వాడిని. ఫోను చేశానాయనకి. ఇంట్లో లేరు. విసుగొచ్చింది.

కూచుని ఆయనకి ఓ ఉత్తరం రాయటం మొదలెట్టాను. జ్యోతిని నేను చూసినప్పటి నుంచీ ఆ వేళ సాయంత్రం వరకూ జరిగిందంతా ఒక్క మాట పొల్లుపోకుండా రాశాను. మొత్తం రాయటం పూర్తయేసరికి ఇరవై పేజీల ఉత్తరం అయింది.

మళ్ళా ఫోను చేశానాయనకి.

ఆయనే మాట్లాడారు. ఉత్తరం పంపిస్తాననీ, దయచేసి చదవమనీ చెప్పాను. సరే నన్నారాయన. మా తమ్ముడికిచ్చి పంపించాను ఉత్తరం.

కాస్త మనసు తేలిక పడింది. అం మూలాన్నేమో !



రాత్రంతా జ్యోతిని తలుచుకుంటూ, ఆమెను నాకు దక్కేట్టు చేయమని ఆ ఏడుకొండలవాడిని వేడుకుంటూ గడిపాను.



తెల్లవారింది.

నేను లేచి, కట్టు తడవకుండా జాగ్రత్తగా స్నానం చేసి భోంచేసేసరికి నర్సింమూర్తిగారు ఫోను చేశారు. ఇంటికి రమ్మన్నారు సాయంత్రం.

మంచం మీద వాలాను కాసేపు నిద్రపోదామని. రాత్రంతా నిద్రలేకపోవటం మూలాన్నేమో వెంటనే నిద్రపట్టింది. మళ్ళీ లేచేటప్పటికి అయిదయింది. విద్యానగర్‌లో వుంటారు నర్సింమూర్తిగారు. ఆయనింటికి వెళ్ళేటప్పటికి ఆరున్నరయింది.

"ఏమిటయ్యా మూర్తీ ఇదంతా ?" అన్నారు కూచోగానే కాస్త మందలింపు ధోరణిలో.

"ఉత్తరం చదివారా ?"

"ఆ చదివాలే ! కానీ ఇదంతా వన్ వే ట్రాఫిక్‌లా ఉందయ్యా. ఏదో పెళ్ళి చేసుకోవాలనుకున్నావు బాగానే వుంది. వేలు కోసుకోవటం ఎందుకు చెప్పు ?"

"ఆ అమ్మాయి నవ్వి పారేసిందండీ. తన బుర్రలోకి ఎక్కలేదు నేనంతకు ముందుచెప్పింది. కాస్త ఎప్పుడైనా ఆలోచిస్తుందని చేశానీ పిచ్చిపని."

"ఎందుకయ్యా నీకీ ఖర్మ. ఆమె విషయం ఆలోచించకు. మనసు ఇంకోవేపు

మరల్చుకో. కొన్నిరోజులుపోతే నువ్వే మరచిపోతావు.''

"మరపునకు రావటం లేదండీ ఎంత ప్రయత్నించినా. నేనేమైపోతానానిభయంగా వుంది"

"ఏముందయ్యా ఆ అమ్మాయిలో అంత ప్రత్యేకత? పెద్ద అందంగా, పొడుగ్గా, ఎర్రగా ఉంటుందా అంటే అదీలేదే. ఆ కళ్ళల్లోని ఆకర్షణా, ఆ నవ్వూ చూసేగా నువ్వు వల్లోపడ్డావ్ ?"

నవ్వాను నేను.

"అసలు ఎదుగుడలే లేదయ్యా ఆమెలో.''

కోపమొచ్చింది నాకు.

"నాక్కావలసింది భార్య. బోగంది కాదండీ.''

విచిత్రంగా చూశారాయన నావేపు.

"అసలు ఆ అమ్మాయి తత్వం ఏమిటో నాకర్థం కావటం లేదండీ. మీ దగ్గర చదువుకుంది కదా? మీకు తెలుసుంటుంది ఆ అమ్మాయి ఆలోచనలు ఎలా వుంటాయో"

"ఆ పిల్ల ఆశలు వేరయ్యా! రీసెర్చి చెయ్యాలనుంది. అసలు పెళ్ళి మీద ఆలోచన ఉన్నట్లులేదు."

"పెళ్ళి మీదకి గాలి మళ్ళించాలి. ఏం చెయ్యమంటారు ?"

"ఎలా చెప్పమంటావు ? అటువేపు నుంచి ఏమాత్రం కదలిక లేనిదే నువ్వెన్ని ప్రయత్నాలు చేసినా ప్రయోజనం ఏమిటి చెప్పు ?"

"మనసు చంపుకోలేక పోతున్నానండీ. నావల్ల కాదనిపిస్తోంది. ఇప్పటివరకూ జరిగిందంతా మీతో చెప్పాగా? ఇక ముందేం చెయ్యమంటారో చెప్పండి?"

"నీ అభిప్రాయం చెప్పావుగా. తొందర పడకు. ఆమెను ఆలోచించుకోనీ. కొన్ని రోజులు కనబడకు. తరవాత మెల్లిగా కదుపు. ఒకవేళ అప్పటికీ ఒప్పుకోకపోతే మర్చిపో. చెప్పినంత తేలిక కాదనుకో మర్చిపోవటం. కానీ జీవితాన్ని పాడు చేసుకోకు అనవసరంగా.''

"మర్చిపోవటం ఎలా సాధ్యం చెప్పండి ?"

"కాలం అన్నింటికీ మందు. ఏమో కొన్ని రోజుల తర్వాత నువ్వే ఆ పిల్లని మర్చిపోయే అవకాశం ఉంది. ఇంకెవరన్నా పిల్ల నిన్ను ప్రేమించవచ్చు. లేకపోతే నువ్వే ఇంకెవర్నో పెళ్ళి చేసుకోవచ్చు. ఏవయినా జరగొచ్చు. జీవితం పరిధి చాలా పెద్దది. అర్థమయిందా?"

జ్యోతిని పిలిచి నచ్చ చెబుతారేమో నన్న ఆశతో ఆయనకు చెబితే, ఆయన ధోరణి అలా వుంటంతో నిరాశ కమ్ముకుంది నన్ను.

వచ్చేశాను ఇంటికి.

ఆవేళే - మంచో చెడో ఆలోచించకుండానే ఏమైనాసరే ఎం. ఏ లో చేరదామని నిశ్చయించుకున్నాను.

* * *

పదిహేను రోజులు గడిచిపోయాయి. కాలేజీలు తెరిచారు. ఎం. ఏ.లో చేరాను. కొత్త ఉత్సాహం వచ్చింది నాలో. భవిష్యత్తంతా ఇంద్రధనసులా కనిపించింది.

చేరిన నాలుగురోజులకి నాకర్థమైంది.

ఎం. ఏ. తెలుగులో చేరినవాళ్ళు - మంచి ఉద్యోగం రావటానికి ఆ చదువు అంతగా ఉపయోగపడకపోయినా యూనివర్సిటీలో ఉన్నన్ని రోజులూ ఓ మత్తులో గడిపేస్తారు కాలాన్ని.

రెండేళ్ళు గడిచిం తర్వాత అనిపిస్తుం దేమో ఎందుకు చేరినట్టని?

వారం రోజులు గడిచిపోయాయి కొత్తకొత్త మొహాలతో పరిచయాలతో. మా నాన్నగారికున్న పేరు వల్ల చాలా మంది కావాలని నా చుట్టూ మూగేవారు.

రోజూ ఆమె కోసం నాకళ్ళు వెతికేవి. దూరంగా ఎవరన్నా చీర కట్టుకున్న ఆడపిల్ల కనబడితేచాలు. అలాగే కదల కుండా స్థాణువులా నిలబడిపోయి చూసే వాడిని.

తర్వాత తలుచుకుంటే నాకే ఆశ్చర్య మేసేది - నేనెందుకలా అయిపోయానా అని.

ఓ రోజు మధ్యాహ్నం లైబ్రరీకి వెళ్ళాను. లోపల తెలుగు సెక్షనులో అడుగు పెడుతుంటే కనబడింది జ్యోతి. రీడింగ్ టేబిల్ దగ్గర కూచుని ఏదో పుస్తకం తిరగేస్తోంది.

నన్ను చూసింది. నేనూ చూశాను.

పలకరించబోయాను. అంతలో శకుం తలగారితో నేనన్న మాటలు గుర్తొచ్చాయి. మాట్లాడాలనే కోరికను బలవంతాన అణుచుకున్నాను. తల వంచుకుని ఆమె ముందునుంచి దాటి హాల్ చివరికి వెళిపో యాను.నాక్కావలసిన పుస్తకం వెతకటం మొదలెట్టాను. ఎంత వెతుకుతున్నా కని పించటంలా.ఓ అయిదు నిమిషాలయ్యేసరికి నేనెందుకొచ్చానో మరిచిపోయాను.

"ఏం కావాలి మీకు?''

గిర్రున వెనక్కి తిరిగాను. జ్యోతి నిలబడివుంది.

మాట తడబడింది నాకు. చెప్పాను.

"ఎదురుగుంతా వుంది కదండీ ! అంతంత అక్షరాలు కనబడటం లేదా?''



నా పరధ్యానానికీ, కంగారుకీ నవ్వొ చ్చింది నాకు.

మనసంతా ఆమె గురించి ఆలో చిస్తుంటే కావలసింది చేతిలో ఉన్నా, నాకది తెలుస్తుందా ? బయట పడలేదు నేను. సర్దుకున్నాను.

"కాస్త పరధ్యానంలో ఉన్నానండీ ! అందుకే..."

"ఎం.ఏ.లో చేరార్ట కదా ?"

"మీకెవరు చెప్పారు ?"

"శకుంతలగారు క్రితం వారం మాఇంటికి వెళ్ళినప్పుడన్నారు."

"పండితుడిని అవుదామని ప్రయత్నం. అందుకే చేరాను."

"మీ దారి వేరు కదా ?" అంది నవ్వుతూ.

"పట్టాలు తప్పానేమో, దారి మారి పోయింది."

"అదేమిటండోయ్ ?"

కాస్త హుషారొచ్చింది నాకు.

"తెలుగు తల్లి మీద జాలేసింది. నాలాటి వాళ్ళు ఉద్ధరించకపోతే ఆ తల్లికి దిక్కెవరు చెప్పండి ?"

గలగలా నవ్వింది జ్యోతి.

ఆమె ముఖాన్ని నా రెండు చేతు ల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకోవాలని పించిది.

"వస్తానండీ" అంటూ వెళిపోయింది జ్యోతి.

మొత్తానికి తనంతట తానే వచ్చి పలకరించింది. కాని ఆమె అలా పలకరించటాన్ని నేను వేరేగా అర్థం చేసుకోలేకపోయాను. ఏదో మర్యాదకి పలకరించి ఉండొచ్చు. అందరితో సరదాగా మాట్లాడటం ఆమె తత్వం కావచ్చు. అంతమాత్రాన ఆమె మాట్లా డిన ప్రతి మనిషినీ ప్రేమిస్తోంది అను



రుంటే అది అసందర్భం.

బుగులు పుట్టింది. ఆమె నాతో మాట్లాడిన ఆ కొద్ది నిమిషాలు చుట్టూ మనుషుల్నీ, ప్రపంచాన్నీ మర్చిపోయాను. అంతా కలలా అనిపించింది. అంతటి సొగసు ఆ దేవుడు ఆమె మొహంలో ఎందుకు పొందుపరిచాడో ? ఎవరికోసం ?

ఆమె వెళ్ళిపోయిన తరవాత కూడా అక్కడ్నించి వెళ్ళాలనిపించలేదు. ఆమె కూర్చున్న కుర్చీ పక్కనే ఇంకో

కుర్చీలో కూచున్నా! ఓ నిమిషం పాటు ఆమె పక్కనే కూర్చున్నట్టనిపించింది.

ఇది మౌనారాధన!

రూపంలేని ఊహలు! ఒక పిచ్చి వాడిలా, వెర్రివాడిలా ఊహించుకుం టున్నానేమో! దీని ఫలితం ఏమిటో?

సాగర్ వచ్చి కూచున్నాడు పక్కనే.

నాతో పాటు ఎం.ఏ.లో చేరాడతను కూడా. చాలా బుద్ధిమంతుడు. అందగాడు కాకపోయినా మంచి ఒడ్డూ, పొడుగూ ఉన్న మనిషి. నెమ్మదస్తుడు. మొదటి రోజు మొదటిసారి నాతో మాట్లాడిన మొదటి మనిషి. పచ్చగా మిసమిస లాడుతూ ఉంటాడు.

తెల్లగా పచ్చగా ఉన్న మనుషలు కనుముక్కు తీరు బాగాలేకపోయినా ఆకర్షణీయంగా కనిపిస్తారు. కారణం వాళ్ళ లోపాలన్నీ ఆ మిసమిసలాడే పచ్చదనం వెనకాతల దాక్కుంటాయి.

విష్ చేశాడు కూచోగానే.

"క్లాసుకి రాలేదేం?" అన్నాడు.

"ఇక్కడొచ్చి కూచున్నాగా, మర్చి పోయానా విషయం."

'నాకు తెలుసులే' అన్నట్టు నవ్వాడు.

ఏం మాట్లాడాలో తోచలేదు.

"ఫరూక్ చిన్నప్పట్నుంచీ నాకు తెలుసు. ఇంతకు ముందే గంట క్రితం కలిశాడు నన్ను" అన్నాడు కాసేపాగి.

అర్థమయింది నాకు. ఫరూక్ సాగర్‌తో అంతా చెప్పాడన్నమాట. ఇతనికంతా తెలిసిపోయింది. ఎం.ఏ.లో చేరినందుకు నేనొక వెర్రివాడిననుకున్నాడేమో.

తనన్న మాటకి నా రియాక్షను ఎలా ఉంటుందోనని నా మొహంలోకి కళ్ళప్ప గించి చూస్తున్నాడు సాగర్.

ఏం చేయాలో తోచక ఓ వెధవ నవ్వు నవ్వాను.

"కాఫీ తాగుదాం. తలకాయ పగిలి పోతోంది" అంటూ లేచాను. ఇద్దరం కేంటీనుకి వెళ్ళి ఓ మూల కూర్చున్నాం. ఆ హాలు చాలా పెద్దది. తలొంచుకుని కాఫీ తాగుతున్నాను. ఎవరిదో నవ్వు వినబడితే అటు తిరిగాను.

జ్యోతి!

పక్కన దుష్టచతుష్టయం ఉన్నారు. ఇద్దరు కుర్రాళ్ళు; ఇద్దరు అమ్మాయిలూ. నీకిదివరకే చెప్పాగా?

ఏ విషయంలోనూ నేను ఆ కుర్రాళ్ళతో తీసిపోకపోయినా, వాళ్ళిద్దరూ ఆ క్షణంలో నా కంటే ఎన్నో రెట్లు అదృష్టవంతులనిపించింది. కారణం? వాళ్ళు జ్యోతికి అంత దగ్గరగా ఉండటం.

వాళ్ళవేపు అలాగే పరీక్షగా చూడ టానికి అభిమానం అడ్డం వచ్చింది. తలొంచుకుని కాఫీ తాగుతూ క్రీగంట చూడటం మొదలెట్టాను.

నా అవస్థ చూసి సాగర్ నవ్వాడు.

"నవ్వకు" అన్నా కరుకుగా.

నొచ్చుకున్నాడేమో, వెళ్తానని చెప్పి వెళిపోయాడు సాగర్. నేను ఆపలేదు.

జ్యోతి వాళ్లు ఇంకా అలాగే కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు. వాళ్ళ దగ్గరికి వెళ్ళి కూచోవాలనిపించింది. జ్యోతి ఒక్కతీ ఉంటే అలాగే వెళ్ళి కూచునే వాడినేమో! లేవలేకపోయాను.

నా చేతిలో మామ్ షార్ట్ స్టోరీస్ పుస్తకం ఉంది.

మనసును మరల్చటానికి ఆ పుస్తకం తెరిచాను. అంతకుముందు ఆయన కథ

లన్నీ చదివాను. ఆ వాల్యూమ్ ఒక్కటే చదవలేదు.

యథాలాపంగా పుస్తకం తెరవగానే 'ఫూల్' అన్న కథ కనబడింది. చదవటం మొదలెట్టాను.

అంతలో వాళ్ళు వచ్చారు. తలదించుకుని వున్నా వాళ్ళనే చూస్తున్నాను. వెళ్ళిపోయారు చివరకి. ఎందుకు మాట్లాడలేదా ఆమెతో అని బాధ పడ్డాను. చాలా సేపు అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాను.

మళ్ళా కథ చదవటం మొదలెట్టాను. అంతా నా కథలాగే అనిపించింది చాలా వరకూ. విషాదాంతం అది. బదులు లేని ప్రేమ నాయకుడిది. అందుకే చచ్చిపోతాడు చివరలో.

కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి.

నా జీవితం కూడా ఇలాగే అవుతుందా? ఎందుకో ఊహించుకోలేకపోయాను ఆ దృశ్యాన్ని. జ్యోతితో నా భావి జీవితం ఎంత మధురంగా ఉంటుందో ఊహించుకోవటం తప్ప ఈ పెళ్ళి జరగదు. అన్న ఆలోచన మనసుకు రావటంలేదు.

ఆమెకూడా మామూలు ఆడపిల్లలాగా గొంతెమ్మ కోరికలు కోరి పిచ్చి పిచ్చి కలలు కనే తత్వం కలదా? అలా అయితే ఇప్పటి నా పద్ధతి నన్నో వెర్రి వెధవ కింద జమ చేస్తుందంతే.

ఆకర్షణలు చూపిస్తే? మోసం చేయటం అవుతుంది అలా చేస్తే. అలా నన్ను నేను వంచన చేసుకోలేను. అటువంటి తోడూ నా కక్కర్లేదు.

ఎందుకో ఆమె అలాంటి మనిషి కాదనిపించింది. కొందరిని చూస్తే తెలిసిపోతుంది. నా అంచనా ప్రకారం జ్యోతి లాంటి వాళ్ళు మంచి మనిషికీ, మనసుకీ విలువనిస్తారే తప్ప జీవితంలోని చిన్న చిన్నకోరికలకూ, ఆనందాలకూ ప్రాముఖ్యం ఇవ్వరు.

ఏమో నా అంచనా తప్పయితే?

ఈ ఆరాటానికి అంతెక్కడ?

చాలా సేపయిపోయినట్లుంది అప్పటికే. మధ్యాహ్నం రెండున్నరా, మూడున్నరా మధ్య రష్ తక్కువగా ఉంటుంది కేంటీన్‌లో. కలకలం కాస్త తగ్గి నిశ్శబ్దం చోటు చేసుకునే సరికి ఈ లోకంలోకి వచ్చాను.

ఇంటికెళ్ళిపోయాను అక్కడ చేసేదేంలేక. ఏం చేయాలి ఆమె నాదవాలంటే? మార్గం ఏం కనిపించలేదు. మగతలో చాలాసేపు గడిచిపోయిన తర్వాత ఎప్పుడు నిద్రపోయానో నాకే తెలియదు.

* * *

మర్నాడు లేచేసరికి చాలా పొద్దుపోయింది. తొందరగా పనులన్నీ ముగించుకుని యూనివర్సిటీకి చేరుకున్నా. లైబ్రరీకి బయలుదేరాను తిన్నగా. మెట్లెక్కుతుంటే కనబడింది జ్యోతి. లేత నీలం రంగు చీర కట్టుకుంది. నా కళ్ళకి దేవతలా కనపడింది

ఎందుకిచ్చాడు దేవుడు ఆమెకంత ఆకర్షణ శక్తిని? ఎందుకు పొందుపరిచాడు ఆమెలో అంతటి సొగసును? ఎవరి కోసం వరంలాంటి ఆమెను సృష్టించాడు? కాలమే చెప్పాలి ఎవరికోసమో! సమాధానం ఏమిటో!

పలకరించింది. మాట తడబడింది నాకు. మామూలుగా ఆమెను చూసినప్పటి నుంచీ నాకున్న జబ్బేగా. కాఫీ తాగుదాం పదమన్నాను. ఇద్దరం కేంటీనుకి వెళ్ళాం.

"ఎలా ఉంది మీ తెలుగు తల్లి సేవ" అంది నవ్వుతూ.



ఆ నవ్వులో గొప్ప శక్తి వుంది. కల్మషం లేని తియ్యటి నవ్వు. అందుకే చీర రెపరెపలాడితే చాలు వెంటపడే మగాడైనా ఆ నవ్వుకు పెడర్థాలు తీసుకోలేడు.

"ఇప్పుడేగా మొదలయింది. ఇంకా స్పీడందుకోలేదు"

"నిన్న కేంటీనులో ఒక్కరే కూచున్నారే. మీ ఫ్రెండ్సెవరూ రాలేదా?"

సాగర్ వెళ్ళాక నన్ను చూసిందన్న మాట.

"అప్పుడు మా క్లాసుంది. అందుకే వాళ్ళు రాలేదు"

"మీరు వెళ్ళలేదా క్లాసుకి ?"

"లేదు" అన్నాను నెమ్మదిగా.

"ఏం ?"

"ఎందుకో వెళ్ళాలనిపించలేదండీ"

మాట్లాడలేదు తను చాలా సేపు.

"లంచ్ ఎక్కడ చేస్తారు మీరు రోజూ?" అనడిగాను.

"మా క్లాసులు మధ్యాహ్నం రెండు గంటలకల్లా అయిపోతాయండీ! పొద్దునే భోంచేసి వస్తాను. పెద్దగా ఆకలేయదు. అంతగా ఏమన్నా తినాలనిపిస్తే ఇదుగో కేంటీను ఉండనే ఉందిగా"

టిఫిను ఆర్డరిచ్చాను. వద్దంది ససేమిరా ముందర. తన మాట లెక్క చెయ్యకుండా ఇద్దరికీ తెమ్మని చెప్పటంతో వూరుకుంది. తింటూ తింటూ అడిగాను.

"మీరు గుడికి వెళ్తుంటారా ఎప్పుడైనా ?"

"ఏం అలా అడుగుతున్నారు? నాకు దేవుడి మీద నమ్మకం లేదనుకున్నారా ?"

"అలా అని కాదు. అసలు ఆస్తికత్వం, నాస్తికత్వం గురించి మాట్లాడటం నా కిష్టం వుండదు. ఎంతకీ అంతంలేని చర్చలవి. పైగా ఎవరి అభిప్రాయాలు వారివి. ఎవరి నమ్మకాలు వారివి?"

"మరెందుకు అడిగారు?"

"ఊరికే సరదాగా అడిగానంతే"

"ఓహో, ఆవాళ గుడికి రమ్మంటే రానన్నానని అలా అడిగారా ?"

"ఇవాళ గుడికొస్తారేమో అడుగుదామని" అన్నా. తినటం ఆపి నా వేపు చూసింది.

"సాయంత్రం వెంకటేశ్వర స్వామి గుడికి రాగలరా? ఓ గంట సేపు కూచుందాం. ఏడు గంటలకల్లా మళ్ళీ వెళ్ళిపోదురు గాని"

మాట్లాడలేదు తను.

"మీ కిష్టం లేకపోతే వద్దులెండి" అన్నా.

"ఇష్టం అని కాదు. గుడికెళ్ళటానికి ఇష్టం అయిష్టం ఏమిటండీ! కానీ సాయంత్రం మా అత్తయ్యా వాళ్ళు వస్తున్నారు. చాలా రోజులయింది వాళ్ళని చూసి. ఇంట్లోనే వుందామనుంది ఇవాళికి"

"మీకు పనుంటే వద్దులెండి. ఇంకోసారి ఎప్పుడైనా వెళ్దాం. అన్నట్టు రేపు యూనివర్సిటీకి సెలవు కదా"

"అవును"

"రేపు రాగలరా?"

"ఆఁ"

"నేనక్కడే వుంటాను. ఆరు, ఆరున్నర కల్లా వచ్చేయండి. మళ్ళీ తొందరగా వెళ్ళిపోవచ్చు"

అలాగే నన్నట్టు తలూపింది జ్యోతి.

కాఫీ తాగి ఇద్దరం ఎవరి క్లాసులకి వాళ్ళు బయలుదేరాం. నేనూ క్లాసు కెళ్ళాను.

లేటుగా క్లాసుకెళితే పెద్ద తలనొప్పి. పాఠం చెబుతున్న లెక్చరరూ, వింటున్న స్టూడెంట్సూ అందరూ లోపలికి వచ్చేవాడి వేపే చూస్తారు విసుగ్గా.

క్లాసులో కూచుని లెక్చరరు చెప్పేది వింటున్నానన్నమాటే కాని నాకేం అర్థం కావటం లేదు. మర్నాటి సాయంత్రం జ్యోతి వచ్చినప్పుడు ఎలా మాట్లాడాలా, ఏం మాట్లాడాలా అనే తపన.

సాగర్ మోచేత్తో పొడిచాడు. ఏమి

టన్నట్టు చూశాను. లెక్చరర్‌ని చూపించాడు కళ్ళతో.

ఆయన వేపు చూశాను.

"నిన్నే నాయనా! ఇందాకట్నుంచీ పిలుస్తుంటే వినిపించుకోవేం బాబూ?"

నా కర్థం కాలా. అవునన్నట్టు తలూపాను. ముసి ముసి నవ్వులు క్లాసంతా. ఆయన అడిగిందేమిటో నాకు తెలియదు. ఏమనాలో అంతు పట్టలేదు. ఏం మాట్లాడకుండా అలాగే కూచున్నాను. ఇలా పరధ్యానంగా వుండటం, నవ్వుల పాలవటం ఈ మధ్య చాలా సార్లు జరిగింది.

నా మీద నాకే జాలేసింది.

క్లాసయిపోయాక మళ్ళీ లైబ్రరీకి వెళ్ళాను జ్యోతి కనబడుతుందేమోనని. లోపల ఎంత సేపు చూసినా ఎక్కడా కనిపించలేదు.

ఇంటి కెళిపోయాను.



మర్నాడు పొద్దునే లేచాను. స్నానం, భోజనం కానిచ్చి నవల చదవటం మొదలెట్టాను.

చదువుతుండగానే ఎప్పుడు నిద్ర పట్టిందో, మెలకువ వచ్చేసరికి అయిదైంది. చక చకా మొహం కడుక్కొని తయారయి గుడికి వెళ్ళాను పావుగంటలో. ఇంకా జ్యోతి రాలేదు. కొండ ఎక్కుతుంటే దారిలో ఖాళీ స్థలం వుంది. అక్కడ కలుద్దామని చెప్పాను జ్యోతికి.

అరగంట గడిచిపోయింది ఎదురు చూట్టంలో.

నా కళ్ళన్నీ కింద నుంచి వస్తున్న వాళ్ళ మీదే వున్నాయి. అప్పుడే చీకటి పడుతోంది. కాస పరీక్షగా చూస్తే తప్ప మనిషిని పోల్చుకోవటం కష్టం.

తలొంచుకొని గబ గబా అడుగులో అడుగేసుకుంటూ నడుస్తూ కనబడింది జ్యోతి. లైటువెలుతురులోకి వచ్చినప్పుడు చూశాను. లేత ఆకుపచ్చ రంగు చీర కట్టుకుంది.

నవ్వింది బాసింపట్టు వేసుకొని కూచున్న నన్ను చూసి.

"రారేమో అనుకున్నా"

"నిజంగానే వచ్చేదాన్ని కాను. కానీ వస్తానని మాటిచ్చాను కాబట్టి వచ్చాను"

"పైకి వెళ్దాం పదండి"

ఇద్దరం గర్భ గుడిలో దేవుడికి దణ్ణం పెట్టుకుని, ప్రసాదం తీసుకుని ఓ మూలగా పోయి కూచున్నాం. అక్కడ నుంచి చూస్తే హైదరాబాదంతా కనిపిస్తుంది. మెరుస్తున్న నక్షత్రాల్లా కనిపించాయి చుట్టూ దీపాలు.

అసలు విషయం కదపాలి అనుకున్నాను.

"మళ్ళీ ఈ విషయం మీతో ఇప్పుడిప్పుడే మాట్లాడకూడదనుకున్నాను" అంటూ మొదలు పెట్టాను.

"ఏ విషయం?"

"పెళ్ళి విషయం. కానీ నేను మళ్ళా ఎందుకు చెబుతున్నానో తెలుసా? నా ఆరాటం, ఆత్రుత అర్థం చేసుకుంటారనే ఆశ."

ఏదో మాట్లాడబోయింది జ్యోతి.

"నేను ఎం.ఏ లో చేరిన కారణం ఏమిటో మీకు తెలుసా?"

"ఎందుకు చేరారు?"

"మిమ్మల్ని రోజూ చూడొచ్చని."

"మూర్తిగారూ..."

"అప్పుడప్పుడు నాకనిపిస్తూవుంటుంది. ఏమనో తెలుసా? నా మనసులో ఉద్దేశం మీకు చెప్పకుండా మీతో ఓ స్నేహితుడి లాగానైనా ఉండుంటే బావుండేదని. అందరితో మాట్లాడినట్టే నాతోనూ మాట్లాడే వారు. ఈ సిగ్గూ, బిడియం ఉండేవి కాదు"

"నన్ను మాట్లాడనివ్వరా?"

"నాకు నటించటం చేతకాదు. మనసు లోని మాట దాచుకోవటం అంతకంటే చేతకాదు. అందుకే నన్నూ, నా మనసునీ అంతగా మీ ముందు పరిచాను."

ఏం మాట్లాడలేకపోయింది జ్యోతి.

"కొన్ని రోజుల క్రితం దాకా అను కునేవాడిని నేను ; మిమ్మల్ని అప్పు డప్పుడు చూస్తూ ఎన్నేళ్ళయినా గడప గలననీ, ఈ లోపల మీరూ నన్నర్థం చేసు కుంటారనీ. కానీ రోజులు గడిచిపోతున్న కొద్దీ నా మెదడు కొంచెం కొంచెం మొద్దు బారి పోతోంది. ఇలాగే వుంటే నేనెందుకూ పనికిరాని వాడినయిపోతానేమో"

"కొన్ని రోజులు నన్ను చూడకుండా ఉండండి. మీరే మర్చిపోతారు" అంది జ్యోతి.

"ఎలా ? ఈ ప్రయత్నాలన్నీ ఇది వరకే చేశాను.

"నా మనసు వశం తప్పిపోయిందండీ"

"......"

"ప్రతి నిమిషం మీరే జ్ఞప్తికి వస్తూం టారు."

ఆ మాట అంటూ ఆమె కళ్ళల్లోకి చూశాను. ఏడుపొచ్చింది నాకు చెబు తున్నప్పుడు.

కాసేపు తనూ మౌనంగా కూచుంది.

"నే నిక వెళ్ళాలండీ ! పనుంది" అంది జ్యోతి.

బాధతో మూలిగింది నా మనసు-నేనెంతో క్షోభపడి చెబితే, ఆమె అంత తేలిగ్గా తీసిపారేసినందుకు.

"ఏమంటారు ?"

''మూర్తిగారూ ! ఇంక ఆ విషయం గురించి మాట్లాడకండి.''

''ఏం చెయ్యమంటారు నన్ను?''

"మీకు కావలిస్తే ఒక స్నేహితుడిగా ఎన్నిసార్లైనా కలవండి నన్ను."

"అంతేనంటారా ?"

"ప్రస్తుతానికి ఇంతకంటే ఏం చెప్ప లేనండీ"

"పోన్లెండి. మీకెలా ఇష్టమయితే అలాగే కానివ్వండి. పదండి వెళ్దాం మళ్ళా మీకు ఆలస్యమవుతుంది..."

* * *

మర్నాటినుంచీ నన్నేదో ఊహకందని స్తబ్దత ఆవరించింది. బహుశా బదులు రాకపోవటంవల్లనేమో మగవాళ్ళు బయట పడినంత తొందరగా, ఆడవాళ్ళు ఏ విషయంలోనూ తొందరపడరు.

నాలో పుట్టిన ఈ స్పందన ఆమెలో కూడా ఉందా ? నాకెందుకో నమ్మకం కలగటం లేదు.

అలా అని ఆమెని నేనసలు కదిలించ లేదని కూడా అనుకోను.

ఎలా, ఏ విధంగా ఆలోచించినా అంతా గజిబిజిగా వుంది. ఈ తపన ఎన్నాళ్ళకి తీరేటట్టు ?

దీన్నే ప్రేమంటారా?

చాలామంది ప్రయత్నింటారు కను

కోవాలని ప్రేమంటే ఏమిటో. ఎంతో మంది ప్రేమని చదివామని మురిసి పోయారు. వారి వారి దృక్పథాలకి అనుగుణంగా దానికి నిర్వచనం చెప్పారు.

కానీ-

ఏ మనిషీ ప్రేమని పూర్తిగా అర్థం చేసుకోలేదు. ఎందుకంటే, మనిషి జీవిత కాలం చాలా తక్కువ కనుక. అర్థం చేసుకున్నాననే అజ్ఞానంలోనే బ్రతుకు తాడు ఏ మనిషైనా చచ్చేవరకూ.

ఎన్నో ఉన్నతమైన భావాలకు తల్లి లాంటిది ప్రేమ!

అయినా ప్రేమ అనేది చవకయి పోయింది. కారణం - కామంతో ప్రేమని ముడి వేసినందువల్లనే!

నేనలా జతకలపలేదు ప్రేమని. అందుకే 'నాది కల్మషం లేని ప్రేమ' అని అనలేనేమో కాని, ఆరాధన అన గలను. ఎందుకో జ్యోతిమీద నాకున్న భావం ఆరాధనలా కనబడుతోంది. ఆరాధన ప్రేమలో భాగం అని నా నమ్మకం.

ఓ నెల రోజులు ఇలాగే ఆశలతో నిట్టూర్పులతో గడిచి పోయాయి.

అప్పుడప్పుడు కనబడుతుండేది జ్యోతి. ఎప్పుడూ ఎవరో పక్కన ఉండటం మూలానా, ఒక్కతీ కనబడితే మళ్ళీ పెళ్ళి విషయం నా అంతట నే మాట్లాడిన అప్పుడు ఎక్కడ అపార్థం చేసుకుంటుందో అన్న భయంమూలానా-ఊరికే పలకరించి ఏవో కబుర్లు చెప్పి వెళిపోవటం తప్పించి అసలు విషయం మాట్లాడలేక పోయాను.

ఈ నెల రోజుల్లో నాకు తెలియ కుండా ఎన్నో జరిగాయి. మా విషయం యూనివర్సిటీ అంతా తెలిసిపోయిన సంగతి నా చెవిన పడింది.

నేనేమన్నా లేచి రమ్మన్నానా జ్యోతిని నాతో? ఎందుకు ఇంత ఆసక్తి అందరికీ?

సుందర ఏం చేయాలో అర్థంకాలేదు.

ఆలోచించగా అర్థమయింది వాస్తవం.

'ఈ ప్రపంచం నా కొద్దు' అనుకున్నా, ప్రపంచం మాత్రం అలా బతకనివ్వదు ఏ మనిషినీ.

కుళ్ళి కుళ్ళి ఏడ్చాను-మూడో మనిషికి ఈ విషయం ఎందుకు తెలియనిచ్చానా అని.

నలుగురికి తెలిస్తే చాలు అందరికీ తెలిసి పోతుంది. ఎవరయినా మూడో మనిషి ఆమెని ఈ విషయం గురించి కాస్త వ్యంగ్యం జోడించి అడిగితే, ఆమె తప్ప కుండా నొచ్చుకుంటుంది. నా మీద అసహ్యం పుట్టే అవకాశాలు చాలా ఉన్నాయి.

మనసు వణికింది భయంతో.

జీవితమంతా ఆమెతో గడుపుదామని కలలు కంటూ ఒక్కసారిగా ఇంక ఆమె నాకు దక్కదు ఎప్పటికి - అని తెలిస్తే?

ఆ బాధ నేను భరించగలనా?

గుండె పగిలిపోతుందేమో!

చేజేతులా పోగొట్టుకోలేను నాకు కావాలని కలలు కంటున్న సౌభాగ్యాన్ని.

అందుకే నిశ్చయించుకున్నాను. నేనే మైనా ఫరవాలేదు. ఎంత నాశనమైనా బాధలేదు. ఆమెకు మాత్రం వీసమెత్తు అపకారం కూడా జరగకూడదు.

ఎలా?

ఆమె ఏ విధంగానూ నొచ్చుకోకుండా చేయటం ఎలా?

ఏం చెయ్యాలి?



చివరికి ఎంతో ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాను.

ఇంకెప్పుడూ ఆమెని పలకరించ కూడదు. ఆమె కనబడితే పక్కకి తప్పుకు పోవాలి. అంతగా చూడాలనిపిస్తే, ఒక్క సారి దూరం నించి చూసి వెంటనే అక్కడినుంచి వెళ్ళిపోవాలి.

అలా కొన్ని రోజులు చేస్తే అందరూ ఏమనుకుంటారో నాకు తెలుసు.

ఇతను ఆ అమ్మాయిని ప్రేమించినా, ఆ అమ్మాయికి ఇతనంటే ఇష్టం

లేదు. ఇష్టంలేదని చెప్పేసి ఉంటుంది; అందుకే ఇద్దరూ మాట్లాడుకోవటం లేదు అనుకుంటారు.

నేనందరి దృష్టిలో చులకనయి పోవచ్చు. ప్రపంచానికి ఏం తెలుస్తుంది నేనేమిటో, నా సామర్థ్యం ఏమిటో! నాకది భరించలేనంత హ్యూమిలియేషన్ కావచ్చు. ఆమె లాంటి మనిషి కాదంది కాబట్టి నేనెందుకూ పనికిరానివాడినవొచ్చు.

ఫరవాలేదు. ఆ భావాన్ని తొక్కేస్తాను. ఆమె కోసం, నా స్వాభిమానాన్ని ఖననం చేయటం అంత కష్టం కాదు. ఆమె తప్ప రెండో మనిషి నా గురించి ఏమనుకున్నా నాకు ఫరవాలేదు.

ఆమె సన్నర్థం చేసుకోవాలి.

అదే నేను కోరేదీ, మనసావాచా ఆ దేవుడిని వేడుకునేదీ!

కానీ—

ఆమెకి తెలియాలి; నా ఆవేదనా, ముఖ్యంగా నా ఉద్దేశం.

పలకరించకూడదని నిశ్చయించుకున్నాను.

మరెలా ఆమెకి తెలిసేది?

ఉత్తరం!

నన్ను నేను ఉత్తరం ద్వారా ఆమెకి తెలియపర్చాలనుకున్నాను.

అప్పుడు ఓ సమస్య తలెత్తింది. ఆమెను పలకరించనప్పుడు ఉత్తరం అందిస్తే బావుంటుందా? అందరిలాగే నన్నూ అంచనావేసి చులకనగా చూడొచ్చు. అందుకే ఆమెని రోజుకి ఎన్నోసార్లు కలిసే అవకాశం ఉన్నా, ఉత్తరం ఆమెకు పోస్టు ద్వారా పంపించాలని నిశ్చయించుకున్నాను.

చిత్రంగా ఉంది కదూ?

నా కామె ఎంతో దగ్గరగా ఉందని పిస్తుంది. కాని నిజానికి ఎంతో దూరం. అందుకే పోస్టల్ డిపార్టుమెంటుని నమ్ముకున్నాను.

పన్నెండు పేజీల ఉత్తరం రాశాను. నా జీవితంలో ఆడపిల్లకి రాసిన మొట్ట మొదటి ఉత్తరం అది.

'నీ కళ్ళు బావున్నాయి, ఒళ్లు బావుంది, చీర బావుంది, నడక హంస నడకలా ఉంటుంది' అని కాదు నేను రాసింది.

నేను తీసుకున్న నిర్ణయం, అలా నిర్ణయం తీసుకున్న కారణం, ఎన్ని రోజులైనా నేను వేచి ఉంటాననీ, ఊహలతో ఆశలతో ఎన్ని రోజులైనా నేను గడుపుతాననీ, సన్నర్థం చేసుకోమనీ ఎంతో దీనంగా రాశాను ఉత్తరం.

దాన్ని ఉత్తరం అనటంకంటే ఉద్యోగానికి పెట్టుకున్న అర్జీ అనటం బావుంటుందేమో.

నాలో ఇంత బలహీనత ఎలా వచ్చిందో అర్థం కావటంలేదు. ప్రేమ మనుషుల్ని బలహీనంగా చేస్తుందా? ఏ మనిషికైనా అదో శక్తినిస్తుందని నా నమ్మకం. మరి నా విషయంలో ఇలా ఎందుకు జరిగింది?

బహుశా బదులు లేకపోవటం మూలాన్నేమో.

ఆ అమ్మాయికి రవ్వంత ఆసక్తి ఉందని నా నమ్మకం. సాధారణంగా మగవాళ్ళు, ఆడది కాస్త నవ్వుతూ మాట్లాడగానే ఎన్నో పెడర్థాలు తీసుకుంటారు.

అదృష్టమో, దురదృష్టమో నేనలా నన్ను నేను మోసం చేసుకోలేకపోతున్నాను.

ఆ అమ్మాయిలో నా మీద ప్రేమ ఇంకా పుట్టలేదని నా ఉద్దేశం. ప్రస్తుతం ఆమె మనసులో మగాడికి ఇంతవరకూ చోటు ఉండి ఉండదనే నా ఆశ.

ఆ చోటు నాది కావాలి! అదే నాకోరిక.

ఆమె నా ఉత్తరానికి బదులు సమాధానం రాస్తుందని నాకు నమ్మకంలేదు. రాసినా నాకూ అది అంత ఇష్టంలేదు. నాకంటే వేరే మార్గాలు లేక ఉత్తరాలు రాయటం మొదలుపెట్టాను. కాని ఆమె కెందుకొచ్చిన ఖర్మ?

అందుకే ఆమెకి నేనే రాశాను ఉత్తరంలో.

'మీరు సమాధానం ఇవ్వాల్సిన అవసరం లేదు నా ఉత్తరానికి. నా ఉత్తరాన్ని చదవాలి మీరు. అదే నాక్కావలసింది. అంతకంటే ఎక్కువ కోరను మిమ్మల్ని' అంటూ.

కొన్నిరోజులు పోయాకైనా ఆమె మనసు మారకపోతుందా అనే ఆశ. ఆమె మీద నాకున్న భావం లాంటిదే నామీద ఆమెకీ కలగొచ్చుకదా.

దేవుడే పలుకుతాడు అప్పుడప్పుడు. జ్యోతి పలకదా? కాస్త కూడా కదలదా?

* * *

ఇలా ఆశలతో ఊపిరి పోసుకుంటూ ఇంకో నెల రోజులు గడిపాను. రోజూ పొద్దున ఆరుగంటలకి నా ఉత్తరం పోస్టు చేసేవాడిని. ఆమెకి ఒంటిగంటకి ఆ ఉత్తరం చేరుతుందని నాకు తెలుసు.

ప్రతిరోజూ ఎదురు చూసేవాడిని నా దగ్గరకొచ్చి నన్ను పలకరిస్తుందని. ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసేవాడిని.

అల్లంత దూరం నుంచి చూసేవాడిని. ఆమె భుజం నిండా పమిట వేసుకుని, హుందాగా నడుస్తుంటే, దూరంనించి నేను చూసినప్పుడు ఏదో అనిర్వచనీయమైన ఆనందం, తృప్తి నా గుండెనిండా నిండిపోయేవి.

'ఈ మనిషి నామనిషి కాబోతోంది. నాతో పంచుకుంటుంది పది పదుల జీవితాన్ని' అనే ఆశ మూలాన్నేమో.

కొద్దికొద్దిగా ఆమెలో కాస్త మార్పు రావటం గమనించాను. ఇదివరకులా ఎక్కువ నవ్వటం మానేసింది.

హఠాత్తుగా నేకనబడితే, చుట్టూ అందరూ ఉన్నారన్న ధ్యాస లేకుండా నా వేపు కళ్ళప్పగించి అలాగే చూసేది కొన్ని క్షణాలపాటు.

నా గురించి ఆలోచిస్తోందని ఎంతో సంబర పడ్డాను. కాని మళ్ళీ భయమేసింది.

ఎందుకో తెలుసా?

నేనలా పిచ్చిపిచ్చిగా ఆలోచించి నాక్కావలసిన విధంగా ఆమెనీ, ఆమె ప్రతీ చర్యనీ సమర్థించుకోవటం ఆత్మవంచనే అవుతుంది.

అందుకే మనసెంత పీకినా ఆమెను పలకరించలేకపోయాను ఆ నెలరోజులూ. ఏ విధంగానూ ఆమెని నొప్పించకూడదని నా ఉద్దేశం. ఎందుకు తొందరపడటం? ఆ మాత్రం బాధ భరించలేనా ఆమెను నా దాన్ని చేసుకోవటానికి? ప్రయత్నం చేసే పెద్ద కష్టం అనిపించలేదు. నాకు నేను సర్ది చెప్పుకున్నాను.

జ్యోతి కనపడిన ప్రతిసారీ ఆమెతో ఏమైనాసరే మాట్లాడి ఒప్పించాలనీ, ఆమె ఒప్పుకోవచ్చనీ అనిపించేది. అసలుకే మోసం వస్తుందన్న భయంతో నా కోరికను అణుచుకున్నాను.

అన్ని రోజుల తరవాతైనా ఆమె అంతట ఆమె వచ్చి నాతో మాట్లాడుతుందనీ, పెళ్ళికి ఇష్టపడుతుందనీ అనుకు



న్నాను. అక్కడికి ఆమెని తొంగచూడాలనీ కాదు, ఆమె తనంతగా వచ్చి నన్ను పలకరించాలి అన్న అహం అంతకంటే కాదు.

మిగిలిన మార్గం అవాక్కడే కనుక.

జ్యోతిని చూసిన తర్వాత తనని గురించి నేనాలోచించని క్షణం లేదు. కలలు కనని రోజు లేదు. ఇన్ని నిమిషాలు, రోజులు ఆమె గురించే నేను వెచ్చిస్తున్నప్పుడు నా కోసం ఆ మాత్రం చేయలేదా ఆమె ?

ఆ కాస బదులు లేకపోతే ఏం చేసు కోను ఆ మనిషినీ, మనసునూ ?

నాక్కావలసింది ఆడతోడు కాదే. అదే కావలసొస్తే ఎవర్నయినా ఉంచుకొనే వాడిని. ఆ సోమతు లేకపోతే ఎవరి దగ్గ రన్నా ఉండిపోయేవాడిని.

తోడు కావాలి నాకు.

ఆ తోడు జీవితాంతం ఉండాలి.

నన్నర్థం చేసుకునే తోడు, నా కోసం కలవరించి ఎదురు చూసే తోడు కావాలి.

ఎంత స్నేహితుడైనా, స్నేహితు రాలైనా జీవితాంతం నాతో గడపటం సాధ్యం కాని పని. ఎందుకంటే ఎవరి జీవితాలు వారివి, ఎవరి ఆశలు వారివి, ఎవరి ఏకాంతాలు వారివి.

ఒక్క భార్య తప్పితే ఎవరు మనతో అలా జీవిత కాలం గడిపేది ?

అదే కారణం జ్యోతిని నా సర్వ స్వంగా ఎంచుకున్నది.



ఇంకో నెల రోజులు ఇలా గడిచి పోయాయి. ఆమెతో ఆఖరిసారి నే మాట్లా డింది రెండునెలల క్రితం. రెండు నెలలూ ఎన్నో యుగాలుగా గడిచాయి. రాత్రీ పగలూ ఎంతో పెద్దవైపోయాయనిపించేది. ఇంక అలా రోజులు గడపటం మూలాన ఏం ప్రయోజనం లేదనిపించింది.

ఎందుకు జ్యోతిలో చలనం రావటం లేదో నా ఊహ కందలేదు.

అప్పుడే ఓ ఆలోచన తట్టింది మనసుకి ఎం. ఏ. మానేసి ఉద్యోగంలో చేరితే?

నాన్నగారు తలుచుకున్నారంటే నిమి షాల మీద నాకు మంచి ఉద్యోగం వేయించగలరు. ఉద్యోగంలో చేరి వాళ్ళ తల్లిదండ్రుల ద్వారా ప్రయత్నం చేస్తే ? ఎందుకో నమ్మకం కుదిరింది. అలా చేస్తే తప్పకుండా నాక్కావలసింది సాధించ గలనని.

ఆ రోజే నాన్నగారితో చెప్పాను నాకు పది రోజుల్లో ఉద్యోగం కావాలని. ఆయన అర్థం చేసుకున్నారు. అందుకే దాని గురించి నాతో వాదించలేదు.

"ఉద్యోగం ఇప్పించటం కష్టం కాదు. కానీ నీకే ఉద్యోగం ఇప్పించాలో నాకర్థం కావటం లేదు. ఏది చెయ్యగలవు నువ్వు"

"కనీసం నాలుగంకెల జీతం ఉండాలి. మీ హోదాకూ పేరుకూ తగదీ, నా కోరిక తీరేందుకు ఉపయోగ పడేదీ కావాలి. ఎంత కష్టపడమన్నా పడతాను. రోజుకి పదహారు గంటలు పనిచేయమన్నా చేస్తాను"

"అర్థమయింది. కానీ నీకు కావలసిన ఉద్యోగం దొరకాలంటే కాస్త టైము కావాలి. ఇంత తొందరగా రావటం కష్టం. నువ్వెంత సమర్థుడివైనా, నాకెంత పలుకు బడి వున్నా మంచి ఉద్యోగం రావాలంటే దానికి టైం పడుతుంది"

"నేనసలు ఉద్యోగం ఎందుకు చెయ్యా లనుకుంటున్నానో మీకు తెలుసుగా ?"

"తెలుసురా. కానీ నే చెప్పింది అర్థం చేసుకో"

"ఎలా నాన్నగారూ ! వీలయితే నాకు రేపే చేరిపోవాలనుంది ఉద్యోగంలో.

ఆత్రతం. ఏం చెయ్యమంటారు ?"

"పోనీ ఓ ఆరేడు వందలు వచ్చే ఉద్యోగం ఏదన్నా చూడమంటావా?వారం రోజుల్లో ఇప్పిస్తాను. ముందర దాంట్లో చేరిపో. రెండు నెలల్లో నువ్వడిగిన దాని కంటే మంచి ఉద్యోగం వచ్చేటట్టు చేస్తాను. ఆ పూచీ నాది. ఏమంటావు ?"

"స్నేహితుడితో చెప్పుకోవాల్సినవీ, అడగాల్సినవీ మీతో చెబుతున్నాను. అడుగుతున్నాను. మీ కంటే నన్నర్థం చేసుకునే వాళ్ళూ, నా క్షేమం కోరే వాళ్ళూ నాకెవరున్నారు చెప్పండి? మీరెలా చెబితే అలా చేస్తాను"

అలా నా జీవితాన్ని మరో వేపుకి తిప్పాను. మా నాన్నగారికున్న పలుకుబడి నీకు తెలుసుగా ?

అన్నమాట ప్రకారం వారం రోజుల్లో నాకు ఉద్యోగం చూపించారు. అవటానికి గుమాస్తా ఉద్యోగం అయినా, పెద్ద పేరున్న కంపెనీ కాబట్టి జీతం ఏడొందలు.

కొండంత ధైర్యం వచ్చింది నాకు. ఉద్యోగం రాగానే ఆమె నాకు దక్కుతుందన్న పిచ్చి నమ్మకం ఏర్పడింది.

అప్పుడే నా వయసులో ఏ కుర్రాడూ చేయకూడని పని చేశాను. చేయరేని పనేమో అసలు.

ఉద్యోగంలో చేరటానికి ఇంకా మూడు రోజులు టైం ఉందనగా అనిపించింది నాకు వాళ్ళింటికెళ్ళి చెబుదామని. వాళ్ళ పెద్దవాళ్ళతో అసలు విషయం చెప్పి ఒప్పిస్తే ఈ అమ్మాయికి ఏం అభ్యంతరం ఉండదన్న ఆలోచనొచ్చింది.

నేనిలా చేయటంవల్ల లాభం జరిగిందో, నష్టం జరిగిందో, వాళ్ళు నా గురించి ఏం అంచనా వేసుకున్నారో ఇప్పటికీ నాకు తెలియదు.

ఇంటికెళ్ళి ఏం చెప్పాలి, ఎలా చెప్పాలి అనేది తెలియలేదు. ఉన్నదున్నట్లు చెప్పేద్దామనుకున్నా

ఓ రోజు సాయంత్రంఏడు గంటల వేళప్పుడు వాళ్ళింటికెళ్ళాను. వాళ్ళ ఇంటి ముందర నడవా దాటితే, కటకటాల వసారా వుంటుంది. వసారాలోంచి చూస్తే రెండు గదులూ, వెనకాతల దొడ్డీ కనబడతాయి.

దొడ్లో అరుగు మీద కూర్చుంది జ్యోతి ఎటోచూస్తూ. బయటికి చూస్తే నేను కనబడతాను. కాని ఆలోచనలో మునిగి వుంది.

తలుపు చప్పుడు చేశాను మెల్లగా. నన్ను చూసి చటుక్కున లేచి వచ్చింది వసారాలోకి. ఏం మాట్లాడాలో అర్థం కాలేదేమో!

'రాకోయీ అనుకోని అతిథీ' పాట గుర్తుకొచ్చింది నాకు ఎందుకో.

లోపలికి రండి అన్నట్టు నవ్వుతూ తలుపు తీసింది. నేను పలకరింపుగా నవ్వాను. బయటే నిలబడి అన్నా.-

"మీ నాన్న గారిని పిలుస్తారా కాస్త మాట్లాడాలి"

అంతలో వాళ్ళ నాన్నగారు కాబోలు వచ్చారు వసారాలోకి. యాభైఏళ్ళ ముసలాయన.

"నమస్కారం. నా పేరు మూర్తి. మీతో మాట్లాడాలి వీలుంటుందా మీకు ?" అనడిగాను.

కాసేపు ఏం అర్థం కానట్టు ఎగాదిగా చూసి లోపలికి రమ్మన్నారాయన.

ఆయనకి జాతకాల పిచ్చి వుంది. జాతకాలు చూసే వాళ్ళకి ఎక్స్‌రే కళ్ళుం

టాయి. ఎదుటి వాళ్ళు మన సత్వం ఎంతో బాగా అర్థం చేసుకోకపోతే జాతకం చదవలేరు వాళ్ళు. అందుకే ఏం దాచ కుండా అంతా కుండబద్దలు కొట్టినట్టు చెప్పాను.

"మా నాన్నగారు రావుగారు. పేరు వినేవుంటారు. నాకో సమస్య ఎదు రయ్యింది. సహాయం చేయగలరా?"

"ఏమిటి?"

"నేను తప్పు చేస్తున్నానో, ఒప్పు చేస్తున్నానో నాకు తెలియదు. ఒప్పయితే నాకు సంతోషం. తప్పయితే నన్ను క్షమించండి. పెద్దవారు అర్థం చేసుకుంటా రనుకుంటున్నాను.

"అలాగే. చెప్పండి"

ఆయనకి నా గురించి అంతా చెప్పాను. నా బాధ చెప్పాను. మా కుటుంబం గురించీ చెప్పాను.

"మీ సమస్య ఏమిటి?" అన్నా రాయన. నా ఉపోద్ఘాతం వినుగు పుట్టి నట్టుంది.

"మీ అమ్మాయిని పెళ్ళి చేసుకోవా లనుంది నాకు. ఎంతో ఆలోచించి తీసు కున్న నిర్ణయం ఇది. చదువులో నాకంటే మీ అమ్మాయి ఓ మెట్టు పైనుందని మీకే మైనా కాంప్లెక్స్ వుంటే, ఒక రెండేళ్ళలో నేనూ ఆమెను అందుకుంటాను ఆ విష యంలో. అలా కాదు ఉద్యోగంలో చేర మంటే నాలుగు రోజుల్లో మంచి ఉద్యోగం చూసుకుంటాను. కొన్ని రోజులు ఆగ మన్నా ఆగుతాను"

".........."

"మీరెలా చెబితే అలా చేస్తాను. మీరూ ఆలోచించుకోండి. మీ ఉద్దేశం నా అభిప్రాయంతో కలిస్తే మా పెద్దవాళ్ళని తీసుకొస్తాను. కానీ ముందర మీరు కొన్ని రోజులు ఆలోచించి మీ నిర్ణయం చెప్పండి. నా ఆరాటం, ఆతృత, ఈ బాధ అర్థం చేసుకుంటారనే నా ఆశ"

పాపం ఎంతో ఓపికతో అంతా విన్నారాయన.

"మీరు ముందర ఉద్యోగంలో జాయి నవ్వండి. నాకే అభ్యంతరం లేదు" అన్నారు.

అంతలో జ్యోతి వాళ్ళమ్మగారొచ్చా రక్కడికి.

అవిడతో అన్నారాయన-

"ఏమే! ఈ అబ్బాయి బియస్సీ పాసయ్యాడు. మన వాసంతిని పెళ్ళి చేసుకుంటానంటున్నాడు. ఏమంటావు?"

నాకు నవ్వొచ్చింది. ఏడుపులాంటి నవ్వు!

నేనంతసేపూ జ్యోతి గురించి ఆయనకి చెబితే, నా కంఠశోష అంతా వాసంతి కోసమని ఆయన అనుకున్నారు.

"నేను మీతో చెప్పింది జ్యోతి గురించి" అన్నా.

"జ్యోతి గురించా? తనకి ఇప్పుడిప్పుడే పెళ్ళి చేయాలనే ఉద్దేశం మాకు లేదు బాబూ! ఎం. ఏ. అయింతర్వాత రీసెర్చి చేస్తానంటోంది తను. అదీకాక పెద్దమ్మాయికి పెళ్ళి కాకుండా జ్యోతికి ఎలా చేస్తాం చెప్పు?" అన్నారు వాళ్ళమ్మ గారు.

"పెళ్ళికి నాకు తొందర లేదండీ! రెండు మూడేళ్ళు ఆగమన్నా ఆగుతాను. నాక్కావలసింది మనం ఓ అభిప్రాయాని కంటూ రావటం. పెళ్ళి దేముంది? అన్నీ కుదిరినప్పుడే చేసుకోవచ్చు. మీరే విషయం ఆలోచించి ఓ వారం రోజుల్లో నాకు చెప్పండి. తర్వాత ఎన్ని రోజులయినా నాకు ఫరవాలేదు. ఆగుతాను. ఏమం

టావు!"

"ఆ ఘుడియ వచ్చినప్పుడే తప్ప, మేం ఇప్పటి నుంచీ అటువంటివి పెట్టుకో దల్చుకోలేదు. ఎందుకంటే మా అమ్మాయిలు స్వతంత్ర భావాలు. కలవాళ్ళు. ఏమో! రెండు మూడేళ్ళ తరవాత వాళ్ళ ఊహలూ, ఉద్దేశాలూ ఎలా ఉంటాయో చెప్పలేం కదా? అందుకని ప్రస్తుతానికి ఈ విషయం మీరు మర్చిపోండి. మేమూ మర్చిపోతాం" అందావిడ.

ఓ నిమిషంసేపు ఎవరూ మాట్లాడలేదు. నిశ్శబ్దం రాక్షసిలా తాండవించింది. అంతకంటే నేను మాత్రం చెప్పేదేముంది.

నేను లేచాను.

"సరేనండీ! నేనేమన్నా తప్పుగా మాట్లాడివుంటే క్షమించండి. వస్తాను" అని ఓ నమస్కారం పెట్టి వచ్చేశాను ఇంటికి.

చికాకయింది మనసంతా. ఆందోళన.

ఆ అమ్మాయిని కదిలించి నాదాన్నిగా చేసుకోవటం తప్పించి వేరే దారి లేదని పించింది. ఎంత కష్టమైనా ఇక ఆమెతోనే తప్ప వాళ్ళ వాళ్ళతో మాట్లాడకూడదని నిశ్చయించుకున్నాను.

దేవుడి దయవల్ల నా ప్రయత్నం ఫలించి జ్యోతి పెళ్ళికి ఒప్పుకుంటే అప్పుడు ఏం చెయ్యాలి? ఆమెని తీసుకెళ్ళి పెళ్ళి చేసుకున్నా, ఇద్దరికీ గడిచేదెలా? మా ఇంటికి తీసుకెళ్ళటం నాకిష్టం లేదు.

పెళ్ళాం సరదాలు తీర్చటానికి మాటి మాటికి తండ్రి దగ్గర చెయ్యి చాపలేడు ఏ కొడుకైనా.

అందుకే వుద్యోగంలో చేరాలని నిశ్చయించుకున్నా.

ఆ రాత్రంతా ఎంతో ఆందోళనతో, ఒక్క నిమిషం కూడా కునుకు లేకుండా గడిపాను. ఎన్నో భయాలు మనసుని పీడించాయి.

* * *

పరిస్థితులు అలా తయారయ్యాయి కాబట్టి నా మీద తనకున్న ఇష్టాన్ని ఆ అమ్మాయి ఇన్నాళ్లూ బయటపెట్టలేదేమో అనిపించింది.

కానీ ఎంతయినా జ్యోతి కూడా మనిషే కదా?

ఏ మనిషిలో కాని క్రూరత్వం వున్నా దాని వెనకాతల రవ్వంత మమకారం దాగి వుంటుంది. అందులో ఆడపిల్ల. అటువంటప్పుడు నా స్థితికి జాలిపడదా? జ్యోతి అర్థం చేసుకుని ముందడుగు వేస్తుందనే ఆశ. ఆమె మనసులోనూ ఎన్నో భయాలుండొచ్చు. అందరినీ ఎదిరించి వాళ్ల అక్క పెళ్లి కాకుండా, నన్ను చేసుకోవాలంటే ఎంతో తెగింపు కావాలి.

నేను తనని ప్రేమించే మనిషినని నమ్మకం కుదిరినప్పుడు, తనకి కట్టుకునేందుకు బట్టా, ఉండేందుకు ఇల్లూ, తినేందుకు పట్టెడన్నం అమర్చగలనని నిస్సందేహంగా తెలిసినప్పుడు జ్యోతిలో ఆ తెగింపు రావచ్చు.

ఇవన్నీ ఆలోచించే ఎంతో ఆశతో ఉద్యోగంలో చేరాలనే నిర్ణయం తీసుకున్నాను.

ఉద్యోగంలో చేరే రోజున పొద్దునే గుడికెళ్లాను. జ్యోతి గుర్తుకొచ్చింది గుడి నుంచి వచ్చేస్తుంటే.

ఎందుకో నిబ్బరం వచ్చింది.

అహర్నిశలూ ఆమె కోసం, ఆమెతోడు కోసం నేనింతగా పడుతున్న తపనా, ఆమె

ఆలోచన రాగానే వశంతప్పే నా మనసూ వృథాగా ఖర్చైపోవనిపించేది.

కంపెనీకి వెళ్లిన మొదటి రోజున పరీక్షలూ, ఇంటార్వ్యూ జరిగాయి. ఒంటి గంటదాకా నన్ను శల్యపరీక్ష చేశారు. పర్సనల్ మెనేజరు తృప్తిపడ్డాడు రేక మండేషనుతో వచ్చినా నాలో వర్క్ ఉన్నందుకు.

గుమాస్తా ఉద్యోగం అంటే ఏవో ఫైళ్ళు ముందరేసుకుని, కూచుని సరదాగా కాలం గడిపేయొచ్చు, పెద్ద బరువులూ బాధ్యతలూ ఉండవని అనుకునేవాడిని.

కాని అదేమన్నా గవర్నమెంటు ఉద్యోగమా?

ప్రైవేటు కంపెనీ! ఇచ్చిన డబ్బుకి రెండింతలు పని చేయించుకుంటారు. చేరిన నాలుగు రోజులకి అర్థమయింది ఆ ఉద్యోగం చాలా కష్టమయిందని.

పొద్దునే ఆరుగంటలకి కంపెనీ బస్సు మా ఇంటిదగ్గర సెంటరుకి వస్తుంది. ఫ్యాక్టరీ ఊరవతల పన్నెండు మైళ్ళ దూరంలో ఉంది. అందరినీ దారిలో ఎక్కించుకుంటూ కంపెనీకి చేరుకునేటప్ప టికి ఏడయ్యేది. అప్పటినుంచీ సాయంత్రం అయిదు గంటల దాకా ఊపిరి సలపని పని.

మధ్యలో మూడుసార్లు ఖాళీ దొరుకు తుంది. పొద్దున టిఫినుకీ,మధ్యాహ్నం భోజ నానికీ, మూడున్నరకి కాఫీకీ.

మా సెక్షనుతో ఫ్యాక్టరీలో దాదాపు ప్రతి మనిషికీ పనుంటుంది. మొత్తంనాతో కలిపి ముగ్గురమైనా పని చాలా ఎక్కువ.

ఏకబిగిన తొమ్మిదిన్నర గంటలు కూచుని అలా పని చేయటం ఎంతో కష్ట మనిపించింది కొత్తలో.

జ్వరంలో ఉన్నప్పుడు చేదుమాత్ర లిచ్చి మింగమంటాడు డాక్టరు. ఇష్టం లేక పోయినా మింగాల్సిందే కదా?

అలాగే అలవాటు చేసుకున్నా ఆ జీవితాన్ని.

ఆ కష్టంలో ఏదో తృప్తి. అంతా జ్యోతి కోసం చేస్తున్నాననే వెర్రి ఆలో చన నాకెంతో శక్తినిచ్చేది. ఉత్సాహం వచ్చేది వెల్లువలా.

పొద్దునే అయిదుగంటలకి లేవటం, స్నానంచేసి సుప్రభాతం చదువుకుని ఆరు గంటల లోపల బస్టాండుకి చేరు కోవటం అలవాటైపోయింది.

రోజూ పొద్దునే ఏడుకొండలవాడికి దణ్ణం పెట్టుకునేటప్పుడు ఒకటే కోరుకునే వాడిని-

జ్యోతి నాదయేలా చేయమనీ, ఆ వరాన్ని నాకు ప్రసాదించమనీ.

ఆ నా కోరిక తీరిస్తే భవిష్యత్తులో ఇంకెప్పుడూ ఏం అడగనని ఆయనతో బేరం ఆడేవాడిని!!

రోజూ చూడాలనిపించేది జ్యోతిని. పగలు తీరిక దొరకదుగా ఆదివారాలు తప్ప? ఆదివారాలు యూనివర్సిటీకి రాదు. వాళ్ళింటికి నేను వెళ్ళలేను.

ఎలా చూడటం?

అప్పుడో ఉపాయం తట్టింది నాకు.

చిక్కడపల్లి లైబ్రరీకి రోజూ ఆరు గంటలకి రావటం అలవాటు జ్యోతికి. మా కంపెనీ బస్సు చిక్కడపల్లి మీదుగానే వస్తుంది.

రోజూ అక్కడ దిగేవాడిని. లైబ్రరీ ముందర పెద్ద ఆవరణ. సాయంత్రాలు అక్కడ లాన్స్‌లో కూర్చుంటే ఎంతో హాయిగా ఉంటుంది. అక్కడికి వెళ్ళేవాడిని రోజూ. ఓ మూలగా కూచోటం ఏదో చదువుకుంటూనో, రాసుకుంటూనో.



అప్పుడప్పుడు ఎవరో ఒకరు కలిసే వారు చిక్కడపల్లి సెంటరులో.

కలిసినవాడిది పాపం.

నాతో ఎనిమిదిగంటలదాకా తోడుంటం వాడికి తప్పదు. చాలా మందికి నా విషయం తెలుసుకనక వచ్చి నాతో కూచునేవారు. ఏవేవో కబుర్లు చెప్పుకునే వాళ్ళం ఎన్నో విషయాల గురించి. నేను మాత్రం ఏం మాట్లాడినా జ్యోతి దగ్గరికే వచ్చేది సంభాషణ – భూమి గుండ్రంగా ఉన్నట్టు.

జ్యోతికి తెలియకుండా ఆమెను చూడాలి నేను. అదే కావల్సింది.

రోజూ అలా సాయంత్రాలు గడపటం నా దినచర్యలో ఓ భాగం అయిపోయింది.

* * *

ఓ పదిరోజులు అలా గడిచిపోయాయి. రోజూ జ్యోతిని దూరం నించి చూసి వెళ్ళిపోయేవాడిని.

ఓరోజు ఎందుకో వెర్రి ఆవేశం

వచ్చింది. జ్యోతి తో మాట్లాడాలనే కోరిక అణచటం నాకు సాధ్యం కాలేదు. నాకు ఉద్యోగం వచ్చిన సంగతి ఆమెతో చెప్పాలి.

కంపెనీకి సెలవు పెట్టి యూనివర్సిటీకి వెళ్ళాను ఆవేళ. చాలా మంది కలిశారు. ముక్తసరిగా అందరినీ వంతు వంతునా పలకరిస్తూ ఆర్ట్స్ కాలేజీ హాల్ లోపలికి వెళ్ళాను.

మధ్యాహ్నం రెండున్నరయింది. జ్యోతి క్లాసు అప్పుడే అయిపోతుంది. పది నిమిషాలు పచార్లు చేశాను. జ్యోతీ, రాధా ఇద్దరూ కనబడ్డారు హాల్లో మెట్లుదిగుతూ. వాళ్ళ దగ్గరికి వెళ్ళాను.

"నమస్తే మేడమ్" అన్నా నవ్వుతూ కాస్త తలవంచి.

తనకీ నవ్వొచ్చినట్టుంది. పెదాలు బిగపట్టింది.

"నమస్తే" అనేసి ఆగకుండా వెళిపోతోంది.

"మాట్లాడరా నాతో?" అన్నా వెనక నించి.

"నాకవసరం లేదు" అంది వెళుతూనే.

నాకు పిచ్చి కోపం వచ్చేసింది. జబ్బ పుచ్చుకుని ఆపుదామనిపించింది. నిగ్రహించుకున్నాను.

వాళ్ళిద్దరూ బస్టాండులో కూచున్నారు. ఏమైనా సరే చెప్పదలుచుకుంది చెప్పాలనుకున్నాను. చుట్టూ చాలా మంది కూచున్నారా షెల్టరులో. వెళ్ళి వాళ్ళఎదురుగుండా నిలబడ్డాను.

ఏం మాట్లాడలేదు జ్యోతి. రాధ ఏదో చెప్పబోయింది. ఆమెని వారించి నేనన్నాను.

"నా కుద్యోగం వచ్చింది"

"మంచిది" అంది జ్యోతి. అలా అంటున్నప్పుడు ఆమె మొహం చిలిపిగా ఉంది. అంత కోపంలోనూ నాకామె ముద్దొచ్చింది.

"చెప్పిపోదామనొచ్చాను. అంతే. బంకలా అతుక్కుపోదామని మాత్రం కాదు. ఆలోచించుకోండి ఇంకో ఆరునెల్లపాటు" అంటూ వెనక్కి తిరిగాను.

సరిగ్గా అదే సమయానికి అక్కడికి వేణు వచ్చాడు స్కూటరు మీద. స్కూటరెక్కి కూచుని పోనీమన్నా వాడిని.

ఇద్దరం రవీంద్రభారతికెళ్ళి కూర్చున్నాం లాన్స్‌లో.

"పిచ్చెక్కిపోతోందిరా" అన్నా నేను.

"అంత అవసరం లేదు. జ్యోతితో నీకేమాత్రం పరిచయం ఉందని అంత బాధపడిపోతున్నావు?"

"అదే నాకూ అర్థం కావటం లేదు. ఎన్నో ఏళ్ళనుంచీ పరిచయమున్న మనిషిలా, నా జీవితంలో ఓ భాగంలా అనిపిస్తోంది నా కళ్ళకి. ఏమవుతుందో అని భయం వేస్తోంది"

"నీ మొహం! మరీ సెంటిమెంటల్ కాబోకు. నీకోటి చెప్పనా?"

"ఏమిటి?"

"ఆ అమ్మాయితో నీ పెళ్ళి జరిగినా మంచిదే. జరక్కపోయినా మంచిదే"

"నాకర్థం కావటంలేదు నువు చెప్పేది"

"అర్థం చేసుకో"

"డొంక తిరుగుడొద్దు. సూటిగా చెప్పు"

"ఎంతో పదునుగా ఉండేవి నీమాటలూ చేష్టలూ. ఇప్పుడో మొద్దులా తయారయ్యావు"

"నిజమేనేమో నాకు తెలియదు. అసలు

విషయం చెప్పు"

"ఆ అమ్మాయికి సుధాకర్ అనే కుర్రాడితో స్నేహం. ఎప్పుడూ ఇద్దరూ కలిసి తిరుగుతూ వుంటారు"

"తిరిగితే"

"దీని గురించి పుకార్లు కూడా వున్నాయి"

"అయితే ఏం చెయ్యమంటావు ?"

"అది నీ ఇష్టం. నువ్వు మత్తులో పడ్డావు. నేను చెప్పేది మంచిగానూ అనిపించొచ్చు, చెడుగానూ అనిపించొచ్చు నీకు. నలుగురూ అనుకునే మాట నీ చెవిన వేయటం వరకే నా వంతు. ముందు వెనుకలు ఆలోచించి నడుస్తావని చెప్పాను"

"జ్యోతి ఎంతో మందితో మాట్లాడుతూ వుంటుంది. అంతమాత్రాన ?"

"'సుధా' అంటూ ముద్దుగా పిలుస్తుంది అతన్ని జ్యోతి. ఏ కల్మషం లేని సన్నిహితమైన స్నేహమైనా కావచ్చు. ఇద్దరికీ ఒకళ్ళమీద ఒకళ్ళకి ప్రేమైనా ఉండొచ్చు. ఏదైనా కావచ్చు. కాకపోతే సుధాకర్ ఆమెకున్న అందరు స్నేహితుల లాంటివాడు కాదని నా నమ్మకం"

"అంటే ?"

"చెప్పానుగా ! ఇద్దర్లూ ప్రేమించుకునైనా ఉండాలి. లేకపోతే సినిమాల్లోనూ, కథల్లోనూ చూపించినట్టు ఇద్దరి మధ్యా ఓ పవిత్రమైన అవగాహన అన్నా ఉండాలి"

ఏం మాట్లాడలేకపోయా చాలా సేపు. ఏం చెప్పను వాడికి, ఎలా చెప్పను ? జ్యోతి నాది కాదు, కాబోదు అనే ఊహే నేను భరించలేక నా గుండె నీరయిపోతుంటే ఆమె లేని నా జీవితాన్ని ఎలా ఊహించుకోను.

"మరిచిపోరాదురా ఇదంతా ?" అనునయంగా అడిగాడు వేణు.

"తన నోటమ్మట, తనంతట తాను ఇటువంటి విషయం చెప్పేదాకా నేను నమ్మదల్చుకోలేదు. నమ్మలేను. నమ్మను"

"నువు చంటి పిల్లాడివి కాదు మూర్తీ, నయానో భయానో దారికి తీసుకురావటానికి. కళ్ళముందు నిజాలను చూడు. నీ మనసు చెప్పిన మాట విను. నీకే తెలుస్తుంది నిజం. కానీ తొందరపడి నిర్ణయాలు తీసుకోకు"

"నిర్ణయం ఏం లేదురా తీసుకోవటానికి. జ్యోతి కావాలి నాకు. మొదటిసారి తనని చూసినప్పుడే నిశ్చయించుకున్నాను. ఇప్పుడిక ఆ గమ్యం చేరుకోవటానికి ఏ దారి తొక్కాలీ అన్నదే సమస్య"

"సినిమా కెళ్దామా ?" ఉన్నట్టుండి అడిగాడు వేణు.

"లేదురా నాకు ఓపిక లేదు" అన్నా.

ఇంటి దగ్గర దింపేసి వెళిపోయాడు వేణు.

* * *

ఆ రోజు ఒక విభ్రాంతి పుట్టించే వార్త తెలిసింది నాకు.

మా నాన్నగారికి ఢిల్లీ ట్రాన్స్ఫర యింది. పది పదిహేను రోజుల్లో ఆయన వెళ్ళిపోవాలి!

అమ్మ ఈ విషయం చెప్పగానే ఆయన గదిలోకి వెళ్ళాను. పడుకుని ఆలోచిస్తున్నారు నాన్నగారు—నా గురించే కాబోలు.

"ఎలాగైనా ఆపలేరా నాన్నగారూ ?"

గోడవేపు తిరిగి పడుకున్నాయన నా గొంతు వినపడటంతో ఒక్కసారిగా నా వేపు తిరిగారు.

ఆయన కళ్ళమ్మట నీళ్ళు కారు

తున్నాయి.

"ఎందుకు ఏడుస్తున్నారు?" అన్నాను.

"నువ్వూ నాతో వచ్చేయి ఢిల్లీకి"

"నేను రాగలనా ? మీకు తెలియదా"

"మూర్తీ! నీలో చోటు చేసుకున్న భావం పవిత్రమైంది. ఒప్పుకుంటాను. నువు ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకున్నావు. నీ రక్తం ఆమె రక్తం కలుపుకోవాలనుకున్నావు. నాకు తెలుసది. అందుకే నీ భావం పవిత్రమైంది అంటున్నాను. కానీ నువ్వో తెల్ల కాగితాన్ని చదవాలనుకుంటున్నావు"

"నాన్నా!"

"గుర్రాన్ని చెరువు దగ్గరకి తీసుకెళ్ళగలవేమో కాని దానిచేత బలవంతాన నీళ్ళు తాగించగలవా?"

"ప్రయత్నంలో నష్టం లేదుగా?"

"నీలో పుట్టిన స్పందనే ఆమెలోనూ పుడితే అది పరస్పరం ఇష్ట పడ్డట్టు అవుతుంది. నీ వేపునుంచే తప్ప ఆ పిల్ల అణుమాత్రం బదులు ఇవ్వటం లేదుకదా నీకు?

"ఎన్ని రోజులిలా ఉంటుందంటారు?"

"ఒక్కసారిగా వెల్లువలా నీలో ఆ భావం పుట్టింది. మరి ఆమె సంగతేమిటి?"

"నాలో కల్మషం లేదు. ఆమెలో నిద్రాణమై ఉన్న ప్రేమని నా ఆరాధనతో నిద్ర లేపుతాను."

నీ జీవితం దెబ్బ తింటుందేమో ఆ ప్రయత్నంలో."

"ఆమె నాకు దక్కుతుందనే నా ఆశ. నా నమ్మకం."

"నీ ఇష్టం మూర్తీ! నా అండ నీకెప్పుడూ ఉంటుంది. అది నేను చెప్పక్కర్లేదనుకుంటాను. కాకపోతే దీంట్లో ఓడిపోయి నంత మాత్రాన నువు పనికిరాని వాడివనుకోబోకు. రైలు తప్పిపోయేది ఆ అమ్మాయికి. నీకు కాదు"

"అలాగే."

"నేనిక్కడ ఉండను. బలహీనులు చేసే పనులు చేయబోకు. ఇంకో రెండు మూడు నెలల్లో నీకు చాలామంచి ఉద్యోగం వస్తుంది. ఎంతో ఎత్తుకి ఎదగాలి నువ్వు. గొప్పవాడి వవుతావురా నువ్వు."

"నాన్నగారూ." అంటూ కావలించుకున్నానాయన్ని. రెండు చేతులతో నాకు ఆసరా ఇచ్చారాయన.



అనుకున్న వ్యవధికంటే ముందరే వెళ్ళిపోవాల్సి వచ్చింది నాన్నగారు.

అమ్మా వాళ్ళని ఆయన వెళ్ళిన నాలుగు రోజులకే రైలెక్కించాను.

నేను వేణు ఇంట్లోకి మారాను నాలుగు రోజుల కోసమని.

గది కోసం ఓ రోజంతా తిరిగాను సెలవు పెట్టి. దొరకలా. మర్నాడు కూడా బయలుదేరాను పొద్దున్నే జ్యోతి వాళ్ళింటి దగ్గర్లో తీసుకోవాలని ఆలోచన. కుదర్లేదు.

మధ్యాహ్ననికి, చివరికి నారాయణగూడాలో దొరికింది ఓ గది. గది బాగానే వున్నా అద్దె మాత్రం నూటపాతిక. కాని, నేనెలా ఊహించుకున్నానో అలాగే వుందది.

వెంటనే చేరిపోయాను. నాన్నగారు

వెళ్తూ వెళ్తూ కొంత డబ్బిచ్చి వెళ్ళారు. మా సామానులో రెండు కుర్చీలూ, మంచం ఉంచేసుకున్నా అవసరం ఉంటుందని. బ్రహ్మచారి జీవితానికి కావాల్సిన మిగతావి అమర్చుకున్నాను.

ఓ రోజు మొత్తం గది సర్దటం సరి పోయింది.

ఎంత పని చేస్తున్నా జ్యోతిని మాత్రం మర్చిపోలేదు నేను.

గదంతా ఎంతో శుభ్రంగా సర్దు కున్నా. సామానంతా ఎన్నో రకాలుగా పెట్టి చూశాను. చివరికి నాకు నచ్చిన విధంగా అందంగా, పొందికగా అమ ర్చాను.

అంత శ్రద్ధకి కారణం జ్యోతి.

జ్యోతి నాకు తన చేతిని అందించిన రోజున, నా జీవితంలోకి ప్రవేశించిన రోజున ఆమెకి నేనర్పించే నీడ అదే !

ఆమె ఒళ్ళో నన్ను దాచుకుని, ఆ కళ్ళల్లోకి చూస్తూ గడపాలనుకున్నా బతికినంత కాలం.

ఆ లేత గుండెల్లో నా మొహాన్ని దాచు కుని మరోసారి చంటిపాపనవుదామను కున్నాను.

అంతకంటే స్వర్గం, స్వర్గసుఖం వేరే లేవనుకున్నాను.

ఎన్ని కలలు కన్నానో !

'ఆకాశానికి నిచ్చెన వేస్తున్నానా' అని మనసు కంపించేది అప్పుడప్పుడు.

మర్నాడు లైబ్రరీకి వెళ్ళాను జ్యోతిని చూద్దామని. రాత్రి ఎనిమిదయినా ఆమె రాలేదు. మనసంతా పాడయింది ఆమెను రెండు రోజులనించీ చూడకపోయేసరికి.

ఎనిమిది గంటలకి లేచాను. వెళ్తూ వాచ్ మెన్‌ని అడిగితే చెప్పాడు- జ్యోతి అయిదు గంటలకే ఎవరో కుర్రాడితో వచ్చి వెంటనే వెళ్ళిపోయిందని.

పిచ్చెక్కినట్టయింది ఆ రోజు ఆమెని చూడకపోయే సరికి. తాగుదామనిపించింది మొదటి సారిగా.

బార్‌కి వెళ్ళాను మొదటిసారి!

గ్లాసు నోటి దగ్గర పెట్టుకుంటుంటే నాన్నగారు గుర్తొచ్చారు. బలహీనుడిని అవ్వొద్దన్నారు. ఆయన నా దగ్గర లేక పోవటంతో, ఒంటరి తనం కమ్ముకుంది నన్ను ఆ క్షణంలో.

మనసులోనే ఆయన్ని క్షమించమని వేడుకుని, కళ్ళు మూసుకుని గడగడా తాగేశాను ఆ విషాన్ని.

ఆ రోజు నేను తాగినంత జీవితంలో ఎప్పుడూ తాగలేదు. ఎలాగో అవస పడి బేరర్ రిక్షా ఎక్కించాడు. అప్ప టికే నా ఇంద్రియాలు పూర్తిగా చచ్చు పడిపోయాయి. రిక్షావాడు ఏవో కేక లేస్తున్నాడు. అంతే గుర్తుంది.

అప్పుడే నన్ను దేవతలా ఆదుకుంది ఎలిజబెత్. నా కంటే రెండేళ్ళు పెద్దది ఆమె. మా కంపెనీలోనే పనిచేస్తోంది. కంపెనీలో దాదాపు ఓ రెండొందల మంది అమ్మాయిలున్నా ఎవరి వేపూ కన్నెత్తి చూడబుద్దయ్యేది కాదు. తలొంచుకుని నా పని చేసుకుపోయేవాడిని.

కానీ ఎలిజబెత్ మాత్రం నాకు కాస్త తెలుసు.

ఎలిజబెత్ గురించి కంపెనీలో కాస్త చెడ్డగా మాట్లాడుకునేవారు. ఆ పుకార్లు నాలో ఆసక్తిని రేకెత్తించాయి.

కారణం ఆమె పతితయితే ఆమెతో పడుకుందామని కాదు.

నాలో ఆసక్తి పుట్టటానికి కారణం ఎలిజబెత్‌ని చూస్తే ఎవరికీ అలా అని

పించదు. చాలా మంచి పిల్లలా కనబడు తుంది. కళ్ళు చెదిరే అందం ఆమెది.

అయినా ఎందుకిలా అందరూ ఆమె గురించి చెడ్డగా చెప్పుకుంటారు?

తెలుసుకోవాలనిపించింది.

నేను కంపెనీలో చేరిన కొత్తల్లో ఒక రోజు లంచ్‌కి లేటుగా వెళ్ళాను. భోజనం అయిపోయింది అప్పటికే.

రోజూ ఆ వేళ్టికి తినేసే ఎలిజబెత్ ఎందుకో ఆవాళ అప్పుడే క్యారేజీ తెరుస్తోంది.

నేను వెనక్కి తిరిగి వచ్చేస్తుంటే పిలిచింది నన్ను.

"భోజనం చేసావా ?"

ఆ ఏక వచనం కాస్త ఎబ్బెట్టని పించింది నాకు.

"అయిపోయిందిట."

"అందుకే అడుగుతున్నాను."

"మరి నీకో ?"

"మొత్తం నీకిచ్చేస్తాననుకున్నావా ? ఇద్దరం పంచుకుందాం"

కూచున్నాను ఆమెతో.

ఆ తరవాత కనబడినప్పుడల్లా పలకరించేది నన్ను.

ఆమె నేవుంటున్న సందులోనే ఉంటోందన్న సంగతి నాకు తెలియదు.

ఆ రాత్రి చుట్టుపక్కలవాళ్ళు అందరూ చూస్తున్నా, నన్ను రిక్షావాడి సాయంతో లోపలికి మోసుకెళ్ళి ఆదుకొంది ఎలిజబెత్.

ఆమెకి ఒక్క తమ్ముడు తప్ప ఎవరూ లేరీ ప్రపంచంలో. ఎనిమిదేళ్ళ కుర్రాడు వాడు.

ఆ రాత్రి అక్కడే పడుకున్నాను.

మర్నాడు లేచేటప్పటికి ఒంటిగంటయింది. తలమీద సుత్తులు పెట్టి కొడుతున్నంత పోటు.

ఎలిజబెత్ కుర్చీలో కూచుని ఏదో పుస్తకం చదువుకుంటోంది. ఆమె తమ్ముడు జాన్ స్కూలుకెళ్ళిపోయి నట్టున్నాడు.

"కంపెనీకి వెళ్ళలేదా ఎలిజబెత్?" అన్నా.

"నువ్విలా తప్పతాగి చూసే దిక్కులేక పడుంటే ఎలా వెళ్ళమంటావు?"

"నిన్న రాత్రి మొదటిసారి తాగాను."

"ప్రతీ తాగుబోతూ ఎప్పుడూ చెప్పే మాటది."

"నేను తాగుబోతుని కాదు. రాత్రి సహాయానికి చాలా కృతజ్ఞుడిని."

సన్నగా నవ్వింది ఎలిజబెత్.

"నన్ను నీ గదిలోకి తీసుకురావటం సరైన పని కాదు."

"దేనికి"

"నువ్వు పెళ్ళికాని ఆడ పిల్లవు"

"నటించబోకు. నీకు తెలుసు అందరూ నా గురించి ఏమనుకుంటున్నారో."

"ఎలిజబెత్!"

"నా తమ్ముడి కోసం ఆడపిల్లనన్న విషయం మరిచిపోయి చాలా రోజులయింది."

"సారీ" అంటూ లేచాను మంచి నీళ్ళ కోసం

"రోజూ తాగుతావా?"

"లేదు. నాకసలు అలవాటు లేదు."

"తాగేవాళ్ళంతా ఇదే మాటంటారు."

"నా మీద నమ్మకం లేని వాళ్ళంటే నా కసహ్యం."

"నవ్వింది ఎలిజబెత్ బిగ్గరగా జ్యోతి గుర్తుకొచ్చింది.

ఎంత తేడా ఇద్దరికీ?

ఎలిజబెత్ నవ్వులో సొగసు లేక పోయినా ఏ మగాడికైనా చూడాలని పిస్తుంది ఆమెను నవ్వుతున్నప్పుడు.

అన్నం పెట్టింది వండి.

ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ తిన్నాం.

ఆ రోజునుంచీ ఎలిజబెత్ నాకెంతో అపురాలైంది. ఓదార్చేది నన్ను. ధైర్యం చెప్పేది నాకు.

ఆమెతో నా బాధ చెప్పుకోవటం నాకెంతో ఓదార్పునిచ్చేది.

నాలో తాత్కాలికంగా రవ్వంత చైతన్యం తెచ్చింది ఎలిజబెత్ – తన పదునైన మాటలతో, చేష్టలతో.

ఓ రోజు లంచ్ టైములో ఆమెతో చెప్పాను సాయంత్రం చిక్కడపల్లి లైబ్రరీకి రమ్మని. బజారుకెళ్ళాలనీ పని చూసుకున్న తరవాత వస్తాననీ చెప్పింది.

ఆలస్యమయింది తనొచ్చేసరికి.

"ఇంత ఆలస్యమయిందేమిటి?"

"కట్టుకున్న మొగుడిలా అడుగుతున్నావు"

"నాకంటే పెద్దదానివి. లేకపోతే ఎప్పుడో కట్టుకునేవాడిని"

"నీకూ పిచ్చెక్కుతున్నట్టుందే! అవునూ ఎందుకు రమ్మన్నావు?"

"నీకు జ్యోతిని చూపిద్దామని"

"ఎందుకు ?"

"ఏమో ఎందుకో చూపించాలనుంది"

జాలిగా చూసింది నన్ను ఎలిజబెత్.

భరించలేకపోయానా జాలిని. నా కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. ఏడుపొచ్చింది నాకు. ఏడ్చాను కూడా.

"పిచ్చివాడివి నువు. చంటిపిల్లాడి ప్రేమ నీది"

ఆమెవేపు చూశాను.

"నిజం మూర్తీ! నీలాంటి మనిషిని చేసుకుంటే జ్యోతి సుఖపడుతుంది."

బాధ ఎక్కువయింది నాలో. ఎందుకు నన్ను జ్యోతి అర్థం చేసుకోలేకపోయింది. ఎలిజబెత్‌లా నాకు ఓదార్పు ఇవ్వలేదా?

ఎదుటివాళ్ళు చూపించే జాలిని భరించటం కూడా కష్టమని తెలిసింది ఆరోజు.

ఆవేళ లైబ్రరీ మూసేదాకా లాన్స్‌లో కూచున్నాం. జ్యోతి మాత్రం రాలేదవాళ.

సినిమా కెళ్దామంది ఎలిజబెత్.

హాల్లో కంపెనీవాళ్ళు కలిశారు. మా ఇద్దరినీ చూసి ఏమనుకున్నారో పలకరించి వెంటనే వెళ్ళిపోయారు. సినిమా అయిపోయిన తరవాత ఎలిజబెత్ గదికెళ్ళి భోజనం చేసి పడుకున్నాం ఇద్దరం.

నిద్రపట్టలేదు ఇద్దరికీ చాలాసేపు. ఎన్నో కబుర్లు చెప్పింది ఎలిజబెత్ ఆ రాత్రి.

* * *

మా ఇద్దరి మధ్య ఆత్మీయత చూసి కంపెనీలో ఎన్నో పుకార్లు లేచాయి. మేం ఉంటున్న సందులో కూడా అందరూ వింతగా చూసేవారు నన్నూ, ఎలిజబెత్‌నీ. లెక్కచెయ్యలేదు మేం ఇద్దరం.

అసలు ఎవరితో మాట్లాడదు ఎలిజబెత్. ఎవరినీ దగ్గరకు రానిచ్చేది కాదు. అందగత్తె కాబట్టి అందరూ అది గర్వమనుకునేవారు. ఆమెమీద మోజు పడ్డవాళ్ళు దెబ్బతినేసరికి, ఎలాగైనా ఎలిజబెత్‌ని యాతన పెట్టాలని ఏవేవో పుకార్లు పుట్టించారు.

నామీద ఎందుకు ఆమెకి ఆసక్తి పుట్టిందో నా కర్థం కాలేదు. కారణం ఏమిటో!

ఓసారి అదే అడిగాను.

"ఎలిజబెత్! నేన్నీకు ఏమవుతాను?"



"ఏం కావు"

"మరి ఎందుకు నా మీద ఈ ఆపేక్ష"

"నువ్వంటే నాకు జాలి"

"నాలాంటి దౌర్భాగ్యులూ, నీ తోడు కోసం తపించే వాళ్ళూ లేరా?"

"లేరు. ఉన్నా నాకు అవసరం లేదు"

"అర్థం కావు నువు నాకు."

నవ్వేసింది ఎలిజబెత్.

రోజూ సాయంత్రం లైబ్రరీకి వెళ్ళి జ్యోతిని చూడటం, ఎనిమిది గంటలకల్లా ఇంటికొచ్చేయటం, ఎలిజబెత్ కి నా ఆరాటం

ఆవేదనా అన్నీ చెప్పుకోవటం అలవాటై పోయింది.

ఎంతో ఓపికగా వినేది ఎలిజబెత్. ఎన్నోసార్లు ఆమె కళ్లు చెమ్మగిల్లేవి నా బాధ చూసి.

అర్థం చేసుకునే ఏ ఆడదైనా మగాడికి ఓదార్పులాంటిది.

ఎంతో గొప్ప మనసున్న మనిషి ఎలిజబెత్ !

దేవతలాంటిది ఎలిజబెత్ !

ఓ రోజు సాయంత్రం బస్సుదిగి లైబ్రరీకి వెళుతున్నాను. అప్పుడే సినిమా వదిలారు.

జ్యోతి కనిపించింది! ఒక్కతీ కాదు వెంట సుధాకర్ కూడా ఉన్నాడు. వేణు చెప్పిన తర్వాత అతన్ని చాలాసార్లు చూశాను. జ్యోతితో కూడా లైబ్రరీకి నాలుగైదు సార్లొచ్చాడు.

ఇద్దర్నూ సినిమా నుంచి వస్తున్నట్టున్నారు. నవ్వుకుంటూ ఎంతో సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.

నాకు బాధనిపించింది.

సుధాకర్‌ని చూసి అసూయపడి మాత్రంకాదు.

నేను ఆ స్థానంలో ఉండలేకపోయానే అని.

ఎక్కడో చదివాను. 'ఓడిపోతున్నానని తెలిసీ పరిగెడుతున్నానూ' అని.

నాకు మటుకు నేను జ్యోతి నాకెంతో దగ్గరగా ఉందనుకుంటున్నాను.

నిజానికి—

ఎంతో దూరంలో ఉంది.

అటువంటి మనిషి ఎవరికి తోడైనా ఆనందపు అంచులకి చేరుకోవచ్చు. గువ్వలా ఉంటుంది మనిషి. కాని...కానీ నన్నో పిచ్చివాడి కింద తయారుచేసింది ఆ మనిషి.

ఇద్దరిలో ఎవరూ నన్ను చూడలేదు. అలాగే రోడ్డు అవేపు నుంచి వెళ్ళిపోయారు.

వాళ్ళిద్దరి పరిచయం నాకంటే, నా ఆరాధన కంటే ఎంతో పాతది. ఒకవేళ వాళ్ళిద్దరూ ఒకళ్ళనొకళ్ళు ముందరే ప్రేమించుకునుంటే మధ్యలో వచ్చిన నేను వెనక్కి తిరగటం తప్ప వేరే దారి లేదు.

బతకగలనా అదే జరిగితే?

హోటల్లోంచి పాట వినబడుతోంది.

'ఆయన హృదయంలో ప్రాణం కంటే మిన్నగా ఉండే మనిషిని—ఈనాడు ఆయన ముందే ఒక దోషిలా నిలబడ్డాను.' అదీ ఆ పాట అర్థం.

జ్యోతి మనసులో నాకంతగా చెప్పుకో దగ్గ స్థానం ఉందని నేనెప్పుడూ అనుకోలేదు.

ఏమో! నేనంటే ఒక మంచి అభిప్రాయం, రవ్వంత ఆకర్షణా ఆమెలో ఉన్నాయేమో.

ఇప్పుడు అవేం ఉన్నాయని నేను భ్రమపడటం లేదు. ఇప్పుడు ఆమె కళ్ళకి ఒక తప్పుచేసినవాడిలా కనబడుతున్నాను. లోకులు నాకు చేసిన ఉపకారం!

యూనివర్సిటీలో ఆమె నాతో దురుసుగా మాట్లాడిన రోజు నుంచీ మరింత దీనంగా వేడుకుంటూ రాసేవాడిని ఆమెకి ఉత్తరాలు. ఆమె జవాబిస్తుందని కాదు. నా బాధ ఆమెకి తెలియాలి. నా ఆవేదన ఆమెకి అర్థం కావాలి.

అర్థం అయివుంటుందనే ఆశతో ఊపిరి పోసుకుంటున్నాను ఎప్పటికప్పుడు.

జ్యోతినీ, సుధాకర్‌నీ చూసినప్పుడు ఒక్క క్షణం నేను 'జరగకూడదు' అని

అనుకునే దృశ్యం ఒకటి నా కళ్ళముందు మెదిలింది. గుండె జలదరించింది. ఒళ్ళు వణికి తూలాను.

ఆరోజు మళ్ళీ బార్‌లో అడుగుపెట్టాను.

తెగ తాగాను. విచక్షణ నశించిపోయే దాకా తాగాను.

రాత్రి పన్నెండయింది. ఎలిజబెత్ గదికి వెళ్ళాను. మామూలుగా ఆ సమయంలో ఆమె గదికి ఎప్పుడూ వెళ్ళను. సాయంత్రం లైబ్రరీనుంచిరావటం భోంచేయటం, ఓ గంటసేపు కబుర్లు చెప్పటం,పడుకుంటే అక్కడే పడుకోవటం లేకపోతే నా గదికి వెళిపోవటం – ఇలా చేసేవాడిని.

ఆ రోజు చాలా ఆలస్యం అయింది.

తలుపు తట్టాను.

అప్పటికే నిద్రపోయినట్టుంది,ఎలిజబెత్. ఆవలిస్తూ తలుపు తీసింది. నన్నూ, నా పరిస్థితినీ చూడగానే నేను తాగొచ్చానని అర్థమయింది తనకి. తలుపు మూసేయ బోయింది.

"లోపలికి రానివ్వవా"

"వెళ్ళిపో ఇక్కడినుంచి. మళ్ళీ ఎందుకు తాగావు?"

కాసేపు ఆమెని అలాగే పరీక్షగా చూసి వెనక్కి తిరిగాను.

"ఏయ్ మూర్తీ!"

ఆగాను నేను.

"వెళిపోతావేం?"

"పొమ్మన్నావుగా నువ్వే."

"అన్నం తిన్నావా?"

"లేదు. ఆకలేస్తోంది."

"లోపలికిరా"

లోపలికెళ్ళి మంచం మీద కూలబడ్డాను. స్టూల్ దగ్గరికి లాగి అన్నం పెట్టింది.

"ఎక్కువలేదు. ఇంతే మిగిలింది నేను తినగా. తొందరగా తిను"

"జాన్ లేడా?"

"వాళ్ళ స్కూలు నుంచి అందరూ నిన్న రాత్రి నాగార్జునసాగర్ వెళ్ళారు. రేపు పొద్దునే వచ్చేస్తారు. తొందరగా తిను నాకు నిద్రొస్తోంది."

"ఆవలిస్తూ ఒళ్ళు విరుచుకుంది ఎలిజబెత్. కాసేపు అలాగే ఆమె అందాలని చూస్తూ కూచుండిపోయాను. నా పక్కనే మంచం మీద కూర్చొనుంది తను. నా బుర్రలో పురుగు తొలిచింది.

"ఏమిటి,అలా చూస్తున్నావు. తినవా?"

"ఎలిజబెత్ ! నాకు...నువ్వు కావాలి"

నివ్వెరపోయింది ఎలిజబెత్ !

ఆమె కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి గిర్రున. ఏదో మాట్లాడబోయింది. పెదాలు వణికాయి. తమాయించుకుని అంది–

"నీతో పడుకుందామని స్నేహం చేసి చేరదీశాననుకున్నావా ?"

నా మత్తు దిగిపోయింది. ఉండబట్ట లేక పోయాను అప్పుడు. ఆమె ఒళ్ళో తలపెట్టి వెక్కివెక్కి ఏడ్చాను. తల తిప్పి ఆమె కళ్ళలోకి చూడాలంటే భయమేసింది. చంటిపిల్లాడిని బుజ్జగించినట్టు బుజ్జగించింది నన్ను ఎంతో సేపు.

"ఊరుకో ! ఇలా ప్రవర్తించకూడదు నువ్వు. నీ నిజాయితీ చచ్చిపోతుంది. మంచివాడివి నువ్వు, మంచి వాడిలాగే వుండు. నలుగురిలా కాబోకు"

సర్దుకుని కూచున్నాను.

"నాతో పడుకుంటే నీ ఆవేశం చల్లారు తుందేమో కానీ ఆవేదన మాసిపోతుందా?" నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగింది ఎలిజబెత్.

ఏం మాట్లాడలేకపోయాను. తల వాలిపోయింది.

"నువు పెడదారి తొక్కుతున్నావు. నీ ఆశ మెల్లమెల్లగా ఆవిరైపోతోంది. అందుకే ఇలా మారుతున్నావు. గుండె చిక్కబట్టుకోవాల్సింది ఇటువంటి పరిస్థితు ల్లోనే! ఇప్పుడు బేలవైపోతే ఎన్నో బల హీనతలు నీలో చోటు చేసుకుంటాయి"

వింతగా చూశానామెను.

చిన్నపిల్లాడు అల్లరి చేసే పెద్దవాళ్ళు మందలించినట్లు వుంది ఆమె ధోరణి. నేనూ, నా ప్రవర్తనా క్షమించరానివి. నన్ను అసహ్యించుకోవటానికి బదులు, నా మీద అభిమానంతో నా మేలు కోసం బాధపడుతోంది.

ఎంత గొప్ప మనసో ఎలిజబెత్‌ది చూశావా ?

అందుకే అన్నాను ఆమె దేవతలాంటి దని. ఈ సంఘటనే నా బలహీనతని నాకు ఎత్తి చూపింది.

ఆ రోజు నాకు ఎంతో చెప్పింది ఎలిజ బెత్.

"ఏమనుకుంటున్నావు నువ్వు? జ్యోతి నిన్నసహ్యించుకుంటోందనా ? ఎన్నటికీ అలా జరగదు. నువ్వింత ఆమె కోసం పిచ్చివాడివైనప్పుడు, ఆమె మనసులో కూడా నీ మీద తప్పకుండా రవ్వంత ప్రేమ ఉంటుంది"

"నాకు నమ్మకం లేదు ఎలిజబెత్"

"పిచ్చి మూర్తీ! ఆడపిల్ల కాబట్టి చెప్పుకోలేదు తన ప్రేమని. ఏ ఆడ పిల్లైనా, ఇంకో మనిషి తనని పిచ్చిగా ఆరాధిస్తున్నాడని తెలిసినప్పుడు, ఇష్టం లేకపోయినా జాలి పడుతుంది. అంతే కాని కోపం, అసహ్యం ఎన్నటికీ ఆమె గుండెలో చోటు చేసుకోవు"

"నువు నాకు ఊపిరి పోస్తున్నావు ఎలిజబెత్"

"అందరూ నువు చాలా తెలివైన వాడి వంటారు. కావచ్చు. అన్నిటిలో నువు తెలివైన వాడివి. కాని నా ఉద్దేశం నిజా నికి నువ్వో వెర్రివాడివి. బతకటం చేత కాదు నీకు. ఎవరితో ఎలా మాట్లాడాలో అంతకంటే తెలియదు నీకు"

"అవునేమో"

"అసలు ఆ అమ్మాయితో ముందరే పెళ్ళి విషయం ఎందుకు చెప్పావు నువు ? కొన్ని రోజులు స్నేహంగా ఉండాల్సింది ఆమెతో"

నేనామెను కలవకుండా ఉండి, పెద్ద పొరపాటు చేశాననిపిస్తోంది ఇప్పుడు"

"అదేం కాదు. నిన్ను నువ్వు చాలా తక్కువగా అంచనా వేసుకున్నావు. ఆమె ముందు సాష్టాంగం చేశావు. ఏం? నువ్వెం దుకూ పనికిరాని వాడిననుకున్నావా ?"

"ఏమో !"

"నువు అందగాడివని నేననను. కానీ అనాకారివి కూడా కావు. సుబ్బరంగా ఉద్యోగం చేసుకుంటున్నావు. ఇంకా ఎంతో పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తావనీ, చెయ్య గలవనీ నా నమ్మకం. అటువంటప్పుడు సాధారణంగా ఏ ఆడపిల్లా నిన్ను కాదనదు పెళ్ళి చేసుకుంటానంటే"

"మరెందుకిలా జరుగుతోంది ?"

"ఈ విషయంలో అలా జరగటానికి కారణం నీ తొందరపాటు, చంటిపిల్లాడిలా నీ ప్రవర్తనా"

"ఆమె ఉద్దేశం ఏమిటో నాకర్థం కావటం లేదు ఎలిజబెత్"

"ఏ ఆడపిల్ల చెప్పగలదు మూర్తీ తనంతట తాను- ప్రేముందని? పైగా నువ్వు అతి మంచితనానికి పోయి ఆమె

నీతో మాట్లాడేందుకూ, నిన్ను కలిసేందుకూ వీల్లేకుండా చేసుకున్నావు. మొత్తం తప్పు నీదని నే అనను. కానీ నువు తప్పటడుగు వేశావన్నది నిజం"

"జ్యోతి నేనంటే రవ్వంతయినా ఇష్టపడుతోందో లేదో నాకు తెలియటం లేదు"

"నీకో విషయం చెప్తాను మూర్తీ! నువ్వు ఆమెనిలా ఓ పిచ్చివాడిలా ఆరాధిస్తున్నప్పుడు, ఆమెకి తెలియకుండానే నీ మీద ఆమె మనసులో ఓ విధమైన అనురాగం ఏర్పడుతుంది. అది ఆడవాళ్ళ విషయంలోనే కాదు. మీ మగవాళ్ళలోనూ అంతే. నాకున్న అనుభవంతోనూ, నేను చూసిన ప్రపంచాన్ని బట్టి చెబుతున్నాను"

"నువ్వు అర్థం చేసుకున్న దాంట్లో వందో వంతైనా జ్యోతి నన్నర్థం చేసుకుని వుంటే ఎంత సుఖపడేవాడినో నేను. రోజులు గడుస్తున్న కొద్దీ నాలో ఆశ కాస్త కాస్త కరిగిపోతోంది"

"దేనికైనా సమయం రావాలి మూర్తీ! ఉన్న పళాన అన్నం పెట్టమంటే అమ్మయినా పెట్టలేదు అన్నం లేకపోతే. జ్యోతి నీలాంటి వాడిని పోగొట్టుకునేంత తెలివితక్కువదని నేననుకోను."

"అసలామె నన్నర్థం చేసుకోవటానికి ప్రయత్నం కూడా చేయటంలేదని నా భయం"

"వేచి చూడు నీకే తెలుస్తుంది. కానీ ఇలా నీ ఆరోగ్యాన్ని పాడుచేసుకోకూడదు. ఆమె ఎన్నిరోజులిలా నిన్ను దూరంగా ఉంచినా, నీలో పట్టు సడలకూడదు. నువ్వెప్పుడూ సరైన మార్గంలోనే వుండాలి"

"ఏం చేయమంటావు చెప్పు?"

"నీ భవిష్యత్తుని ఆమెతో ఊహించుకో. తప్పులేదు. కానీ ఆమె ఒకవేళ నీదయితే ఏమాత్రం ఆమెని సుఖపెట్టగలవో ఆలోచించు"

"నా ప్రేమ జ్యోతిని సుఖపెట్టదంటావా ఎలిజబెత్"

"ప్రేమ, ప్రేమకైన ఆకలి తీరుస్తుందంతే. అంతవరకే! ప్రతి మనిషికీ కోరికలుంటాయి. ఆడవాళ్ళకి కొంచెం ఎక్కువగా ఉంటాయి"

"ఆమెకేం కావలిస్తే అది సంపాదించి పెడతాను"

"ఏం చెయ్యగలవు నీ మొహం? నీళ్ళలాగా ఖర్చుపెడుతున్నావు డబ్బుని. ఏ అవసరమొచ్చినా నీకందుబాటులోఉండాలి కొంత డబ్బు. ఇకనుంచీ డబ్బు దాచుకో కావాల్సిన సామానన్నీ కొనుక్కోవచ్చు దుబారా చెయ్యకుండా వుంటే. ఏ రోజు ఆమె నీ ఇంటికి వస్తానన్నా ఆమెకి కావల్సిన కనీస సౌకర్యాలు తయారుగా ఉండేటట్టు చూసుకో. ఆశను చంపుకోబోకు. నువ్వూ చచ్చిపోతావు"

"ఎలిజబెత్!"

"అవును మూర్తీ! నే చెప్పినట్టు చెయ్యి నీ కలలన్నీ నిజమవుతాయి."

వరం ప్రసాదిస్తున్న దేవతలా కనిపించింది ఎలిజబెత్ ఆ క్షణంలో. ఎందుకో ఆమె నోటి వాక్కువల్ల జ్యోతి నాదవుతుందనిపించింది.

ఎలాగైనా జ్యోతిని నా దాన్ని చేసుకోవాలి. ఎంత కష్టపడాల్సి వచ్చినా సరే ఎలిజబెత్ చెప్పినట్టు నడుచుకోవాలనిపించింది.

"ఎలిజబెత్ ! నీ మాటలు నాకెంతో ధైర్యాన్నిచ్చాయి. ఎన్నటికీ దాటతప్పను. ఇక ఒకవేళ నేను పట్టాలు తప్పటం అంటూ జరిగితే, నేను చచ్చిపోయినప్పుడే జరుగుతుంది"

"అటువంటి మాటలే మాట్లాడొద్దు నువు కోరుకున్న మనిషి నీకు దొరకటం కల్ల అన్న ఊహ నీ మనసులోకి ఎందుకు రానిస్తావు?"

"భవిష్యత్తుని ఎవరు చదవగలరు చెప్పు?"

"ఒకవేళ జ్యోతితో నీకు పెళ్ళిజరగక పోయినా నీ కొచ్చే నష్టం ఏం లేదు. ఆమె ఎవర్ని పెళ్ళి చేసుకున్నా సుఖంగా ఉండా లని కోరుకో. ఆ క్షణం నుంచీ ఆమెని ఓ చెల్లిలా ప్రేమించు"

"నేనలా ఆత్మవంచన చేసుకోలేను ఎలిజబెత్. ఆమె లేకపోతే భవిష్యత్తు నా ఊహకి అందకుండా పోతుంది. ఆమె ఇంకోళ్ళ మనిషయితే నేను ఒంటరివాడి నయిపోతాను"

"పిచ్చి మూర్తీ"

"అవును ఎలిజబెత్! నేను చేయగలి గింది ఒక్కటే. ప్రయత్నం! నువు చెప్పి నట్టే ఎంతో ఓపికగా ప్రయత్నం చేస్తాను. ఆమెకి కావల్సినవన్నీ సాధ్యమైనంత వరకూ ఇప్పటినుంచే అమర్చి పెడతాను. ఏనాడూ 'ఈ మనిషిని నేనెందుకు పెళ్ళి చేసుకున్నాను?' అని బాధపడే స్థితి ఆమెకి కల్పించను"

"నీ మనసెటువంటిదో ఇంకొక్కసారి తెలుసుకుందామని ఆమాటన్నాను మూర్తీ! అంతే కాని అలా జరగాలని కాదు. నీలాంటి అమాయకుడికి దేవుడు అన్యాయం చెయ్యడు"

రాత్రి మూడయింది అప్పటికే.

పడుకున్నా నిద్రపట్టలేదు ఇద్దరిలో ఎవరికీ.

తన చిన్నప్పటి కబుర్లన్నీ చెప్పింది ఎలిజబెత్. ఊకొడుతూ పడుకున్నాను.

ఆమె మాటలు వింటున్నానన్నమాటే కాని నా లోపల-లోలోపల జ్యోతి గురించే నా ఆలోచన!

ఉన్నట్టుండి టాపిక్ మార్చింది ఎలిజ బెత్.

"మూర్తీ! నిన్నొకటి అడగనా?"

"అడుగు"

"ముందర మాటియ్యి నే చెప్పినట్లు చేస్తానని"

"ఏమిటో చెప్పు?"

"ఊహుఁ అలా కాదు ముందు మాటివ్వాలి"

"అలాగేలే. ఏమిటో చెప్పు?"

"రోజూ ఆ లైబ్రరీకి వెళ్ళటం, అక్కడ నీ టైమంతా వేస్టు చేయటం మానేయాలి నువ్వు"

"ఎందుకు" అడిగాను.

"అదంతే. నా మాటవిను"

"బలే చిక్కులో పెట్టావు నన్ను"

"నీకు పోయేదేంలేదు కొన్ని రోజులు ఇంటిపట్టున ఉంటే."

"ఉండగలనంటావా జ్యోతిని చూడ కుండా?"

"ఎందుకుండలేవు?"

"ఏమో!"

"నే నెందుకు చెబుతున్నానో తెలుసా? కొన్ని రోజులు నువ్వు కనబడకపోతే ఆమెలోనూ నిన్ను చూడాలనే కోరిక తలెత్తవచ్చు"

తను చెప్పిన దాంట్లో ఎంతో లాభం ఉందనిపించింది నాకు.

"అలాగే ఎలిజబెత్! నువు చెప్పినట్టే చేస్తాను."

"నువు మంచి కుర్రాడివి. ఇలా చెప్పిన మాట వింటే బాగుపడతావు

నువ్వు" అంటూ నా నుదుటన ముద్దు పెట్టుకుంది ఎలిజబెత్ చల్లగా.

కబుర్లతో అలాగే తెల్లారి పోయింది.



మర్నాటి నుంచీ నా దైనందిన కార్యక్రమంలో ఎంతో మార్పొచ్చింది. లైబ్రరీకి వెళ్ళటం మానేశాను. ముందర నాలుగైదు రోజులు కష్టమనిపించింది మానేయటం. తరవాత మెల్లగా సర్దుకున్నాను.

నోట్లో సిగరెట్టు లేకుండా కనపడని నేను, సిగరెట్లు మానేయటంతో చాలా మందికి ఆశ్చర్యం కలిగించింది ముఖ్యంగా కంపెనీలో.

నా దగ్గరికి పనిగట్టుకుని రావటం, సిగరెట్టు తాగమని నా ముందుంచటం, మానేశానని నా చేత చెప్పించుకోవటం చాలా మందికి సరదా అయిపోయింది. ఓ వారం రోజులు గడిచాక కానీ ఎవరికీ నమ్మకం కుదరలేదు.

ఆటోలకి, రిక్షాలకి నేను ఎంత డబ్బు తగలేసే వాడినో! చివరికి అవి కూడా మానేసి, ఎంతదూరమైనా నడిచి వెళ్ళటం అలవాటు చేసుకున్నాను.

ఇదంతా జ్యోతి కోసం చేస్తున్నానని తృప్తి పడేవాడిని!

ఎలిజబెత్ అదివరకు కంటే నన్ను ఇంకా జాలిగా, ఓ చంటిపిల్లాడిలా చూడటం మొదలెట్టింది. ఎప్పుడూ ఆలోచనలలో మునిగిపోయే నన్ను చూసి దిగులుగా ఉన్నాననుకునేది కాబోలు.

కాని నిజానికి నా మనసెంతో ఉత్సాహంగా వుండేది. ఏదో కొత్త ఆశ, ధైర్యం నన్ను నడిపించేవి. జ్యోతితో నా జీవితం ఎలా ఉంటుందో ఊహించుకుంటూ, ఆ కమ్మటి ఊహలతో ఎంతో తృప్తి పడేవాడిని.

అప్పుడప్పుడు మనసు వణికేది, కానీ మళ్ళా ధైర్యం తెచ్చుకునే వాడిని.

గాలిలో దీపం పెట్టి దేవుడిని వేడుకోవటం లేదుగా నేను?

నా లోని అణువణువూ జ్యోతికోసమే అన్నట్టు గడుపుతున్నా కాలాన్ని.

నా మనసు పిలుస్తోంది జ్యోతిని వేయి గొంతులతో. బదులు లేకపోయినా పిలుస్తోంది - ఆమెకి ఎప్పటికైనా వినపడాలని.

ఉత్తరాలు రాయటం మటుకు మానలేదు నేను. ఇదివరకు కంటే ఎంతో దీనంగా అర్థిస్తూ రాసేవాడిని. ఏ ఆడదాని ముందూ ఏ మగాడూ అంతగా లొంగిపోలేడేమో!

'నన్ను నీ పాదాలకింద పరచాలనుంది జ్యోతీ' అంటూ రాశానొకసారి.

అదేం చిత్రమో రోజులు గడవటం కష్టమనిపించలేదు నాకు. ఎన్ని గంటలైనా తియ్యటి ఊహలతో గడిపేవాడిని ఒక్కడినీ మంచం మీద పడుకుని.

నాలో ఏదో మార్పొచ్చిందనుకున్నారందరూ. నాకు సన్నిహితంగా ఉండేవాళ్ళు కొంతమంది నాకు పిచ్చెక్కిందేమోనని భయపడ్డారు కూడా.



అంతటి ఒంటరితనాన్ని రెండు చేతులూ చాచి కౌగిలించుకున్నాను.

నాలాటి వాళ్ళకి ఆ పరిస్థితుల్లో తోడు ఒంటరితనం.

అప్పుడే అనిపించింది-

ఏమో ?

నే నెంత తపన పడినా, ఎంత కష్ట పడినా జ్యోతితో నాకు రాసిపెట్టి లేదేమో నని. రాను రానూ ఆ భయం నాలో కాస్త కాస్త చోటు చేసుకొని, గుండెలో ముల్లు కెలికినట్లయేది.

అందుకే ఒకటి నిశ్చయించు కున్నాను.

నా జీవితాన్ని ముగించటం సమస్య కాకపోయినా, నేను పడ్డ బాధ మాత్రం జ్యోతికి తెలియాలి. ఈ విషయం తెలిసిన ప్రతి మనిషికీ తెలియాలి నేనంటే ఏమిటో. అందరికంటే ముఖ్యంగా నీకు తెలియాలి.

అందుకే మొదటినుంచీ జరిగినదంతా

రాయటం మొదలు పెట్టాను అక్షరం పొల్లుపోకుండా. జ్యోతిని నేను చూసిన క్షణం నుంచీ, ఈ సమస్యకి ఒక సమాధానం దొరికే వరకూ జరిగినదీ, జరిగేదీ కాగితం మీద పెట్టాలని నిశ్చయించుకున్నాను.

ఆ నెలలో ఓవర్ టైం కలిపి ఎనిమిదొందల యాభై వచ్చింది జీతం. గది అద్దెకీ, అత్యవసరాలకీ ఒక మూడొందలు మాత్రం ఉంచుకుని మిగతా డబ్బు బ్యాంకులో వేశాను.

జ్యోతిని చూడాలనిపించేది ఎన్నోసార్లు. ఇదివరకులా దూరం నుంచయినా చూసొద్దామనిపించేది. అతి ప్రయత్నం మీద అన్ని రోజులు చూడకుండా ఉండగలిగాను.

ఆ నవ్వు మొహాన్నీ, పిట్టలా ఉన్నా ఎంతో పెద్దరికం కనిపించే ఆ రూపాన్నీ ఒక్కసారి చూడాలనిపించింది.

ఓ రోజు ఇక నా కోరికను అణుచుకోలేక సాయంత్రం కంపెనీ నుండి వచ్చేటప్పుడు చిక్కడపల్లిలో దిగిపోయాను. లైబ్రరీకి చేరుకునేదాకా ఒకటే ఆత్రం.

కాసేపు కూచోటం, గేటు దాకా వెళ్ళి చూసి రావటం; మళ్ళీ కూచోటం, చూసి రావటం; ఇలా ఆ రోజు ఇరవై సార్లు జరిగిందేమో.

ఎనిమిదయింది. జ్యోతి రాలేదు.

స్టాఫంతా వెళ్ళిపోయారు. వాచ్ మన్ చేత చెప్పించుకోకుండా నేనూ బయటి కొచ్చేశాను. రోజూ తప్పకుండా వచ్చే జ్యోతి ఎందుకు రాలేదో నా కర్థం కాలేదు.

కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి – ఎందుకు ఆ ఏడుకొండలవాడు నన్నిలా బాధ పెడుతున్నాడా అని.

అక్కడ నించి రవీంద్రభారతికి వెళ్ళాను. ఇదివరకు అక్కడ జ్యోతితో కలిసి కూచున్న చోటును మరిచిపోలేదు నేను. మళ్ళీ సరిగ్గా అదే చోటులో కూచున్నాను.

ఒక్కసారిగా నాలో ఆవేదన పొంగింది.

వెక్కి వెక్కి ఏడ్చాను.

'ఏ మనిషికీ ఇంతటి చిత్రహింస వద్దు భగవాన్' అనుకున్నాను.

నా అణువణువూ ఆమె కోసం, ఆమె తోడు కోసం పరితపిస్తూందే ? నేనంటూ ఓ మనిషిని ఉన్నాననయినా ఆమెకి గుర్తుందా లేదా అన్న అనుమానం వేసింది.

నా మనసులో ఆమె మీద నా కున్న ప్రేమ ఎంతదో ఆమెకి నిజం చెప్పటం నా తప్పా?

ఆమెకి చులకనయి పోయానా?

నా కర్థం కాలేదు జ్యోతి. ఆమె తత్వం అంతకంటే అర్థం కాలేదు. ఆమె మనసు ఓ అగాథంలా కనిపించింది. అగాథంలోకి చూకినా, చీకటి తప్ప ఏం ఉంటుంది?

చాలా సేపు కూచున్న తరవాత గుడి కెళ్ళామని పించింది. కొండపైకి వెళ్ళనివ్వ లేదు గార్డు.

వెనక్కి తిరిగాను, గదికి. నీరసం ముంచుకొచ్చింది. ఓపిక లేకపోయింది. రిక్షా ఎక్కి గది కెళ్ళిపోయాను.

రాత్రంతా నిద్ర పట్టలేదు. ఒళ్ళు వెచ్చబడింది ఒంటిగంటయేసరికి. జ్వరం పెరిగింది తెల్లారేటప్పటికి. కనురెప్పలు విపరీతంగా వాచిపోయాయి. అయినా, పగలుపూట పడుకోవాలనిపించలేదు. తలవారా స్నానం చేసి కంపెనీకి బయలు దేరాను.

బస్టాండు దగ్గర ఎలిజబెత్ కలిసింది. నా అవతారం చూడగానే అడిగింది ఏమయిందని. కోప్పడింది అంత జ్వరంతో రెస్టు తీసుకోకుండా వచ్చినందుకు.

చెప్పాను కదా మా కంపెనీకి బస్ చేరుకోవాలంటే గంట పడుతుందని ?

కళ్ళుమూసుకుని కూచున్నా గంటసేపూ అలాగే. ఏడు గంటలకల్లా కంపెనీకి చేరుకుంది బస్సు. ఒంట్లో ఓపికలేక తూలాను బస్సు దిగుతుంటే.

తొమ్మిది గంటలదాకా ఎలా పని చేశానో నాకే తెలియదు, జ్వరం కాస్త తగ్గినా కనురెప్పలు విపరీతంగా వాచి పోవటం మూలాన, భరించలేని పోటు మొదలయింది. కళ్ళు తెరిచి చూడలేక పోయాను. మా ఆఫీసరు దగ్గర పర్మిషను తీసుకుని ఫస్టెయిడ్ రూంలో పడు కున్నాను.

మానసికంగా బాధ అనుభవిస్తున్నప్పుడు దానికి శారీరక సమస్యలు కూడా తోడైతే ఎంతటి మొండివాడైనా కృంగిపోతాడు.

ఆ రోజు నన్నెంతో నిస్సత్తువ ఆవహించింది.

ఎలిజబెత్ మా కంపెనీ నర్సు కలిసి నాకు ఆ రోజు చేసిన సపర్యలు నేను ఎన్నటికీ మర్చిపోలేను. ఓ రెండు గంటల్లో కంటి వాపు కాస్త తగ్గింది. నా సీటు దగ్గరకెళ్ళి కూచున్నా. నా పరిస్థితి చూసి నాకు పనేం చెప్పలేదు మా సీనియర్ క్లర్కు.

సాయంత్రం కోసం ఎదురుచూశాను.

లైబ్రరీకి వెళ్ళాను సాయంత్రం ఎలిజబెత్ వద్దంటున్నా. ఇదివరకు యూనివర్సిటీలోని దుష్ట చతుష్టయంలోని ఇద్దరు కుర్రాళ్ళతో వచ్చింది జ్యోతి.

గేటు దగ్గర నుంచి వస్తూ నన్ను చూసింది. ఓ అర క్షణం చూసిందోలేదో మొహం తిప్పేసుకుంది.

చివుక్కుమంది నా ప్రాణం.

తనని చూసిన కొద్ది క్షణాలూ, కళ్ళప్పగించి ఓ వెర్రిబాగులవాడిలా చూడటం తప్పించి ఏం చేయలేను నేను. అది నా బలహీనత.

కానీ తనకేం అడ్డు వచ్చింది.

ఓ చల్లటి చిరునవ్వుకు కూడా నోచుకో లేదా నేను?

ఒక్కమాట చెప్పలేదా నాతో వేచి ఉండమని? జీవితాంతం ఉండగలను ఎదురుచూస్తూ నాకు ఆ మాత్రం ఓదార్పు ఇస్తే.

ఎందుకో అక్కడ వుండబుద్ధి కాలేదు. వెంకటేశ్వరస్వామి గుడికి వెళ్ళాను.

జ్యోతితో నాకున్న కొద్దిపాటి పరిచయంతోనే ఆమెను నాకెంతో దగ్గరగా ఊహించుకున్నాను.

అందుకే ఆమెతో ముడివేసుకున్న తియ్యటి జ్ఞాపకాలంటూ నాకేమైనా వుంటే అయిదువేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. ఆ కొండ మీద తనతో నేను గడిపిన సాయంకాలం ఆ జ్ఞాపకాలలో ఒకటి.

ప్రపంచంలో ఏ విషయం మీదైన రవ్వంత ఆసక్తి ఉండొచ్చు ప్రతి మనిషికీ. కానీ నాలాంటి వాళ్ళ విషయం ఎవరికి కావాలి ? అవసరమేముంది ఎవరికైనా ఈ విషయం పట్టించుకోవటానికి? ఎందుకంటే ఈ స్థితి నేను తెచ్చుకున్నాను. తప్పు నాదే.

కొండ మీద ఇదివరకు జ్యోతి అన్న మాటలు గుర్తు వచ్చాయి.

"ఇప్పుడిప్పుడే మీరు పెళ్ళి విషయం

మాట్లాడొద్దు" అని. కొంతలో కొంత తృప్తి పడ్డాను ఎప్పటికైనా ఒప్పుకోక పోతుందా అని.

కొండ కింద రోడ్డు మీదికి చూశాను జ్యోతి కనబడుతుందేమోనని. నా పిచ్చి కాని జ్యోతి అక్కడెలా వుంటుంది?ఎందు కుంటుంది.

ఎడారిలో ఎండ మావుల కోసం ఆత్రంతో ఎదురు చూసే అమాయకుడూ, ఆ క్షణంలో నీ మూర్తీ - ఒకే మూసలో మనుషులనిపించింది ఆ క్షణంలో.

కొండ మీద నుంచి కిందకి దూకుదా మనిపించింది.

ఆశ ఆపింది నన్ను మెడ పట్టుకుని.

ఎలిజబెత్ గదికెళ్ళాను. అన్నం తింటోంది వెళ్ళేటప్పటికి. నాకూ కంచం పెట్టి వడ్డించింది. జాన్ నిద్రపోతున్నాడు అప్పటికే. అదృష్టవంతుడనిపించింది. వాడిని చూస్తే ఎంతో అసూయ కలిగింది నాకు.

"లైబ్రరీకి వెళ్ళినట్టున్నావు" అంది ఎలిజబెత్.

"నీకు చెప్పాగా ముందే వెళ్తానని?"

"చూశావా ?"

"చూశాను"

"దీనివల్ల నీ కొరిగేది ఏమిటి ?"

"నాకే తెలియదు. నీకేం చెప్ప మంటావు ?"

"నీతో మాట్లాడిందా ?"

"నాతోనా ?" నవ్వాను నేను ఓ పిచ్చి నవ్వు.

"మరెందుకు వెళ్ళినట్టు?"

"ఏమిటో చూడాలనిపించింది. రోజూ చూడాలనుంటుంది."

"నే చెప్పిందేమిటి నువ్వు చేస్తోం దేమిటి?"

"మనసు ఉండబట్టలేక పోయాను. మాట తప్పినందుకు క్షమించు"

"నీ మంచికోసమే కదా నే చెప్పింది? ఇంకొన్ని రోజులు ఓపిక పట్టు. అంతా సర్దుకుంటుంది"

"ఏం సర్దుకుంటుందో ఏమో ?"

"అన్నట్టు చెప్పటం మర్చిపోయాను. మీ నాన్న గారి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. మన లెటర్ బోర్డులోచూశాను. మన వాళ్ళ సంగతి నీకు తెలుసుగా ? అక్కడేవుంటే కొట్టేస్తారు ఉత్తరాలు. అదో సరదా వాళ్ళకి. అందుకే తీసు కొచ్చేశాను"

"ఎక్కడుంది?"

"ఆ డ్రాయరులో వుంది చూడు"

ఉత్తరం తీసి చదివాను.

నాన్నగారు నాతో మాట్లాడుతున్న ట్టనిపించింది కాసేపు.

"మూర్తీ !

నీకు కలకత్తాలో ఉద్యోగం చూశాను. పదమూడొందలు జీతం. వచ్చే నెలలో ఇంటర్వ్యూ ఉంటుంది. తరవాత నెలరోజుల్లో నువ్వు జాయిన్ కావాలి. ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. నువ్వు ఎప్పుడు రావాల్సిందీ కంపెనీ వాళ్ళనుంచి కాల్ లెటరొస్తుంది. ఏ మాత్రం అశ్రద్ధ చేయ కుండా బయలుదేరి వెళ్ళు. తిరిగి వెళ్ళే టప్పుడు ఇక్కడికొచ్చి ఓ వారం రోజులు ఉండి వెళ్ళు.

నిన్ను చూడాలనుంది."

సంతకం లేదు కింద. ఎందుకు చేయలేదో ?

మొత్తానికి అన్నమాట నిలబెట్టు కున్నారు నాన్నగారు. గమ్యానికి చేరు

వవుతున్నానని నాకు పట్టరాని సంతోషం కలిగింది.

"నాకు కలకత్తాలో ఉద్యోగం వచ్చింది. ఎగ్జిక్యూటివ్ పోస్టు. పదమూడొంపలు జీతం'' అన్నా ఎలిజబెత్ తో.

''నిజంగా! కంగ్రాట్స్. ఇంకేం? నీకేబాధా లేదు. ఎప్పుడు వెళ్ళాలి?"

"అప్పుడే ఎక్కడ. ఇంకా కనీసం రెండు నెలలయినా పడుతుంది. ఇంటర్వ్యూ వచ్చే నెలలో.''

''ఇంకా ఇంటర్వ్యూ అంటావేమిటి?"

"జరిగేదానివే. అవన్నీ జరగాలి కదా?''

"వచ్చేసిందంటావెమిటి మరి? అసలు నమ్మకం ఉందా వసుందని?"

"నమ్మకం లేకపోతే నాన్నగారు నాకు ఉత్తరం రాయరు. టైం పడుతుందంతే.''

"పోన్లే రెండు నెలలు కానీ, నాలుగు నెలలు కానీ నీక్కావలసింది సాధించుకున్నావు. ఇక నువ్విలా దిగాలుగా ఉండటం మానేయి. దేవదాసు నయం నీకంటే. చేతిలో సీసా, నోట్లో సిగరెట్టూ, కాస్త వెరైటీగా అన్నా కనిపిస్తాడు. చుట్టూ మనుషులనే కాకుండా నిన్ను నువ్వే బాధపెట్టు కుంటున్నావు."

"ఇదివరకు నా అంత సరదామనిషి లేడనే వారు స్నేహితులంతా. తెలుసా?"

"ఇప్పుడేమయింది?"

"ఏమో నవ్వు రావటం లేదు ఎంత ప్రయత్నించినా''

"నీకేం తక్కువ మూర్తీ! ఈ ఉద్యోగంలో చేరిన వెంటనే జ్యోతిని కలుసుకో. నీతో వచ్చే సెయ్యమని అడుగు. తప్పకుండా వసుందనే నా నమ్మకం. పెళ్ళి చేసుకుని తీసుకుపో నీతో."

నిట్టూర్చాను నేను.

"ఎటువంటి భయాలూ పెట్టుకోకు. కాస్త నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. కంపెనీ ఎగ్జిక్యూటివ్ అంటే ఎలా ఉండాలి? నీకు లేని అందాన్ని ఎలాగూ తెచ్చుకో లేవు. ఉన్నదాన్ని కాపాడుకో.''

ఆ రోజు ఎలిజబెత్ గదిలోనే పడుకున్నాను.

* * *

మర్నాడు తెల్లవారుఝామునే నన్ను నిద్రలేపటానికి ప్రయత్నించిందిఎలిజబెత్. జ్వరం వల్ల లేచే ఓపిక లేకపోయింది.

ఇదివరకెప్పుడూ నాకు జ్వరం వచ్చేది కాదు. అజానుబాహుడిని కాకపోయినా, నా ఒళ్ళు మాత్రం రాయిలా ఉండేది. ఎప్పుడన్నా కాస్త ఒళ్ళు వెచ్చబడినా, డాక్టరు దగ్గరికి వెళ్ళాలంటే తెగ బద్ధకం ఈ మధ్య నా ఇంద్రియాలు కూడా నా మాట వింటంలేదనిపిస్తోంది.

బలహీనుడిని అయిపోయాను. మానసికంగా మాత్రమే కాదు - శారీరకంగా కూడా.

ఫ్లాస్కు నిండా హార్లిక్సు పోసి,రొట్టె కాల్చి నాకు తినిపించి, నా బలవంతం మీద కంపెనీకి వెళ్ళింది ఎలిజబెత్.

చల్లటి తల్లిలా అనిపించింది ఎలిజబెత్.

ఆమెను చూస్తుంటే, అంతరాత్మ ప్రభోదంలో నేనణగతొక్కిన కామం కాలు దువ్వుతూ వుంటుంది నాలో అప్పుడప్పుడూ.

నాకామె అన్నం పెడుతున్నప్పుడు - ఒక చెల్లిలా, నాకడుపు నిమిరే తల్లిలా కనిపిస్తుంది.

విభిన్న భావాలు.

ఈ రెంటిలో ఏది నిజం?

ఏది గొప్పది?

మామూలు మనిషిని. తేల్చుకోలేక

పోయాను.

మధ్యాహ్నానికి కాస్త జ్వరం జారింది. హార్లిక్సు ఫ్లాస్కులోంచి ఒంపుకుంటుంటే, చేతిమీద ఒలికింది.

మెండిగా చేద్దామనుకున్న ఆ వేలు సగ్రుస మండింది!

చాలా రోజులయింది ఆ భాగోతం అయిపోయి. కుట్లు కూడా ఎప్పుడో సర్దుకు పోయాయి. వేలు రూపం కాస్త మారిం దంతే. కాని-

ఎందుకో మంట పుట్టింది. తెగ బాధ వేసింది.

జ్యోతి గుర్తుకు రావటం మూలా న్నేమో !

ఆ పేరూ, ఆ మనిషీ నన్నెంత పిచ్చివాడిని చేశాయంటే - ఓ గంట సేపు ఏదో పనిలో మునిగిపోయి జ్యోతి గురించి ఆలోచించటం మానేస్తే, ఎంతో కాలం నాకు తెలియకుండా నన్ను మోసం చేసి గడిచిపోయిందనిపిస్తుంది.

ఎందుకు నన్నిలా దూరం చేసుకుం టోందో అంతుపట్టలేదెప్పుడూ.

ఆమె నాదికాకపోతే నే బ్రతకలేను భరించలేను ఆ రౌరవ నరకాన్ని.

మా గురించి అందరికీ తెలిసిపోయింది. నేను చూపిస్తున్న ఆసక్తి జ్యోతికి లేదని అందరికీ తెలుసు.

'జ్యోతి నాకు తన చేతిని అందిస్తే ఈ ప్రపంచంలో అందరికంటే అదృష్ట వంతుడిని నేను' అది నా అభిప్రాయం, నమ్మకం.

'తను నన్ను కాదంటే నేనెందుకూ పనికిరాని వాడిని, వీధి కుక్కల కంటే కనాకష్టం.' ఇది ప్రపంచం నమ్మే మాట.

నేను వీధి కుక్కలకి కూడా చులకనయి పోవచ్చు. నిజం.

జ్యోతికి నేను తగననీ, అందుకే ఆమె నన్ను నిర్లక్ష్యం చేస్తోందనీ, నేను ఆ అవ మానం భరించలేక నా ప్రయత్నం మాన లేకపోతున్నాననీ అందరూ అను కుంటున్నారు.

ఎలాగైనా ఆమెని సాధించి నా పూజా నికి ప్రాణం పోస్తాననీ, అందుకే నా పట్టు విడవటం లేదనీ ప్రపంచం ఉద్దేశం. నాకూ జ్యోతికీ తెలిసిన ప్రపంచం భ్రమ!

అదే నిజమైనా ఆమె కాదన్నందుకు నేనెప్పుడూ బాధపడను.

కానీ

ఆమె లేకపోతే బతకలేను.

మనిషిగా బతకలేను!

అందుకే నా విఫల ప్రయత్నం.

ఎంతమంది అర్థం చేసుకోగలరు ఈ మాట ?

ఎంతమందికి కనబడుతుంది నా మూగ ఆరాధన?

కనీసం జ్యోతి ఒక్కతీ నా మనసుని అర్థం చేసుకుంటే నాకంతే చాలు.

ప్రపంచంతో నాకెందుకు ?

నా ప్రపంచం జ్యోతి.

జ్యోతి నన్నర్థం చేసుకుంటే చాలు. అదే నాకు కావలసిందీ, నేను కోరుకునేదీ.

* * *

మర్నాడు కూడా జ్వరం వచ్చింది.

ఇంకాస్త తీవ్రంగా వచ్చింది. ఎలిజబెత్ పాపం కంపెనీకి వెళ్ళలేదు. మధ్యాహ్నా మయేసరికి ఒళ్ళు మసలిపోయింది.

అపస్మారకంలో మనిషి విచిత్రంగా మాట్లాడతాడు. కాని నిజం చెబుతాడేమో!

మంచం మీద నా పక్కనే కూర్చుని నాకు సేవ చేస్తోంది ఎలిజబెత్,

ఏ కల్మషం లేదు ఆ మనసులో, మనిషిలో. ఏ లాభం ఆశించటం లేదు నా నుంచి. మరి నా మీద ఎందుకీ ఆపేక్ష?

దేవుడు కావాలని కలుపుతాడా ఇలా మనుషులని?

"కంపెనీకి ఎందుకు వెళ్ళలేదు ఎలిజబెత్ ?"

"మాట్లాడకుండా పడుకో"

"నా కెప్పుడూ ఇంత జ్వరం రాలేదు తెలుసా ?"

"మాట్లాడకుండా పడుకుంటావా లేదా ?"

"ఎప్పుడూ నవ్వుతూ వుంటుంది జ్యోతి. నన్నూ నవ్వి పారేస్తుందంటావా"

"............"

"చచ్చిపోతానేమో ఈ సారి"

నోటిమీద తన చేతిని అడ్డంగా పెట్టి మాట్లాడనివ్వలేదు ఎలిజబెత్.

నన్నాపటం తన తరం కాలేదు. అడ్డంగా పెట్టిన చేతిని బలవంతంగా లాగి పారేశాను.

"ఎలిజబెత్! నేను చచ్చిపోతే జ్యోతి కాస్తయినా బాధ పడుతుందంటావా ?"

"మూర్తీ! నువు నోరు మూసుకోక పోతే నేను బయటికి వెళ్ళిపోతాను"

"నీకు విసుగ్గా వుందేమో. క్షమించు"

"............"

"ఎన్నో సందేహాలు. నాతో ఏదీ పంచుకోలేదు జ్యోతి, పంచుకోదు. చాలా బాధగా వుంది నాకు"

"............"

"నా లాంటి వాళ్ళు ఎంత మంది వున్నారో ! ఈ వయసులో వాళ్ళకి ఎంతో మందికి ఇటువంటి సమస్య ఎదు రవుతుంది. ఓడిపోతే దానికి పరిష్కారం ఏమిటి ? చచ్చిపోవాలా? ఎంత మందికి చచ్చే ధైర్యం ఉంటుంది ?"

"మూర్తీ"

"ఆ ఏడుకొండలవాడికి నా మీద ఎంత దయో చూశావా ? ఇంత దురదృష్టం లోనూ అదృష్టం-నాకు చావంటే భయం లేకపోవటం. నాకెందుకో అనిపిస్తూంది నేను చావటానికి ప్రయత్నం కూడా చేయనక్కరలేదని. ఈ జ్వరం నాకా శ్రమ లేకుండా చేస్తుందేమో"

ఎలిజబెత్ ఏడుపు ఆపుకోలేక పోయింది.

"మూర్తీ! నన్ను బాధ పెట్టకు. నీకు దణ్ణం పెడతా"

"ఎందుకు ముడి వేసుకున్నావీ స్నేహాన్ని నాతో? పిచ్చిదానా! నేనెందుకూ పనికిరాని వాడిని. అందుకే నేనెవరికీ అక్కర్లేదు"

"మూర్తీ !"

"క్షమించు. నేనేం మాట్లాడను. నిన్ను హింసిస్తున్నానేమో ! ఆ అధికారం నాకు లేదు"

ఎన్నో పలవరింతలు !

తరవాత చెప్పింది ఎలిజబెత్.

అంత నిరాశలోనూ, నిస్పృహలోనూ కూడా ఎన్నో కమ్మటి ఊహలు.

ఎంత మధురంగా ఉంటాయి ఊహలు !

ప్రపంచంలో ఎందుకూ పనికిరాక, ఏం చేయలేక అనవసరంగా బతికే ప్రతి అసమర్థుడు చేసే పని కలల్లో బతకటం.

నేను పనికిరాని వాడిని కాను.

అసమర్థుడిని అంతకంటే కాదు.

అయినా కానీ-

జ్యోతి విషయంలో మాత్రం కలలు తప్ప ఇంకేం మిగలటం లేదు.

నేను చేయగలిగింది ఒక్కటేనేమో- ఆమెతో నా భవిష్యత్తు ఊహించుకుంటూ, కలలు కంటూ, బతికినంత కాలం గడిపే యటం.

నాలుగు రోజుల వరకూ నన్నొదిలి పెట్టలేదు రోగం. అయిదో రోజున జ్వరం జారినా, నీరసంతో లేచే ఓపిక కూడా లేకపోయింది.

సాయంత్రం నాలుగున్నర దాకా అలాగే పడుకున్నాను. జ్యోతిని చూడ టానికి వెళ్ళొద్దని చెప్పింది ఎలిజబెత్. నా మంచికోసమే చెప్పింది. అందుకే వెళ్ళ టానికి మనసొప్పలేదు.

ఒక్కడినీ అలా పడుకోలేకపోయాను. విసుగుపుట్టి బట్టలేసుకుని మెల్లగా నడుస్తూ బయలుదేరాను బజారుకి.

దారిలో బార్ కనబడింది. నా అడుగు తడబడి తూలాను ఒక్కక్షణం. కానీ దేవుడి దయవల్ల సర్దుకున్నాను.



చౌరస్తా దగ్గర సినిమా హాల్లోంచి జనం బయటికి వస్తున్నారు. ఆ మలుపు దగ్గర ఆగి వాళ్ళని చూస్తూ నిలబడ్డాను.

నా వెనకనే స్కూటరు ఆగింది.

చప్పుడుకి వెనక్కి తిరిగితే వేణు కనిపించాడు. వెనకాతల ఎవరో అమ్మాయి కూచుంది. ఇద్దరూ స్కూటరు దిగి నా దగ్గరికి వచ్చారు.

'నా భార్య' అంటూ పరిచయం చేశాడు వేణు!

ఏం మాట్లాడాలో తోచలేదు నాకు.

"పెళ్ళికి పిలవనందుకు తిట్టబోకు నన్ను. ఎవరికీ చెప్పకుండా హఠాత్తుగా చేసుకోవాల్సి వచ్చింది."

"నీకంత అవసరం ఏమొచ్చింది?" అన్నాను.

"చెప్తా. రా, కాఫీ తాగుదాం" అంటూ హోటల్‌కి లాక్కెళ్ళాడు వేణు.

ముగ్గురం కాఫీ తాగుతూ కూచున్నాం.

కమల నాకు మూడేళ్ళ నుంచీ తెలుసు. కానీ నాకు ఉద్యోగం వచ్చిన తరవాత పెళ్ళి చేసుకుందామని ఇన్ని రోజులాగాం. అటు వాళ్ళ పెద్ద వాళ్ళకీ, ఇటు మా వాళ్ళకీ ఎవరికీ ఇష్టం లేదు."

"అలాగా?"

"నీకు తెలుసుగా నాకు ఓ మేనరికం ఉందని? అదలావుంచి, కమలా వాళ్ళ నాన్నగారికి ఏదో వేరే సంబంధం చేయాలనుంది. ఇంకా ఆలస్యం చేస్తే కొంప మునుగుతుందనే పెళ్ళి చేసేసుకున్నాం. నాలుగోరోజు ఇవాల్టికి మా పెళ్ళయి"

నేను మౌనంగా కూచున్నాను అలాగే.

'ఎంత గుంభన మనిషో వేణు' అనిపించింది.



శుభాకాంక్షలు చెప్పాను జంటకి. కాసేపు కూచుని వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

నాతో ఎన్ని రోజులనుంచో పరిచయం వేణుకి. అయినా మాటవరసకైనా ఆ అమ్మాయి ప్రసక్తి తేలేదు. గుట్టుచప్పుడు కాకుండా పెళ్ళి చేసుకున్నాడు.

ఎందుకంత దాపరికం?

నేనేనా వెర్రిబాగులవాడిని?

"ఎదుటి మనిషి ప్రతివాడూ నాలాటివాడే అనుకుని నా బాధ చెప్పుకున్నాను. నా సోదంతా విని ఏదో పిచ్చి సలహా ఒకటి పారేసి, నేనటువెళ్ళగానే నా వెనకాతల నవ్వుకునే మనుషులు నా వాళ్ళనుకున్నాను.

ఇన్నాళ్లు ఎంత భ్రమలో బతికానో ఆ రోజే తెలిసొచ్చింది.

వేణుని చూసినందుకు ఆ రోజు నా మనసుని అసూయతో మలినం కాకుండా కడుక్కున్నాను.

నేను తప్పు చేశానా ?

ఎంతో ఆలోచించి జ్యోతి నాక్కావలసిన మనిషని నిర్ణయించుకున్నాను. అంతస్తు నాకంటే తక్కువే. అందం ఆమెలోనూ లేదు. నాలో అంతకంటే లేదు. సాదా మనిషి. నాకు సరిపోయే మనిషనుకున్నాను.

ఆమెను ఆశించే అర్హత నాకుందనుకున్నాను. మనస్ఫూర్తిగా నమ్మాను నేను కోరుకోకూడనిది కోరుకోవటం లేదని.

మరెందుకు నా బతుకిలా నవ్వులపాలవుతోంది ?

నాన్నగారి ఉత్తరం నాకు నిజానికి ధైర్యాన్నిచ్చింది.

ఈసారి మటుకు జ్యోతి ఉద్దేశం తెలుస్తుందనిపించింది.

ఇంకో ఇరవై రోజుల్లో ఇంటర్వ్యూకి

వెళ్ళాలి.

తరవాత నెలరోజుల్లో కొత్త జీవితం మొదలవుతుంది. పదిమందీ ఆశించేహోదా, అంతస్తూ అన్నీ నాకు దక్కుతాయి.

ఆ జీవితాన్నైనా పంచుకుంటుందా జ్యోతి నాతో ?

నేను తనకు హోదాలో తగననే భావం తనలో ఉందో లేదో తెలిసిపోతుంది. అప్పుడిక నేను ఆశ వదులుకోవచ్చు.

ఒకవేళ అప్పటికీ నన్ను కాదంటే ?

ఏమో ! ఒకో మనిషిని చూస్తుంటే ఒకో భావన కలుగుతుంది. నన్ను భర్తగా ఊహించుకోలేదేమో జ్యోతి.

నేను భరించగలనా అదే నిజమయితే!

ప్రశ్నలమయం అయింది నా జీవితమంతా. జ్యోతి నన్ను కాదనదనే నా మనసు పదేపదే చెబుతోంది. మోసం చేస్తోందా నా మనసు నన్ను?

చివరికి నా మనసు చెప్పిందే నమ్మదామనుకున్నా.

కలకత్తాలో చేరేముందు జ్యోతిని కలవాలి. ఆమెను ఒప్పించి నాతో తీసుకుపోవాలి. ఆమెకి కావలసినవన్నీ సంపాదించిపెట్టాలి. ఆమెకి నీడనై తోడుగా నా జీవితం గడపాలి.

ఆ ఊహ నన్ను గిలిగింతలు పెట్టి ఆనందంలో ముంచేసింది.

* * *

ఎదురు చూసిన ఇరవై రోజులూదగ్గర పడ్డాయి. ఉత్తరాలు రాయటం తప్ప జ్యోతిని మటుకు చూడలేదు నేను. మనసు వేధిస్తూ ఉండేది ఒక్కసారైనా చూద్దామని. కానీ నిలదొక్కుకున్నాను.

ఇంటర్వ్యూకి వెళ్ళాల్సిన రోజు దగ్గిర పడింది. కంపెనీకి సెలవు పెట్టాను పది రోజులు. అంతా సిద్ధం చేసుకున్నాను.

జ్యోతికి అంతా వివరంగా రాశాను ఉత్తరంలో.

నాకేమనిపించిందో అప్పుడు ?

హైదరాబాదు వదిలిపెడితే రోజుకో ఉత్తరం రాయలేను. కలకత్తా నుంచి, ఢిల్లీనుంచి కాని రాసినా మూడు రోజులకి కాని చేరుకోదు హైదరాబాదు. మహా అయితే ఆ పదిరోజుల్లో మూడు ఉత్తరాలు అందుతాయేమో.

నా ఉత్తరం రావాలని జ్యోతి కోరుకుంటుందో లేదో తెలియదు. కాని, పదిరోజుల్లో మూడుకంటే ఎక్కువ ఉత్తరాలు రాయలేనని నాకు మాత్రం ఎంతో వెలితిగా తోచింది.

నా మీద నాకే జాలేసింది!

ఏ మనిషైనా తనని చూసి తనే జాలి పడే స్థితి ఎప్పుడొస్తుంది ? ఆఖరి క్షణాల్లోనా?

రైలెక్కేదాకా అనిపించింది ఎన్నోసార్లు జ్యోతిదగ్గరికెళ్ళి అంతా చెబుదామని. కానీ ఏదో జంకు. రైలు కదిలిన కాసేపటికి బాధపడ్డాను ఎందుకు కలవలేదా అని.

రైల్లో పరిచయాలు చాలా తొందరగా అవుతాయి. ఆ కాసేపూ పిచ్చాపాటీ మాట్లాడుకునేందుకు తోడు కావాలి ప్రతివాడికీ. కాని ఆరోజు ఎవరితోనూ మాట్లాడలేదు నేను.

పక్కనున్నవాళ్ళు కాస్త ప్రయత్నం చేసి నా వాలకం చూసి నన్నొదిలిపెట్టారు.

తెల్లారి ఎనిమిదిన్నరకి వాల్తేరు చేరుకుంది రైలు.

ప్లాట్‌ఫారం మీద కుర్రాడితో ఓ కవరు తెప్పించుకుని గబగబా ఉత్తరం రాశాను జ్యోతికి. అక్కడే పోస్టు చేశాను కూడా.

అప్పటికి పన్నెండు గంటలు గడిచింది. ఇంకో ఇరవైనాలుగు గంటల్లో హౌరాలో ఉంటాను. నా పదిహేనో ఏట వెళ్ళాం మా కుటుంబం అంతా కలకత్తాకి. మూడేళ్ళు ఉన్నాం అక్కడ.

ఆ పాత పరిచయాలన్నిటినీ ఒక్కసారి పలకరించాలనిపించింది.

మర్నాటి సాయంత్రానికి హౌరా చేరుకుంది రైలు.

రైలు దిగిన తరవాత ఎందుకో తెలిసిన వాళ్ళింటికి వెళ్ళాలనిపించలేదు. బేలీగంజ్‌లో ఓ సౌత్ ఇండియన్ హోటలుంది. అక్కడికెళ్ళి రూము తీసుకున్నా.

తెల్లారితే ఇంటర్వ్యూ కదా ?

నా దురదృష్టం చూడు. రాత్రి తొమ్మిదయ్యే సరికి నా ఒళ్ళు జ్వరంతో కాలిపోయింది. కళ్ళు మంటలు...నా శక్తికి మించిన బాధ.

మంచం మీద నుంచి హోటలు కుర్రాడిని పిలిచే ఓపిక కూడా లేకపోయింది ఒంట్లో.

భరించాను బాధంతా. చూసే దిక్కులేక. చచ్చిపోతానేమో, అసలు తెల్లవారదేమో అనుకున్నాను.

కానీ—

వెలుగును చూశాను ఎలాగో. ఎందుకో?

* * *

పొద్దునే లేని ఓపిక తెచ్చుకుని మంచం మీంచి లేచాను. తలవారా స్నానం చేసి సుప్రభాతం చదువుకోవాలనిపించింది.

చన్నీళ్ళ స్నానం చేసిం తర్వాత ఎక్కడ కూచుని చదువుకోవాలో దేవుడి స్తోత్రం తోచలేదు.

నా పర్సులో ఏడుకొండలవాడి ఫొటో బల్లమీద పెట్టి, కుర్చీలో కూర్చుని చదువుకున్నాను స్తోత్రం.

ఆ సమయంలో దేవుడు తప్ప నాకు ఇంకే ఆధారం ఉంటుంది చెప్పు?

మనసు సర్దుకుంది.

పనికుర్రాడి చేత మాత్రలు తెప్పించుకుని కాఫీ తాగాను. ఓ అరగంటలో కాస్త నయమనిపించింది.

పది గంటలకి నా ఇంటర్వ్యూ.

నాకు కాస్త ఓపిక వచ్చేసరికి ఎనిమిదిన్నర యింది. సుభాశ్‌చంద్రబోసు రోడ్డులో ఉంది నే వెళ్ళాల్సిన కంపెనీ. హోటలు నుంచి మైలున్నర దూరంలో ఉంది.

బస్సుకోసం నిలబడే సత్తువలేక ఆటోలో వెళ్దామనిపించింది. అరగంట సేపు చూసినా ఆటో దొరకలేదు.

చివరికి విసుగుపుట్టి టాంగాని పిలిచాను. నా చిన్నప్పుడు కలకత్తా మొదటిసారి వెళ్ళినప్పుడు టాంగా ఎక్కాలంటే ఏదో బాధగా ఉండేది.

ఎందుకో తెలుసా?

ఎద్దు బండిని ఎద్దులాగినట్టు, టాంగాని మనిషి లాగుతాడు. మనిషి మనిషే కదా!

అందుకే టాంగా ఎక్కితే ఏదో పాపం చేసినట్లనిపించేది. తరవాత అలవాటైపోయింది.

నే చెప్పిన ఎడ్రసుకి చేర్చాడు టాంగా వాడు. పన్నెండంతస్తుల భవంతి. తల మొత్తం ఎత్తాలి ఆఖరి అంతస్తు కనబడాలంటే.

ఇంకా ముప్పావుగంట టైముంది. ఎదురుగావున్న హోటల్లోకి వెళ్ళికూచున్నా ఇంకోసారి కాఫీ తాగుదామని. నేను వెళ్ళాల్సిన కంపెనీ ఆఫీసు తొమ్మిదో

అంతసులో ఉంది.

ఓ వెర్రి ఊహ నా మనసులో మెది లింది.

అంత పైనుంచి పడితే మనిషి శరీరం ఎలా ఉంటుంది? కింద పడగానే తునా తునకలై, చెల్లాచెదురవుతుందా? నజ్జు నజ్జు అయిపోతుందేమో!

ఆ చావులో సుఖం లేదనిపించింది.

నేను కూర్చున్న టేబిల్ దగ్గరికి ఓ జంట వచ్చింది, అమ్మాయి భుజం మీద చెయ్యివేసి నడుస్తున్నాడా హీరో.

నాకు లిప్‌స్టిక్ పెట్టే ఆడవాళ్ళంటే రోత. జుగుప్స!

కాని

ఆ అమ్మాయి లిప్‌స్టిక్ పెట్టుకున్నా, నవనాగరికంగా ఉన్నా ఎంతో హుందాగా ఉంది. బెంగాలీ రకం మహిమ కాబోలు అనుకున్నాను. గలగలా నవ్వుతోంది అతని మాటలకి చుట్టూ మనుషులని లెక్కచేయకుండా.

ఎవరి ప్రపంచం వాళ్ళది.

ఆ మహానగరంలో మనుషుల్నీ వాళ్ళ జీవితాల్నీ చూస్తుంటే-ఉధృతంగా పొంగుతూ ప్రళయాన్ని తెచ్చే వరద గుర్తుకొస్తుంది.

జ్యోతి గుర్తుకొచ్చింది. నేనలా తనకి కబుర్లు చెబుతూ వుంటే - తనూ అలా గలగలా నవ్వుతూవుంటే ఎంత బావుం టుంది.

మైమరచిపోగలను ఆ నవ్వుని చూస్తూ.

ఆ నవ్వు చాలు 'నా జన్మకి' అని పిస్తుంది.

ఇంకో పది నిమిషాలుండనగా లేచాను. పర్సనల్ మేనేజర్‌ని కలవాలి. రిసెప్ష నిస్టుకి నా దగ్గర లెటర్ ఇవ్వగానే లోపలికి దారి చూపించింది.

ప్రవాసాంధ్రుడు ఆ పర్సనల్ మేనే జర్. మా నాన్నగారి ప్రాణస్నేహితుడు. నన్ను చూడగానే తన హోదానీ - నేను తనకింద పనిచేయబోతున్నాననే విషయం మరిచిపోయి కుర్చీలోంచి లేచి ఆప్యా యంగా చేయి కలిపాడు.

సగం - ఆయనకి మా నాన్నగారితో ఉన్న ప్రాణస్నేహం, సగం - తెలుగు తనం మహిమా దానికి కారణం.

క్షేమ సమాచారాలడిగి, టిఫిను తెప్పించి నా చేత బలవంతంగా తిని పించాడు. వచ్చే నెల్లో చేరమన్నాడు నన్ను. ఓ గంటసేపు కబుర్ల తరవాత వచ్చేశాను హోటలుకి.

అదీ నా ఇంటర్వ్యూ!

హోటలు గదికి రాగానే నాన్నగారు గుర్తుకొచ్చారు.

వెంటనే రెక్కలు కట్టుకుని వాలాలని పించింది ఢిల్లీలో.

హోటలు గుమాస్తాకి ఓ ఇరవై రూపా యలు ఎక్కువిచ్చి ఆవాళ సాయంత్రం ఎక్స్‌ప్రెస్‌లో రిజర్వేషను సంపాదించ మని చెప్పాను.

నాకీ ప్రపంచంలో అందరికంటే ఇష్టం మా నాన్నగారని నీకు తెలుసు. అటు వంటి మనిషికి నేను కొడుకును కావటం దేవుడు నాకు ప్రసాదించిన ఒకే ఒక వరం ఇంతవరకూ.

అటువంటిది జ్యోతి నన్ను ఎంతగా ఆకట్టుకున్నదంటే - ఆమెను గురించిన ఊహ నా మనసులో ఊగిసలాడు తున్నంతసేపూ మా నాన్నగారు కూడా గుర్తు కొచ్చేవారు కాదు.

ఒక్కసారిగా గుబులు ముంచు

కొచ్చింది ఆయన మీద. ఏం చేయాలో తోచలేదు. ఆయన్ని రెప్పపాటులో చూడాలనిపించింది. కాంతి వేగంతో ఉరకలు వేస్తున్న నా మనసుని ఎలా సమాధాన పరచటం ?

నిద్రమాత్రలు వేసుకోవాలనుకున్నాను. ప్రిస్క్రిప్షనులేందే ఇవ్వరు షాపువాళ్ళు. నాకు తెలిసిన డాక్టరూ లేడు.

అంతకంటే తేలికయిన మార్గం గుర్తుకొచ్చింది. ఎలిజబెత్‌కి తాగనని మాటిచ్చిన విషం!

బయటికి వెళ్ళి రమ్ సీసా పెద్దది పట్టుకొచ్చాను. తాగటం మొదలెట్టాను.

రెండు గుక్కలు గొంతులో పడిన తరువాత—ఎందుకు మళ్ళీ మొదలుపెట్టానా అని బాధపడ్డాను.

సగం సీసా ఖాళీ అయేసరికి సాయంత్రం అయిపోయింది. హోటలు గుమాస్తా రైల్లో నాకు సీటు సంపాదించాడు. ఆటో ఎక్కి స్టేషనుకెళ్ళి రైల్లో కూలబడ్డాను.

రైల్లో మిగతాది తాగాలనిపించింది. ప్లాట్ ఫారం మీది పంపులో నీళ్లునింపాను. పలచనయింది విషం.

పైన నా బెడ్డింగు పరుచుకుని మొదలు పెట్టాను తాగటం. కిందవాళ్ళకి కనపడకుండా జాగ్రత్తపడినా నా పక్కనే పైన కూర్చున్న సర్దార్జీ ఊరుకోలేదు.

హిందీలో హితోపదేశం మొదలెట్టాడు.

అతని వాక్కులూ, అతను చెప్పే హితోక్తులూ అన్నీ విన్నాను. కానీ నేను మాత్రం నోరు విప్పి ఒక్కమాట మాట్లాడలేదు.

తాగడం పూర్తయేసరికి తొమ్మిదయింది. మూడు గంటల ప్రయాణం అయిపోయింది. నా మతులో రైలు ఎప్పుడు కదిలిందీ కూడా చూడలేదు నేను.

కళ్ళుమూతలు పడటం మొదలయింది. సంతోషించాను కనీసం ఇందులోనైనా అనుకున్నది సాధించగలిగినందుకు.



తెల్లారి సర్దార్జీ నానా బాధాపడి నన్ను లేపేదాకా నాకు మెలకువ రాలేదు.

తలపోటు దిమ్మసతో కొడుతున్నంత నొప్పి. లేచి మొహం కడుక్కుని కాస్త కాఫీ తాగాను. సామాను సర్దుకుని ఆటో ఎక్కి ఇంటికి బయలు దేరాను. అడ్రసు వెతుక్కుని వెళ్ళటానికి చాలా సేపయింది.

నన్ను చూడగానే మా వాళ్ళంతా కావలించుకున్నారు.

నే వెళ్ళేటప్పటికి నాన్నగారు స్నానం చేస్తున్నారు. నా గొంతు వినపడగానే బయటికొచ్చేశారు పంచె చుట్టుకుని. తల సరిగ్గా తుడుచుకోలేదు. అక్కడక్కడ సబ్బు నురగ కూడా అలాగే వుంది.

నన్ను చూడాలనే ఆయన ఆత్రం చూస్తే నాకు ఏడుపొచ్చింది.

అమృతుడు ఆయన! ఆయన్ని బాధ పెట్టే అధికారం నాకు లేదు.

నేనంటే పంచప్రాణాలు. నన్నొదిలి పెట్టి ఉండటం ఎంతో కష్టం ఆయనకి.

రెండు చేతులూ నా చుట్టూ వేసి తన గుండెకి హత్తుకున్నారు. నా చేతులూ

ఆయన్ని పెనవేశాయి.

ఆ గుండెల మీద ఎంతటి తృప్తి ?

కొన్ని క్షణాల సేపూ ఇద్దరం విడిచి పెట్టలేకపోయాం ఒకళ్ళనొకళ్ళు.

మనుషులు దూరమయితే ప్రేమ ఎక్కువవుతుందంటారు చూడు ? సాధారణంగా అందరూ అనుభవించేదే అది.

అయిదు రోజులూ నిమిషాల్లా గడిచిపోయాయి. నాబాధలన్నీ చెప్పుకున్నాను ఆయనతో. ఓదార్చి ధైర్యం చెప్పారాయన.

చాలా సరదాగా ఉన్నానా అయిదు రోజులూ.

నేను బయలుదేరే రోజునన్నాన్నగారూ, నేనూ ముందు గదిలో కూచున్నాం.

నువు మళ్ళీ హైదరాబాదుకి వెళ్ళటం ఎందుకురా ? ఆ జాబ్‌కి రాజీనామా పంపించి ఇక్కడే వుండు. వచ్చే నెలలో కలకత్తాలో చేరిన తరవాత వెళ్దువు గాని ఆమెని కలవటానికి."

"ఎలా?"

"ఎలా ఏముంది?దీంట్లో చేరిన తరవాత ఇంకొక్కసారి అడుగు ఆ పిల్లని చాలు. అదిచాలు, అంతకంటే సాష్టాంగపడకు."

"నాకు నమ్మకముంది నాన్నగారూ ! మీరు దిగులు పెట్టుకోకండి ఈవిషయంలో. నాతో ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకుని తీసుకొచ్చేయాలనుంది కలకత్తా. ఉద్యోగంలో చేరే ముందే చేస్తానా పని."

"అవున్నా. ఇంకా నెలరోజులుంది కదా. ఇంకో ఇరవై రోజులు హాయిగా ఇక్కడే వుండు. తరవాత వెళ్ళి ఆ పిల్లని తీసుకుని, కలకత్తా వెళ్ళొచ్చు."

"నేనీ నెల రోజుల్లో చెయ్యాల్సినవి చాలా ఉన్నాయి. ఎన్నో సమకూర్చుకోవాలి."

"డబ్బు విషయం ఏమయినా ఇబ్బందా?"

"అబ్బెబ్బే. అదికాదు. నా దగ్గర ప్రస్తుతం డబ్బుంది"

"మరేమిటి?"

"ఇప్పుడు కారణం అడగబోకండి దయచేసి. కానీ నేను వెళ్ళాలి. నన్ను క్షమించండి"

శతవిధాల చెప్పారు నాన్నగారు. నేను అవుననలేదు. కాదన్నందుకు ఎంత బాధపడ్డానో !

అప్పుడనిపించింది-అటువంటి అమృతమూర్తిని బాధపెట్టే కాఠిన్యం నాలో ఎలా వచ్చిందా అని.

జ్యోతి మీద నాకున్న ప్రేమ వల్లనా? నా ప్రేమ అంత గొప్పదని మోసం చేసుకోనా నన్ను నేను? ఆలోచనకి అంతు దొరకటం లేదని చెప్పాగా నీకు ?

నాన్నగారిని వదిలి వెళ్ళటానికి ఎంత బాధపడ్డానంటే-అసలెందుకు ఢిల్లీ వెళ్ళానా అనిపించింది.

తిరుగు ప్రయాణం మొదలయింది.

ఈ తొమ్మిది నెలలలో ప్రతీక్షణం నా మనసు ఎలా పరిగెత్తిందో నీకు చెప్పాలంటే ఎన్ని సంవత్సరాలు పడుతుందో ! నా జీవితకాలం సరిపోదేమో.

ప్రయత్నం చేస్తున్నాను. అంతే ! మొదట చెప్పినట్టు నన్నూ, నా మనసునీ కాగితం మీద చిత్రిస్తున్నాను.

ఎప్పుడెప్పుడు హైదరాబాదులో ఉంటానా అనిపించింది.

ఎందుకో ఆ తొందర!

పెట్లోంచి డైరీ తీశాను రాద్దామని. రైల్లో చేసేదేముంటుంది. కాసేపు మనసుని



సమాధాన పెడదామనిపించింది.

ఓ కవరు జారి పడింది డైరీలోంచి. నా పేరుంది దానిమీద 'కుట్టీ' అని. నాన్నగారు రాశారది. ఎప్పుడు పెట్టారో డైరీలో కాని, ఆయన డైరీ మొత్తం చదివే ఉండాలి.

అప్పటివరకూ జరిగిన కథంతా ఆయనకి తెలుసు. నేనే చెప్పాను. నాకేం అనిపించలేదు ఆయన చదివినందుకు. ఆయన దగ్గర నా కేమిటి దాపరికం ?

పరాయి మనిషి చదివినా నేనేం అనుకోను. ఎందుకంటే నన్ను పదిమందీ అర్థం చేసుకోవటమే నాకు కావలసింది. కవరు చించగానే లోపల ఓ ఫొటో, ఉత్తరం కనబడ్డాయి. ఉత్తరం చూశాను.

"మూర్తీ!

నీ జీవితం నీదయినా—నా రక్తం నీలో ఉంది. అందుకే నువు పచ్చగా ఉండాలనీ, నేను పోయేముందర అది నేను చూడాలనీ నాకోరిక. ప్రతీ తండ్రీ కోరుకునే మామూలు కోరిక !

ఆఖరిసారి చెబుదామని నా ఉద్దేశం. మళ్ళీ ఇంకెప్పుడూ నిన్ను ఇబ్బంది పెట్టను.

జ్యోతితో నీకు రాసిపెట్టివుంటే ఇన్ని రోజులు పట్టేదికాదు మీరు ఒకటవటానికి.

ఒక బిచ్చగాడిలా ఆ పిల్ల ముందు నిలబడి యాచిస్తున్నావు నువ్వు.

ఏం సాధించావు? ఏం సాధించగలవు?

రత్నం అందరికీ కావాలి. దాని కోసం ఎన్నో ప్రయాసలుపడి వెతుకుతారు మనుషులు.

కానీ–

రత్నం ఎవరినీ వెతకదు.

'కాకిపిల్ల కాకికి ముద్దు' అని ప్రపంచం అనుకున్నా – నాకు తెలుసు నువ్వో రత్నానివని.

నీ జీవితాన్ని దుబారా చేస్తున్నావు. ఈ ఫొటోలో అమ్మాయి పేరు శాంత. ఎంతో వెతికి వెతికి నీ కోసం కుదిర్చిన సంబంధం ఇది.

నువ్వు ఓడిపోవాలని నేనెప్పుడూ అనుకోలేదు. కాని నాకు తెలుసు నువు ఓడిపోతావని. అందుకే ఈ ప్రయత్నం చేశాను నీకు చెప్పకుండా.

వాళ్ళ నాన్నగారు నిన్నిదివరకే చూశారు. నువు వాళ్ళకి నచ్చావు. వాళ్ళు చాలా మంచి మనుషులు. ఎంతో డబ్బున్నా ఏ మాత్రం గర్వం, డాంబికం లేని మనుషులు.

నువు సరేననటం కోసం వాళ్ళు ఎదురు చూస్తున్నారు. నేనూ ఎదురు చూస్తున్నాను.

ఒక నెలరోజులు బాగా ఆలోచించి నిర్ణయం తీసుకో.

నిన్ను నువు బాధపెట్టుకోకుండా నా కోరిక తీర్చి నాకు మనశ్శాంతిని ఇవ్వగలిగే శక్తి, నీకు ఆ దేవుడు ప్రసాదించాలని ఆ ఏడుకొండలవాడిని ప్రార్థిస్తున్నా.

నీ

నాన్న.

గుండెలు పిండే బాధ ఉత్తరం చదువుతున్నంతసేపు.

ఎలా నాన్నగారికి మనశ్శాంతిని ఇవ్వటం ?

నాకు సాధ్యం అవుతుందా ? జ్యోతి అవునంటే సాధ్యమవుతుందేమో.

ఫొటో చూడాలనిపించింది.

నేను నా మనసు మార్చుకుని అవునన్నంత మాత్రాన ఆ అమ్మాయీ, నేనూ భార్యాభర్తల మవుతాం. కలిసి బాధలూ, సుఖాలూ పంచుకుంటాం. బతుకుతాం.

ఎలాగూ నేను ఒప్పుకోలేనని నాకు తెలుసు. ఆ అమ్మాయికీ, నాకూ జత కుదరదనీ తెలుసు.

కాస్తలో తప్పిపోతున్న ఆ బంధం ఎవరితోనా అని కుతూహలం పుట్టింది.

నా మనసులో ఇంతగా జ్యోతి నిండిపోయినా, ఆ ఫొటోలో అమ్మాయిని చూడగానే మనసు చెదిరింది అరక్షణం. అంత అందంగా ఉంది!

భయంకరంగా ఉండే కాలనాగు నిగనిగ కనపడింది ఆ మొహంలో నాకెందుకో.

అటువంటి అందమైన అమ్మాయి మనసెలా వుంటుందో ననిపించింది. పేరుకూ, రూపానికి సంబంధం లేదు. శాంతత లేదు కాని అందం ఉంది ఆమెలో.

ఆమె తనకంటే అందమైన వాడినీ, గొప్ప వాడినీ చేసుకోవచ్చుగా? కోరుకోవచ్చుగా?

అసలు నాలో ఏం చూసి వాళ్ళు పిల్లనిద్దామనుకున్నారా అని ఆశ్చర్య పోయాను!

జ్యోతిని మరిచిపోలేను. మరిచిపోయి ఆ అమ్మాయిని చేసుకోలేను.

ఒక వేళ చేసుకున్నా, ఆ అందాన్ని నేను భరించలేను.

అందం చూసి ఆనందిస్తాను.

కానీ –

భయపడతాను కూడా.

పెట్లో పెట్టేశాను ఫొటో.

ఎంత చిత్రంగా ఉందో చూశావా? ఎక్కడో దూరాన ఉన్న మనుషులు పెళ్ళి పేరుతో దగ్గరవటం, ఒకర్నొకరు పంచుకోవటం చూస్తుంటే దేవుడనే వాడు ఉన్నాడనిపిస్తుంది నా సికుడికైనా.

ఇంతకు ముందెప్పుడూ ఆమెని నేను చూడలేదు, మాట్లాడలేదు. ఆమెకి నేను తెలియదు. నాకామె తెలియదు.

పూర్తి అపరిచితులం!

అటువంటిది, పెళ్ళయితే ఇద్దరం భార్యా భర్తలం. కలిసి బ్రతుకుతాం చచ్చేవరకూ. ఇద్దరి ప్రతిరూపాలనూ సృష్టిస్తాం.

మనిషి జీవితంలోని అంత భాగాన్ని, నిశ్చయించటానికి పెద్దవాళ్ళు ఎంతో తక్కువ కాలం వెచ్చిస్తున్నారని బాధ పుట్టింది.

దారిలో స్టేషనులోనే ఒక కవరు కొని నా ఉద్దేశం కాగితం మీద పెట్టి, పోస్టు చేశాను నాన్నగారికి. తీరా పోస్టు చేశాక గుర్తొచ్చింది ఫొటో కవర్లో పెట్టటం మరిచిపోయానని.

జ్యోతి గుర్తొచ్చింది. రైలు దిగగానే ఆమెని చూడాలి.

పరిగెత్తే మనసుకి, ఆలోచనలకి కళ్ళెం వేసి కళ్ళు మూసుకున్నాను.



కళ్ళు తెరిచేటప్పటికి ప్లాట్ ఫారం కలకలం వినపడింది. సికింద్రాబాదు వచ్చేసింది. అరగంటసేపు ఆగింది రైలక్కడ.

అక్కడే సామాను దింపేసి జ్యోతి వాళ్ళింటికి వెళ్దామనిపించింది.

ఎందుకు?

ఏమో! నాకే తెలియదు. నవ్వొచ్చింది, నాకు అలా అనిపించినందుకు.

హైదరాబాదు ఎప్పుడొస్తుందా అని ఆరాటపడ్డాను ఎంతో. తీరా వచ్చేసరికి ఆశించినంత ఆనందం కనపడలేదు.

దేనికైనా–

ఎదురు చూడటంలో ఉన్న తృప్తి అంతేనేమో !

బాధ మొదలయింది. ధైర్యం చెప్పు కున్నాను నాకు నేనే.

గదికెళ్ళి స్నానం చేసి కంపెనీకి వెళ్ళాను.

మర్నాటిదాకా సెలవు పెట్టి, ఆవేళ వెళ్ళటంతో ఆలస్యం అయినందుకు ఏం అనలేదు మా ఆఫీసరు.

క్యాంటీనులో నన్ను చూడగానే కావ లించుకున్నంత పనిచేసింది ఎలిజబెత్. ఎన్నో రోజుల తర్వాత కలిసినట్టు అని

పించింది కాబోలు పాపం.

నాన్నగారి తరవాత నా కోసం, నా సుఖం కోసం ఆరాటపడే మనసు ఎలిజబెత్ దని తెలిసొచ్చింది ఆ రోజు.

"ఎంత చిక్కిపోయావు మూర్తీ! పది రోజుల్లో సగం మనిషివయిపోయావు" అంది నన్ను పరీక్షగా చూసి.

"నీ కళ్ళకి అలాగే కనిపిస్తాలే"

"నిజంగా చిక్కిపోయావు"

నవ్వాను నేను.

"పెద్ద ఉద్యోగం వస్తోందీ, మీ వాళ్ళ నందరినీ చూసొస్తావూ, ఎంతో హుషారుగా ఉంటావనుకున్నాను"

"సర్లే"

"నీలో ఇంకా చీకటి పోలేదుమూర్తీ!"

"అవునా?"

"కళ్ళకింద చూడు ఆ చారలు ఎలా మొదలయ్యాయో? అదేదో సినిమాలో అన్నట్టు ఇరవైలో అరవైవయసొచ్చింది నీకు"

"సినిమాలు ఎక్కువ చూస్తున్నావు నువ్వు. సాయంత్రం పనేం లేదుగా?"

"ఏం లేదులే. విసుగ్గా ఉంది నువ్వెళ్ళినప్పట్నుంచీ"

"నిజంగానా?"

"లేపోతే అబద్ధమనుకున్నావా? ఇవాళ బయట భోం చేద్దామా?"

"అలాగే"

"సాయంత్రం నన్ను కలవటం మరిచి పోకు"

"జాన్ ఎలా? వాడొక్కడే ఉంటాడు కదా మనం వెళ్ళేదాకా?"

"ఇంటికెళ్ళి చెప్పి పోదాంలే. నే వస్తా మూర్తీ! మా సూపర్‌వైజర్ గొడవ పెడతాడు" అంటూ మళ్ళా పనిలోకి వెళ్ళి పోయింది ఎలిజబెత్.

ఆ రోజు ఎందుకో చాలా విసుగు పుట్టింది; యంత్రంలా పనిచేసే అలవాటు పది రోజుల సెలవు మూలాన కాస్త తప్పి పోయింది. అందుకేనేమో అంత చిరాకు పుట్టింది అవాళ.

సాయంత్రం నేనూ, ఎలిజబెత్ కోరీలో దిగాం.

"ఎక్కడికెళ్దాం?"

"ముందర కాస్త టిఫిను చేద్దాం మూర్తీ"

"ఏకరంగా భోంచేసేద్దాం రారాదూ?" అన్నా.

సరేనంది ఎలిజబెత్. భోంచేసి ఇద్దరం పార్కులో కూచున్నాం చాలాసేపు కబుర్లు చెప్పుకుంటూ.

గది కెళ్ళేసరికి జాన్ నిద్రకళ్ళతో తలుపు తీశాడు. ఊరికే పార్కులో కూచున్నా టైం తెలియలేదు అవాళ. చాలా ఆలస్యమయింది. అక్కడే పడుకోమంది ఎలిజబెత్ అవాళ్టికి.

పొద్దునే గదికెళ్ళాను. అంతా దుమ్ము పట్టి నానా చీదరగా ఉంది. చీపురు పుచ్చుకుని ఊడవటం మొదలెట్టగానే ఎలిజబెత్ వచ్చింది.

"అదేమిటి ఆయుధం పట్టుకున్నావు?"

"ఏం చెయ్యమంటావు చెప్పు? చూడు గదంతా ఎంత చీదరగా ఉందో?"

"ఇప్పుడా? ఇంకో పది నిమిషాలయితే బస్సెళ్ళిపోతుంది. మళ్ళా టైముకి కంపెనీకి వెళ్ళాలంటే ఆటో, దానికి ఓ పది రూపాయలు దండగా."

"ఎంతసేపు ఒక్క నిమిషం ఉండు వెళ్ళిపోదాం"

"సర్లే మహానుభావా.! తెల్లారుతుంది

మళ్ళీ నువు ఊడవడం అయ్యేసరికి" అంటూ నా చేతిలోంచి బలవంతాన చీపురు లాక్కుని ఊడవడం మొదలెట్టింది ఎలిజబెత్.

చిటికలో గదంతా అద్దంలా తయారు చేసింది.

ఎంతైనా ఆడచేయి కదా!

హడావిడిగా ఇద్దరం బస్టాండు చేరుకున్నాం. సరిగ్గా టైముకి వెళ్ళాం. ఇంకా స ఆలస్యమయితే బస్సు తప్పిపోయుండేది.

సాయంత్రం కంపెనీ నుంచి పుస్తకాలు కొనుక్కోటానికి బజారుకెళ్ళాను. అక్కడ నుంచి ఎలిజబెత్ గదికి వెళ్ళాను.

"చూశావా నీ పార్ట్‌నర్‌ని?" అంది ఎలిజబెత్.

"నీకూ నవ్వులాటగా వుందా?"

"ఛ! ఛ! నవ్వులాటకి కాదులే. నిజంగానే జ్యోతి నీ మనిషవుతుందనే నమ్మకంతో అలా అన్నాను. ఇంతకీ కలిశావా?"

"లేదు ఎలిజబెత్!"

"అదేం?"

"ఇప్పుడు కలవాలా, లేకపోతే ఏకంగా ఒకేసారి కలకత్తా వెళ్ళేముందు కలవాలా అని ఆలోచిస్తున్నా. నువు చెప్పు ఎలిజబెత్! ఏం చెయ్యమంటావో?"

"ఇంకో నెల రోజులవరకూ నువు చూడకుండా, కలవకుండా ఉండటం చాలా మంచిది."

"నాకూ అలాగే అనిపిస్తోంది. కానీ ఎలిజబెత్? ఒక్కసారి కలిసి, జ్యోతికి చెప్పాలనుంది నాకింత మంచి ఉద్యోగం వచ్చిందని."

"ఎందుకిప్పుడు చెప్పటం?"

"ఎందుకో చెప్పనా? నా అదృష్టం ఆమెతో పంచుకోవాలనుంది. బాధ పంచుకుంటే సగమవుతుంది. మనసు తేలిక పడుతుంది. కానీ సంతోషం పంచుకుంటే ఎన్నో రెట్లవుతుంది."

"నువు చెప్పింది నిజం కాదనను. కానీ నే చెప్పింది మరిచిపోయావా?"

"లేదు ఎలిజబెత్! మర్చిపోలేదు."

"జ్యోతిని చూడటానికి కూడా నిన్నెందుకు వెళ్ళొద్దన్నానో తెలుసా?"

"ఆమె మనసు కూడా నా కోసం ఆరాట పడుతుందేమోనని."

"అవునా? నిజంగా నీ మీద ఆమెకు కాస్సైనా ప్రేమనేది ఉంటే, నువు కనపడకపోతే ఆమెకీ ఆరాటం ఎక్కువవుతుంది. నీ గురించే ఆలోచిస్తుంది తనుకూడా అప్పుడు ఆమెకూడా నీకూ, నీ ప్రేమకీ బదులిస్తుంది."

"ఒకవేళ నామీద ఏ ఆసక్తీ జ్యోతికి లేకపోతే?"

"పీడా విరగడయిందనుకోవచ్చు. కానీ ఆసక్తిలేదని ఎందుకనుకుంటావు? ఏ ఆసక్తీ లేకపోతే నీతో మాట్లాడనే మాట్లాడదు ఈమాత్రం కూడా."

"నా విచక్షణ పోయింది ఎలిజబెత్."

"పిచ్చిమారీ! ఎందుకలా కృంగిపోతావు? ఇంకో నెలరోజుల్లో నువు పెద్ద ఆఫీసరువి కాబోతున్నావు. ఈ వయసులో నీ జీవితం ఇలా ఆఫీసరు హోదాలో మొదలయితే, ఇంకో అయిదారేళ్ళలో ఎలా ఉంటుందో ఊహించుకో."

"భవిష్యత్తు ఎలా ఉంటుందో ఊహించలేను. కానీ నీతో ఓ పదినిమిషాలు కూచుంటే చాలు టానిక్ తాగినట్టుంటుంది నాకు."

"నీకేం తక్కువ మూర్తీ! తెలివితేట లున్నాయి. కష్టపడగలవు. నువు చాలా పైకి ఎదగగలవు తలుచుకుంటే. ఏ ఆడపిల్లకయినా ఇంతకంటే ఏం కావాలి చెప్పు?"

"జ్యోతి వీటన్నిటినీ గడ్డిపోచకింద తీసిపారేస్తే?"

"ఏం కాదు.అలా ఎన్నటికీ జరగదు."

"ఆమె కూడా మనిషేకదా. నాలాంటి మనసుండొచ్చు ఆమెకీ. ఇంకెవర్నయినా ఆమె ప్రేమించి వుంటే?"

"నువ్వో పెసిమిస్టువి. ఎందుకెప్పుడూ శంకిస్తుంటావు?"

"ధైర్యం జారిపోతోంది ఎలిజబెత్! ఈ ఎదురు దెబ్బలు తినే ఓపిక పోయింది."

"గుండె చిక్కబట్టుకో మూర్తీ!అంతా మంచే జరుగుతుంది."

"అసలు ఫేదీ ఆశించకుండా ఉంటే ఏ గొడవా ఉండదనిపించింది. కానీ, ఎంత ప్రయత్నించినా జ్యోతి విషయంలో మాత్రం నా ఆశ చావటం లేదు."

"ఇటువంటి పరిస్థితుల్లోనే ధైర్యంగా ఉండాలి. నువ్వింత బావకారిపోవాల్సిన అవసరం లేదు. జ్యోతి తప్ప అసలు నీకు వేరే సమస్య ఏదైనా ఉందా?"

"అదిచాలు నన్ను నరకయాతన పెట్టటానికి."

"ప్చ. ఎంత దురదృష్టం? నీకు ఎన లేని ఆనందాన్ని ఇవ్వగలిగిన మనిషి నీ జీవితానికో సమస్యయి కూర్చుంది."

"అందుకే ఎలిజబెత్! నాలో ఈ బేల తనం"

"ఇదివరికే చెప్పాను నీకు నిన్ను ప్రేమించటానికి నోచుకున్నందుకు ఆమె దురదృష్ట వంతురాలని."

"నా బతుకేం కావాలి చెప్పు?"

"ఏం? నీకింకెవరూ దొరకరా? ఆమెతో ఒకవేళ నీకు కుదరకపోయినా అంత బాధ పడాల్సిన అవసరం లేదు. ఆమె కంటే అందమైన ఆడపిల్లని పెళ్ళి చేసుకోవచ్చు నువు కావాలంటే."

అందమైన ఆడపిల్ల!

నాన్నగారిచ్చిన ఫొటో గుర్తు కొచ్చింది. చేతిలో డైరీ తెరిచి ఎలిజబెత్ కి చూపించాను ఫొటో.

"ఎవరిది?"

"మా నాన్నగారు నా కోసం కుదిర్చిన అమ్మాయి"

"జ్యోతిని నేనింత వరకూ చూడలేదు. కానీ ఈ పిల్ల మాత్రం చాలా బావుంది. నా మాట వింటావా మూర్తీ?"

"ఏమిటో చెప్పు?"

"ఒకవేళ, జ్యోతి నీది కాకపోతే ఈ అమ్మాయిని చేసుకో."

"నేను హైదరాబాదులో అడుగు పెట్టక ముందే నాన్నగారికి రాశాను నేనింకెవరినీ పెళ్ళి చేసుకోలేనని."

"ఎందుకు?"

"నీకు తెలియదా ? జ్యోతి నాక్కా వాలి."

"అలా అంటే ఎలా మూర్తీ?"

"ఆమె నాదయితేనే నేనుంటాను."

"ఒకవేళ కాదంటే ఏం చేస్తావు?"

ఏం చెప్పాలి ఎలిజబెత్ కి.

"ఏమో!" అన్నాను. ఏం చెప్పలేక పోయాను. నా చేతిలో ఏం లేదనిపించింది.

నిట్టూర్చింది ఎలిజబెత్.

"మంచో చెడో జ్యోతి కావాలను కున్నావు. నువు చెప్పినదాన్నిబట్టి జ్యోతి నిన్ను తనవాడిగా చేసుకుంటుందనే అని

పిస్తోంది నాకు. కానీ..."

"ఏమిటి?"

"ఏం లేదులే. నే చెప్పినట్టు ఈ నెల రోజులూ ఆమెని కలవకుండా ఉండాలి నువ్వు."

"అలాగే అనటం కాదు. నిజంగానే అన్నమాట నిలబెట్టుకోవాలి నువ్వు. ఇంకోటి కూడా..."

ఏమిటన్నట్టు చూశానామె వేపు.

"నాకో మాటివ్వాలి నువ్వు."

"ఏమని?"

"ఆమె నీకు బదులివ్వకపోతే మీ నాన్నగారు చూపించిన అమ్మాయిని చేసుకోవాలి నువ్వు"

"షరతు పెడుతున్నట్టుంది నువ్వడగటం"

"నీ మంచికోసం కదా మూర్తీ నే చెబుతున్నది?"

"నన్ను అపార్థం చేసుకోకు ఎలిజబెత్! నేను నీకు ఆ మాట ఇవ్వలేను. ఒకవేళ ఆమె కాదంటే మాత్రం, ఇంకామె జోలికి పోను. సరేనా?"

"నా కోసం ఈ మాత్రం చేయలేవా?"

"నీక్కావలసింది నేను సంతోషంగా ఉండటం. అంతేకదా?"

"అవును."

"నువు చెప్పినట్టు నేను జ్యోతిని కాక ఇంకెవర్నయినా పెళ్ళి చేసుకుంటే సుఖంగా ఉండగలనంటావా?"

మాట్లాడలేదు ఎలిజబెత్.

"నాకు తెలుసు. నువ్వు నన్నర్థం చేసుకున్నావు. అందుకే సమాధానం చెప్పలేక పోతున్నావు."

"మూర్తీ! నువ్వు సుఖంగా ఉండటం నాక్కావలసింది. నీకేది ఆనందాన్నిస్తుందో అదే చేయి."

"నువు చెప్పినట్టు కలకత్తాకి వెళ్ళే ముందు ఒకే ఒకసారి ఆమెని అడుగుతాను నాతో వచ్చేయమని"

"గుడ్! అన్నమాట ప్రకారం నడుచుకో. ఆ ఏసుని ప్రార్థిస్తాను జ్యోతి నీది కావాలని."

"నీ ప్రార్థనా, దీవెనా నాకు కొత్త జీవితాన్ని ప్రసాదించాలి ఎలిజబెత్."

"పడుకో. చాలా పొద్దుపోయింది. మళ్ళా పొద్దునే పోవాలి."

"నేనివాలికి నా గదికెళ్ళిపోతాను."

"ఇక్కడే పడుకోరాదూ భోంచేసి."

"లేకపోతే అన్నం పెట్టు తినేసిపోతాను."

అన్నంతిని గదికెళ్ళి పోయాను. నా బాధంతా కాగితం మీద పెట్టాలనిపించింది.

డైరీ రాయటం మొదలు పెట్టాను మళ్ళీ. కళ్ళు పోట్లుపెట్టేదాక రాశానవాళ.



సముద్రానికి ఆటూ పోటూ ఉంటుందంటారు.

అలాగే కాసేపు నా అంత అదృష్టవంతుడు లేడని మురిసిపోతాను – జ్యోతి నాదవుతుందని అనిపించినప్పుడు.

కానీ మళ్ళీ జ్యోతి నాది కాదేమో

నన్ను ఊహ మనసుని తట్టగానే, నిరాశతో నిలువెత్తునా నీరుకారిపోతాను.

ఎన్నో భయాలు ?

మర్నాడు నిద్రలేవటం ఎన్నో తియ్యటి ఊహలతో కళ్ళు తెరిచాను. కళ్ళు తెరవగానే ఎదురుగా ఏడుకొండల వాడి ఫొటో కనిపించింది. ఏనుగంత బలం వచ్చింది నాకు.

ఉద్యోగంలో చేరమని ఆర్డర్స్ రాగానే జ్యోతిని కలిసి, ఆమెను నాతో వచ్చేలా ఒప్పించాలి. కొండమీదికి తీసుకెళ్ళి ఆ దేవుడి ఎదుట నా మనిషిని చేసుకోవాలి.

నాదేననిపించింది జ్యోతి.

ఆ రోజు మధ్యాహ్నం ఉన్నట్టుండి అనుకున్నా జ్యోతికి చీరలు కొందామని. ఎలిజబెత్‌తో అదే మాట అన్నాను. కళ్ళప్పగించి చూసింది నన్ను చాలా సేపు.

ఆమె చూపు అమాయకుడైన బిడ్డను చూసి జాలిపడే తల్లి చూపులా కనిపించింది.



సాయంత్రం నా తో రమ్మన్నా ఎలిజబెత్‌ని. సరేనంది.

ఎన్నో రోజులు సాయంత్రం కోసం ఎదురు చూసినట్టే, ఆ రోజూ ఎదురు చూశాను.

బ్యాంక్‌కెళ్ళి డబ్బు తీసుకుని బజారు కెళ్ళాం ఎలిజబెత్, నేనూ కలిసి.

అప్పుడే చీకటిపడింది. మిల మిల మెరిసే దీపాలు రోడ్డు రెండు వేపులా. ఏ షాపులో కెళ్ళాలో, ఏ చీరలు సెలెక్ట్ చెయ్యాలో అర్థంకాలేదు నాకు.

"ఎలిజబెత్ ! నువ్వే నాకు దిక్కు. నాకు చేతకాదు చీరలు సెలెక్ట్ చేయటం."

"అలా అనిపిసుంది నీకు. కానీ జ్యోతికి ఏ చీరలు నప్పుతాయో నీకంటికే బాగా తెలుస్తుంది."

"అవునా ?"

"అవునూ. నీ కళ్ళతో నేనెలా చూడ గలను చెప్పు ?"

"ఏమో బాబూ."

"నాకు తెలుసుగా అదుగో ఆ షాపులో ఏదో రిడక్షన్ సేల్ ఉన్నట్టుంది. అక్కడి కెళ్దాం పద"

"వీటిల్లో మోసం ఉంటుందేమో ?"

"అన్నీ అలా ఉండవులే. అయినా ఆ బాదరబందీ నీకెందుకు చెప్పు ? రంగులు సెలెక్ట్ చేయటం వరకే నీవంతు. అవి మన్నుతాయో లేదో చూసుకునే పూచీ నాది. సరేనా ?"

"సరే పద."

గంట పట్టింది నాకు చీరలు ఎంచ టానికి.

ప్రతీ చీరలో జ్యోతి అందంగా ఉంటుందనిపించింది ?

అన్నీ లేత రంగుల్లో ఏడు వాయిల్ చీరలు తీసుకున్నాను. నాలుగొందల యాభై అయింది అప్పటికే. నా దగ్గర జేబులో ఏడొందలుంది.

బిల్లిచ్చేసి బయటకొస్తుంటే అనిపిం చింది— ఖర్చుకి ఓ యాభై రూపాలుంచు కొని మరో రెండొందలు పెట్టి ఎలిజబెత్‌కి కూడా చీరలు కొందామని. కాస ఖరీ దయిన చీరలు రెండు విడిగా పార్సిల్ చేయించాను.

"అవెవరికి ?" అనడిగింది ఎలిజబెత్.

"నీకే"

"నాకా ?"

"లేకపోతే నాకనుకున్నావా ?"

"అంత ముదురురంగులో కొంటే ఎవరికో అనుకున్నా"

"నీ కోసమేలే. నీ ఒంటికి ముదురు రంగులు బావుంటాయి. అందుకనే తీసు కున్నా."

"నాకెందుకు చెప్పు ? ఇప్పుడు నాకు లేకనా ?"

"నేను నీకు చీరలు కొనిపెట్టేంత గొప్ప వాడిని కానసుకో"

"అదికాదు మూర్తీ"

"బతిమాలించుకుంటావా ?"

"నీ దగ్గర నాకేం అంత మొహమాటం లేదులే"

"మరేమిటి ?"

"ఆడపడుచు లాంఛనాలు ఇంత చవకలో అయిపోతున్నాయే అని బాధగా వుంది"

నవ్వొచ్చింది నాకు.

"నేను కాదుగా నీకు లాంఛనాలు పెట్టేది?"

"అవుననుకో! నే నిదివరకే ఆవిడకి చీరలు కొని పెట్టాను అందుకని మళ్ళీ

ఏం కొనబోకండి అని మీ అత్త మామలకి నువ్వు చెబితే?"

"ఏం చెప్పనులే భయపడకు."

ఇద్దరం నవ్వుకున్నాం. అవాళ బయటే భోంచేశాం. సినిమాకెళ్ళాం.ఎంతో సరదాగా గడిపాం

పొద్దునే లేవాలి కాబట్టి, పడుకోవాలని చెప్పి తన గదికెళ్ళి పోయింది ఎలిజబెత్.

నేనూ గదికెళ్ళగానే నడుం వాల్చాను మంచం మీద. కళ్ళుమూసుకుని పడుకున్నంత మాత్రాన నిద్ర పడుతుందా ?

లేచి పార్సెల్ విప్పి ఒక్కొక్క చీరా చూడటం మొదలెట్టాను.

ప్రతి చీరలోనూ జ్యోతి ఎలా ఉంటుందో ఊహించుకున్నాను. కళ్ళకు కట్టినట్టు కనపడింది జ్యోతి రూపం.

రంగు రంగుల దృశ్యాలు.

మొహానికి హత్తుకున్నాను ఒకో చీరా!

చెప్పలేని ఆనందం !

ఊహలే నన్నింత ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే వాస్తవం ఇంకెంత మధురంగా ఉంటుందో అనిపించింది.

మళ్ళీ జాగ్రత్తగా ఎక్కడివక్కడ మడతపెట్టి పార్సెల్ కట్టాను. పెట్లో అడుగున చుట్టూ కలరా వుండలు వేసి ఆ పార్సెల్‌ని భద్రపరిచాను.

నిద్రపోవాలని ప్రయత్నించాను.

ఎన్నో కమ్మటి కలలు !

అర్థంకాని, తుదీ మొదలూ లేని కలలు.

* * *

జ్యోతిని తిరుపతికి తీసుకెళ్ళి పెళ్ళి చేసుకోవాలి. తరవాత నాతో కలకత్తా తీసుకెళ్ళాలి. ఎన్నో ఖర్చులవుతాయి. ఎంత సాదాగా ముగించినా ఖర్చు తప్పదుకదా కొంతయినా ?

లెక్కవేస్తే కనీసం మూడు వేలన్నా ఉండాలనిపించింది.

నాన్నగారికి ఉత్తరం రాశాను డబ్బు పంపమని.

నే కృంగిపోయినప్పుడల్లా డైరీ రాసే వాడిని. ఎందుకో మనసు తేలికపడేది.

స్త్రీ పురుషుల మధ్య దేవుడింతటి ప్రేమ, ఆకర్షణ - దాన్ని ప్రేమనాలో, ఆకర్షణ అనాలో నాకు తెలియదు ఇప్పటికీ- ఎందుకు పుట్టిస్తాడో అర్థం కాలా ఎంత ఆలోచించినా.

ఆలోచనలతో నా వయసు పెరిగ పోతోందనిపిస్తోంది. శరీరం బాధతో కృశించి పోతోంది కూడా.

ఎంత కావాలనుకున్నాను జ్యోతి ని !

జ్యోతి ఒళ్ళో పసివాడిలా దాక్కోవాలనిపిస్తుంది.

ఆ లేత గుండెలమీద సేద తీర్చుకోవాలనిపిస్తుంది.

నా రక్తం ఆమె రక్తంతో కలిసిపోతే బావుండుననిపిస్తుంది.

వింత కోరికలు !

అంతెక్కడ?

అదృష్టవశాత్తూ రోజులు తొందరగా గడిచాయి. నాన్నగారు డబ్బు కూడా పంపించారు.

ఎంతో పట్టుదలతో జ్యోతిని కలవకుండా ఉండి పోయాను అన్ని రోజులూ. ఎన్నోసార్లు మనసు చెదిరినా నిలదొక్కుకునే వాడిని. నెల రోజులూ లెక్కపెట్టే వాడిని.

ఏడుకొండలవాడు నన్ను అన్యాయం చెయ్యడనిపించేది.

నా ఆరాటం వల్లనేమో ఓ పదిరోజులు ఆలస్యంగా వచ్చాయి ఆర్డర్స్. ఆ పది రోజులూ ఎంత కొట్టుకులాడిందో ప్రాణం !

ఆర్డర్స్ చేతికొచ్చేదాకా నమ్మకం కుదరదుగా?

కంపెనీలో పనిలో మునిగుండగా నా టేబిల్ దగ్గరికి వచ్చింది ఎలిజబెత్ పరిగెత్తుకుంటూ. చుట్టూ కూచున్న వాళ్ళు నవ్వారామె పరుగు చూసి.

"గుడాఫ్టర్‌నూన్ ఆఫీసరుగారూ" అంది పోజు పెట్టి.

"ఏమిటి ?"

"తమరు ఇకనుంచీ ఆఫీసరు. నెలకి పదమూడొందలు జీతం. ఫోనూ, ఇల్లూ, వగైరా వగైరా, ఒకటేమిటి ? అన్నీనూ"

"రిఫ్రిజిరేటరూ, బొచ్చు కుక్కా లేవా?"

"కావాలంటే అవి కూడానూ."

"సర్లే కాని అసలు విషయం ఏమిటో చెప్పు?"

ఆర్డర్ కాగితం చేతిలో పెట్టింది ఎలిజబెత్.

మా కంపెనీలో ఎంత పబ్లిసిటీ కావాలన్నా కానీ ఖర్చులేకుండా జరిగిపోతుంది. సాయంత్రం దాకా అందరూ కంగ్రాట్స్ చెప్పటం, బదులుగా నేను నా కృతజ్ఞతలు చెప్పుకోవటం సరిపోయింది.

మా సెక్షనులో పని చేసే వాళ్ళు మాత్రం పార్టీ కావాలంటూ మొండిపట్టు పట్టారు. తప్పలేదు నాకింక.

మళ్ళీ అనవసరంగా తాగానా రోజు.

రాత్రి పడయిపోయింది మత్తులో ఎలిజబెత్ తిట్టింది చడామడా నన్ను.

"జ్యోతి దగ్గరికి వెళ్దామనుకున్నావుగా?"

"అవును"

"వాళ్ళతో ఎందుకుపోయావు?"

"........."

"కుక్కతోక వంకరంటావు అందుకే"

నేను మాట్లాడలేకపోయాను. తల దించుకున్నా.

"సరేలే భోంచేసి పడుకో. రేపు శనివారం శలవేగా. రేపెప్పుడుగాని వాళ్ళ ఇంటికి"

"పోనీ ఇప్పుడెళ్ళమంటావా?"

"ఇప్పుడా? ఈ వాలకంతోనా? చెప్పు తీసుకుని కొడతాడు ఇలా వెళ్తే. అదేమన్నా భోగం కొంపనుకున్నావా ? పడుకో ఇవాల్టికి"

పాపం నాకు మంచిగా నచ్చ చెప్పి, అన్నం పెట్టి పడుకోపెట్టింది ఎలిజబెత్.

* * *

పొద్దునే లేచి తలారా స్నానం చేసి వెంకటేశ్వరస్వామి గుడికి బయలుదేరాను. ఎంతో ముఖ్యమైన పని మీద బయలుదేరాను.

ఓటమి సహించలేను. భరించలేను. అందుకే.

ఆ ఏడు కొండలవాడి సహాయం కావాలి. దీవెనలు కావాలి.

మనస్ఫూర్తిగా ప్రార్థించాను నా కోరిక తీర్చమనీ, నా ఆశ నెరవేర్చమనీ.

ఆ రోజు పొద్దునే మబ్బు పట్టింది. సూర్యుడి వెచ్చటి కిరణాలు లేకపోవటంతో కొత్తగా వుంది వాతావరణం.

శరీరం ఉల్లాసంగా వుంది. మనసు కూడా కొత్త కొత్త ఊహలతో ఉరకలు వేసింది.

జ్యోతి వాళ్ళింటికి బయలుదేరాను గుడి నుంచి.

వాళ్ళ ఇంటి గేటు చాలా పెద్దగా వుంటుంది. గేటు లోపలికి వెళ్ళగానే

విశాలమైన నడవా. ఆటో దిగినా గేటు దాటి వెంటనే లోపలికి వెళ్ళలేకపోయాను. ఏం చెప్పాలి? ఎలా మాట్లాడాలి? కాసేపు బయటే వుండి ఆలోచించాను. ఏం తోచ లేదు.

బయటే అలా నిలబడుంటే బావుండ దని లోపలికెళ్ళాను.

నడవాలో జ్యోతి వాళ్ళక్కయ్య వాసంతి కూర్చుని ముగ్గులు పెడుతోంది. నన్ను చూడగానే నిలబడి కుచ్చిళ్ళు సరి చేసుకుని ఏమిటన్నట్టు చూసింది.

"ఒక్కసారి జ్యోతిని పిలుస్తారా?"

ఆమెకు కాస్త ఆశ్చర్యం వేసిందేమో పొద్దునే నేనలా ప్రత్యక్షమయినందుకు. అలాగే నోరు తెరుచుకుని చూడటం మొదలెట్టింది.

"ఒక్కసారి మాట్లాడాలి పిలుస్తారా?" మళ్ళీ అన్నా.

అలాగే అన్నట్టు తలూపి లోపలికెళ్ళి పోయింది.

నాకున్న పాత రోగం తిరగ బెట్టింది మళ్ళీ ఆ క్షణంలో. జ్యోతి కోసం ఎదురు చూస్తుంటే గుండె టక టకా కొట్టుకోవటం మొదలెట్టింది.

ఎన్నో రోజుల తర్వాత నేను కావా లనుకున్న జ్యోతి రూపం చూడబోతుంటే నా మనసు ఎలా వుంటుందో ఊహించుకో!

జ్యోతి వాళ్ళమ్మగారు బయటికొచ్చి నన్ను ఎగాదిగా చూసి, ఏం మాట్లాడ కుండా లోపలికెళ్ళిపోయారు.

ఓ పది నిమిషాల తరవాత వాసంతి బయటి కొచ్చింది.

"ఇప్పుడు రానంటోందండీ"

నాకు కోపమొచ్చింది. తమాయించు కొన్నాను.

"ఒక్కసారి మాట్లాడాలి. రమ్మ నండి"

"ఏం మాట్లాడుతారు?"

"పిలవండి ఒక్కసారి. ఆఖరిసారి"

"రాదండీ! దాని విషయం మీకు తెలియదు" అంటూ మళ్ళా పనిలో మునిగి పోయింది వాసంతి.

లోపలికెళ్ళి జ్యోతిని బయటికి లాక్కొచ్చి ఆటోలో వేసుకుని తీసుకు పోదామనిపించింది.

కానీ అపుకున్నా ఆవేశాన్ని.

నేనెవర్ని ఆ పని చేయగలను?

ఆ మనిషి మీద నాకేం అధికారం వుందని?

నేను తెచ్చిపెట్టుకున్న అధికారం అవుతుంది అలా చేస్తే. జ్యోతి తనంతట తానే ఆ బలాన్ని నా కిచ్చి వుంటే అలాగే చేసేవాడిని.

నిలబడ్డాను అలాగే ఓ బిచ్చగాడిలా.

జ్యోతి వాళ్ళ పెద్దక్కయ్య వచ్చింది ముక్కుపుటాలెగరేసుకుంటూ. పెళ్ళయి పోయింది ఆమెకి. పుట్టింటికి ఎందు కొచ్చిందో!

"ఏం కావాలండీ ?" అని అడిగింది వస్తూనే.

మనిషిలో మంచి పదును కనబడింది.

"జ్యోతితో మాట్లాడాలి."

"రాదు. ఏం కావాలో చెప్పండి."

"ఆమెతోనే చెప్పాలి."

"రానంటోందని చెప్పాగా! ఏమన్నా చెప్పమంటారా?"

"ఒక్కసారి మాట్లాడలేదా నాతో ?"

"లేదు" అందామె కరుకుగా.

"ఇది రాక్షసత్వం"

"నేనూ విసరగలను మీ గురించి అవాకులూ, చెవాకులూ."

"మేడమ్! జ్యోతితో నాకు మాట్లాడ టానికి అవకాశం దొరకదనీ, చోటు లేదనీ ఇంటికొచ్చాననుకుంటున్నారా?"

"........."

"లేదు. ఎక్కడపడితే అక్కడ మాట్లాడగలను ఆమెతో. ఆమెకిష్టం లేక పోయినా సరే నన్నెవరూ ఆపలేరు."

"ఏమంటారు ఇంతకీ?"

"ఆమెను ఇబ్బంది పెట్టకూడదనే ఉద్దేశంతోనే ఇంటికొచ్చాను మాట్లాడదామని."

"మీ ధైర్యాన్నీ, నిజాయితీనీ నేను శంకించటం లేదు. కాని ఆమె మీతో మాట్లాడనంటోంది."

"ఎందుకు?"

"నాకు తెలియదు. మీరు వెళ్ళిపోవటం అన్ని విధాలా మంచిది."

అంతకంటే ఏం కావాలి ఏ మనిషికైనా? ఆ మాత్రం చాలుకదా మానాభిమానాలున్న వాడికి.

నా భార్యను చేసుకుందామన్న మనిషి ఇంటికెళితే గుమ్మం దగ్గరనుంచే వెళ్ళిపొమ్మన్నారు నన్ను. మళ్ళీ మనస్ఫూర్తిగా ఆ గుమ్మంలోనే అడుగుపెట్టగలనా?

లేదేమో.

బహుశా వాళ్ళకి కావలసిందీ అదేననుకుంటా!

నేను మాట్లాడకుండా స్థాణువులా నిలబడిపోయాను చాలా సేపు. తేరుకుని తల యెత్తి చూశాను.

జ్యోతి పెద్దక్కయ్య ఇంకా అలాగే నిలబడి వుంది. 'ఏమంటారు?' అన్నట్టు చూసింది.

"వస్తాను" అంటూ వెనక్కి తిరిగాను.

ఇంక ముందుకు పోలేనేమో! పోయే దారి కనిపించలేదు నా కళ్ళకి చుట్టూ ప్రపంచం కనిపిస్తున్నా.

వెంటనే చచ్చిపోదామనిపించింది.

ఎలా చావాలి?

జ్యోతికి నామీద ఏ మాత్రం అనురాగమనేది వున్నా-నేనంత మరీ మరీ చెప్పినప్పుడు, పిలిచినప్పుడు బయటికొచ్చి మాట్లాడి వుండేది నాతో.

ఆ మాత్రం కూడా చేయలేక నన్నిలా బాధపెట్టి పంపించేసిందంటే, నామీద అవగింజంత ప్రేమ కూడా లేదన్న మాటేగా?

ఎంత చిత్రమో చూడు!

అందరికీ ఉద్యోగంలేదనీ, పెద్దవాళ్ళు ఒప్పుకోరనీ...ఇలా ఎన్నో కారణాలు.

నా విషయంలో మటుకు ఆదిలోనే హంసపాదన్నట్టు ముఖ్యంగా కావాల్సింది లేదు. ఏమిటో తెలుసా అది?

జ్యోతికి నా మీద రవ్వంత ప్రేమ!

ఎందుకు నన్నిలా కాలదన్నింది?

కారణం ఏమిటి?

నిజం నమ్మాలనిపించటంలేదు.

అబద్ధం నిజం కాదని తెలిసీ ఎలా నమ్మను?

మృత్యువుని నమ్మాలనిపించింది.

చావొకటే తియ్యటి సమాధానంలా కనిపించింది.

రోజూ పేపర్లో ఎవరో ఒకరు ఆత్మహత్య చేసుకుని చచ్చిపోయారని కనబడుతూ వుంటుంది. కొంతమంది ప్రయత్నం చేసినా దురదృష్టవశాత్తూ ఆ ప్రయత్నం ఫలించక చివరికి నవ్వుల పాలవుతూ వుంటారు.

నేనలా కాకూడదు.

తెల్లారేటప్పటికి 'మూర్తి' అనే అర్భకుడు, అసమర్థుడు ఈ ప్రపంచంలో ఉండకూడదు. మరో ప్రపంచం మనిషి కావాలి.

అదీ నా నిశ్చయం.

ఎంతో ప్రయాసపడి, డబ్బు నీళ్ళలా ఖర్చుపెట్టి, ఓ నిద్రమాత్రల సీసా సంపాదించాను.

ఎలిజబెత్‌ని చూడాలనిపించింది పోయే ముందర. కానీ వెళ్ళలేదు.

ఎలిజబెత్ మాటలు చచ్చిన శవానికి కూడా ఊపిరి పోసి మాట్లాడేలా చేస్తాయి.

నాకు బతకాలని లేదు.

అందుకే వెళ్ళలేదు.

గదికొచ్చాను. మాత్రలన్నీ మింగాను కష్టపడి. నా గది వెనక తలుపులోంచి బయటికి వచ్చి వీధి తలుపు తాళం వేశాను. బయటనుంచి ఎవరు చూసినా నేను లేననుకొని వెళ్ళిపోతారు. అదీ నాకు కావలసింది.

నా కథకి నేనెన్నుకున్న ముగింపు రాస్తున్నాను డైరీలో ఇప్పుడు. తొందరగా ఈకాస్తా రాసేసి పోస్టాఫీసుకి వెళ్ళి నీకి డైరీ పంపించాలి. అదీ నా ప్రయత్నం.

ఇంకో అరగంటపోతే నా ఇంద్రియాలు నా మాట వినకపోవచ్చు.

నే కోరుకున్న జీవనసౌఖ్యం నా కంద కుండా పోయింది. ఎందుకంటే-

నేనొక తెల్లకాగితాన్ని చదవాలను కున్నాను.

ఎంతోమంది బతకగలరు ఓడి పోయినా.

కాని నేను సమాధాన పడలేను.

అందుకే వెళ్ళిపోతున్నా.

క్షమిస్తావు కదూ రమణా?

నీ వాడు
మూర్తి.



"మూర్తీ!!!"

గావుకేక, చావుకేక లాంటిది వచ్చింది రమణలోంచి.

కంపార్టుమెంటులో చుట్టూ జనం బిత్తరపోయారు.

మొహం అంతా చెమటలు పట్టేసింది రమణకి.

అంత సేపూ డైరీ చదవటంలో మునిగి పోయాడు. అంతా కళ్ళముందు జరుగు తున్నట్లనిపించింది.

తేరుకుని వాస్తవంలోకి రాగానే తెలిసింది – మూర్తి ఇక లేడనే గుండెలు పిండివేసే నిజం!

ఏడుపు ఆపుకోలేకపోయాడు. వెక్కి-వెక్కి ఏడ్చాడు.

పక్కన కూచున్న వాళ్ళంతా ఆశ్చర్యపోయి చూస్తున్నారు. గుండె నెమ్మదించటానికి చాలా సేపు పట్టింది రమణకి.

అప్పుడనిపించింది!

నిద్రమాత్రలు మింగినంత మాత్రాన మూర్తి చచ్చిపోయాడని ఏమిటి? ఎవరో ఒకరు హాస్పిటలుకు తీసికెళ్తే, బత కొచ్చుకదా?



మూర్తి పోతే రావుగారికి తెలిసిన వాళ్ళందరికీ తెలిసి వుంటుంది. మరి రావుగారి ఆఫీసుకి ట్రంకాలు చేసినప్పుడు కూడా అవతలి మనిషి ఏం తెలియదన్నాడేం?

మూర్తి బతికే ఉంటాడు. తన మనసుకి తనే ధైర్యం చెప్పుకున్నాడు రమణ.

రైలు బెజవాడ చేరింది.

ఆఘమేఘాల మీద హైదరాబాదు చేరుకోవాలనుంది రమణకి.

ఎలా?

గుండె రగిలే బాధ! జరగకూడనిదేదో జరిగి పోయిందనే శంక మాత్రం వదిలి పెట్టలేదు రమణని ఎంత ధైర్యం చెప్పుకున్నా.

మూర్తి ఇంత అమాయకంగా ఎలా తయారయ్యాడో అర్థం కాలా రమణకి. ఎందుకిలా వెర్రివాడై పోయాడు?

అందరితోనూ ఎంత పొగరుగా మాట్లాడేవాడో! గంగిగోవులా మారి పోయాడంటే, జ్యోతి ప్రభావం మూర్తి మీద ఎంతగా పనిచేసిందో అర్థమయింది రమణకి.

అవును.

ఆడదాని ముందు మగవాడెంత?

నమ్మకం జారిపోతున్నా, మనసు కీడు శంకిస్తున్నా, ఎప్పటికప్పుడు ధైర్యం చెప్పుకుంటూ, మనసుని సమాధాన పరుచుకుంటూ, ఆ దేవుడిని వేడుకుంటూ, తెల్లవారటం కోసం ఆరాటంతో ఎదురు చూశాడు రమణ.

ఎలాగైతేనేం రైలు హైదరాబాదు చేరింది.

మూర్తి ఎడ్రసు తెలియదు రమణకి.

ఏం చెయ్యాలి?

వేణు గుర్తుకొచ్చాడు. డైరీ తీసి వేణు అడ్రసు ఉందేమో చూశాడు. సంవత్సరం క్రితం రాసుకున్న అడ్రసు

కనపడింది. ఇంకా అక్కడే వుంటాడా వాడు.

ఆటో ఎక్కి వేణు ఇంటికి చేరుకున్నాడు రమణ.

రమణని చూడగానే కావలించుకుని ఏడవటం మొదలెట్టాడు వేణు.

"మూర్తి..."

"చచ్చిపోయాడు రమణా! మనం దర్నీ మోసం చేసి వెళ్ళిపోయాడు ఒక్కడూ."

మిణుకు మిణుకు మంటూ వెలుగుతున్న కాస్త ఆశా ఆరిపోయింది రమణకి.

తన గుండెని ఎవరో కత్తితో కెలికి, పెకలించి, లాగేసినట్లనిపించింది.

"ఎన్ని రోజులయింది ?" అడిగాడు రమణ.

"పది రోజులయింది ఇవాళ్టికి."

"వాట్ ?"

"అవును. గది తాళం వేసుంది కాబట్టి ఎవరికీ తెలియలేదు. రెండు రోజులూ మూర్తి కనపడక పోయేసరికి ఎలిజబెత్ నా దగ్గరికి వచ్చింది కూడా. మతిమాలిన వాడిని. నాకు తాళం బద్దలు కొట్టి చూద్దామన్న ఆలోచన కూడా రాలేదు"

"తరవాత ఏమయింది?"

"నాకూ అర్థంకాలేదు. మూడో రోజు నుంచీ కాస్త వాసన రావటం మొదలెట్టిందట. చివరికి అయిదోరోజున చుట్టుపక్కల వాళ్ళకి అనుమానం వేసి తాళం బద్దలు కొట్టి చూశారు"

"......"

"శవం కుళ్ళిపోయింది అయిదారు రోజులు గాలీ,వెలుతురూ లేకపోవటంతో."

ఎందుకంత దిక్కుమాలిన చావు కోరుకున్నాడు మూర్తి? తనని తను శిక్షించుకోవాలనుకున్నాడా ? కంట్లోంచి నీళ్ళు గాక నెత్తురు పడుతుందేమో అనిపించింది రమణకి.

"రావుగారొచ్చారా ?"

"వచ్చారు."

"ఎప్పుడు?"

"ఆ రోజే. ట్రంకాలు చేశాను నేను. సాయంత్రానికి వచ్చేశారు హైదరాబాదు."

"శవం ఇప్పుడెక్కడుంది ?"

"ఆ మరుసటి రోజే దహనం కూడా చేసేశారు."

అవును. శవం ఇంకా ఎందుకుంటుంది పది రోజుల వరకూ ? కుళ్ళిపోయిన శవాన్ని తన కోసం ఉంచుతారా?

ఆఖరి చూపుకు కూడా నోచుకోకుండా చేశాడు మూర్తి - అనుకున్నాడు రమణ.

"రావుగారున్నారా ఇక్కడ?"

"లేరు. నిన్ననే మళ్ళా ఢిల్లీ వెళ్ళిపోయారు."

ఏం చూసుకుని ఉంటారు ఇక్కడ ? ఉండలేరు. రమణ లేచాడు సూట్ కేస్ తీసుకుని.

"ఎక్కడికి?"

"ఏదన్నా హోటలుకి వెళ్తాను."

"ఇల్లుండగా హోటలెందుకు?"

"లేదురా. నన్ను బలవంత పెట్టకు. హోటలు కెళ్ళిపోతాను."

హోటలు దాకా వచ్చి దిగబెట్టి, కాసేపు కూచుని, మళ్ళీ వస్తానని చెప్పి వెళ్ళిపోయాడు వేణు.

బట్టలు కూడా విప్పకుండా అలాగే మంచంమీద పడ్డాడు రమణ, వేణు వెళ్ళిపోగానే. కుళ్ళికుళ్ళి ఏడ్చాడు.

శూన్యంగా తోచింది రమణకి అంతా.

ఎందుకిలా జరిగింది ?

ఏం పోగొట్టుకున్నాడని తన నిండు జీవితాన్ని అంతం చేసుకున్నాడు మూర్తి?

ప్రేమకి బదులిదేనా? సమాధానం ఇదేనా?

ఆ జ్యోతి ఎవరో చూడకపోయినా, ఓ పిశాచి లాంటిదనిపించింది రమణకి.

మూర్తి లాంటి వాడిని ఎందుకు దూరం చేసుకుంది?

తెలుసుకోవాలనిపించింది రమణకి.

చివాలున మంచం మీదనుంచి లేచాడు రమణ. స్నానం కానిచ్చి బయట కొచ్చాడు. దావానలం మరుగుతోంది సెగలు చిమ్ముతూ అతని గుండెలో.

ముందర సుధాకర్‌ని కలుసుకోవాలి. వేణుకి ఫోనుచేసి అతని అడ్రసు తీసుకున్నాడు. ఎక్కడో స్టేట్ గవర్నమెంటు ఆఫీసులో పని చేస్తున్నాడని చెప్పాడు వేణు.

ఫోను చేశాడా ఆఫీసుకి.

"నా పేరు రమణ"

"........."

"నేనెవరో మీకు తెలియదు. మీరు నాకు తెలుసు. నేను విశాఖ నుంచి వచ్చాను. మీతో మాట్లాడాలి. అర్జంటుగా కలవగలరా నన్ను?"

"నేనివాళ సాయంత్రమే వెళ్ళిపోతున్నాను. ఇప్పుడు పదకొండయింది. గంటసేపు మీ కోసం కోఠీలో విజయా హోటల్లో కూచుంటాను. అక్కడికి రండి"

"........."

"ఎందుకు చెప్పను? తప్పకుండా చెబుతాను. నేను మిమ్మల్ని రమ్మంది జ్యోతి విషయం మాట్లాటానికి" అంటూ సుధాకర్‌కి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా చటుక్కున ఫోను పెట్టేశాడు రమణ.

రమణ హోటలుకెళ్ళి కూచున్న పావు గంటకే వచ్చాడు సుధాకర్ — జ్యోతి గురించి మాట్లాడాలని చెప్పినందుకేమో!

హోటల్లో జనం ఎక్కువగా లేకపోవటంతో తేలిగ్గా గుర్తు పట్టినట్టున్నాడు రమణని. దగ్గరికొచ్చి అడిగాడు.

"మీరేనా రమణంటే?"

"అవును. మీరు సుధాకర్ కదూ?"

"అవును."

"కూచోండి" అంటూ చెయి చాపాడు రమణ. చెయి కలిపి కూచున్నాడు సుధాకర్.

కాసేపు ఇద్దరూ మాట్లాడలేదు.

"మూర్తి తెలుసా మీకు?"

"తెలుసు"

"ఇప్పుడు చచ్చాడని కూడా తెలుసా సుధాకర్‌గారూ?" కచ్చతో అడిగాడు రమణ.

ఏం మాట్లాడలేక పోయాడు సుధాకర్.

"వాడిని ఓ వెర్రి వెధవని చేశారు కదూ మీరంతా కలిసి?"

"........."

"వాడిని మీరే చంపేశారు"

"........."

"మీరూ, జ్యోతి పెళ్ళి చేసుకుంటారా?"

"అవును. రెండేళ్ళనుంచీ అనుకుంటున్నాం పెళ్ళి చేసుకోవాలని. వాళ్ళక్కయ్య వాసంతి పెళ్ళి అవటంకోసం ఆగాం."

ఎందుకో ద్వేషం చచ్చిపోయింది రమణలో. కానీ కోపం మటుకు ఇంకా పోలేదు. కాసేపు అలాగే నిశ్శబ్దంగా ఉన్న తరవాత అన్నాడు సుధాకర్—

"రమణగారూ! మూర్తి నా స్నేహితుడు కాదు. కానీ అతను ఎటువంటి మనిషో నాకు తెలుసు."

"ఎటువంటి మనిషంటారు?"

"మంచివాడు! జాలేసేది అతన్ని

చూసే"

"మీకెలా తెలుసు మూర్తి గురించి?"

"మూర్తి తనకి రాసిన ప్రతీ ఉత్తరం ఏరోజు కారోజే నాకు చూపించేది జ్యోతి"

గుండె కలుక్కు మంది రమణకి.

ఈ మాట మూర్తికి తెలుసుంటే వాడి గుండె అప్పుడే బద్దలయుండేది.

ఎంత తప్పటడుగు వేశాడు మూర్తి!!

జ్యోతి ఒక తెల్లకాగితం అనుకున్నాడు మూర్తి. పిచ్చి మూర్తి! ఆమె గుండెలో సుధాకర్ రూపం నిండిపోయి ఉందని వాడికేం తెలుసు ?

"ఎన్నో సార్లు చెప్పాలనుకున్నాం మూర్తికి. కానీ మనిషి ఆవేశపరుడు. ఏ అఘాయిత్యం చేస్తాడో అని చెప్పలేదు"

"అందుకని అటువంటి నిజాన్ని అతన్నుంచి దాచారన్న మాట?"

"అదొక్కటే కాకుండా, ఇంకో కారణం కూడా ఉంది. మా విషయం ఇప్పుడిప్పుడే ఎవరికీ తెలియటం మాకిష్టం లేదు. అటువంటప్పుడు మూర్తికి చెబితే..."

"అందరితో చెప్పేస్తాడనుకున్నారా?"

"అవును"

"మీకు మూర్తి గురించి అంతా తెలుసన్నారు కదూ? కానీ మీకు తెలియదు"

"ఎందుకలా అనుకుంటున్నారు?"

"జ్యోతి విషయం కూడా అందరితో వాడే చెప్పాడనుకుంటున్నారేమో. కానీ అది వాడు చేసిన పనికాదు"

"మీకెలా తెలుసు?"

"నాకు తెలుసు. వాడలా చెయ్యడు"

"ఏమో"

"మీరు చాలా పెద్ద పొరబాటుచేశారు. మూర్తిని చాలా తక్కువగా అంచనా వేసుకున్నారు"

"ఎందుకు?"

"మీరిద్దరూ పెళ్ళి చేసుకోవాలని మూర్తితో ఒక్క మాట చెప్పివుంటే, వాడలా ఆశలు పెంచుకునే మనిషి కాదు. అతని ఆశ మొదట్లోనే తుంచేయాల్సింది మీర్రు"

"........."

"ఇంకోటి చెప్పనా మీకు? మీవిషయం తెలుసుంటే దగ్గరుండి మీ పెళ్ళి జరిపించేవాడు మూర్తి, అటువంటి మనసు వాడిద్ది"

"రమణగారూ!"

"వాడితో చెప్పివుంటే ఈనాటికీ వాడు బతికి వుండేవాడు"

"మాదే తప్పంటారా?"

"వాడు చచ్చాడు కదా? ఇంకిప్పుడు తప్పొప్పుల ప్రసక్తి ఎందుకులెండి"

"మరెందుకు కలిశారు నన్ను?"

"ఎందుకో కలవాలనిపించింది. కలిశాను. చాలా కృతజ్ఞుడిని నే పిలవగానే వచ్చినందుకు"

ఏం మాట్లాడలేదు సుధాకర్.

"లేద్దామా?" అడిగాడు రమణ.

ఇద్దరూ లేచారు.

జ్యోతి వాళ్ళింటికి బయలుదేరాడు రమణ సుధాకర్ వెళ్ళిపోగానే.

తేలికగానే దొరికింది జ్యోతి వాళ్ళ ఇల్లు. నడవాలోపలికెళ్ళాడు.

"ఏమండీ" అంటూ పిలిచాడు.

సాదా వాయిల్ చీరలో ఓ అమ్మాయి చేతిలో పుస్తకంతో వసారాలోకి వచ్చింది.

"ఎవరు కావాలండీ ?"

"మీరేనా జ్యోతంటే?"

"అవును"

అప్పుడు పరీక్షగా చూశాడు రమణ. మూర్తి చెప్పింది నిజం. అందం

లేదామెలో. కానీ ఓ వింత ఆకర్షణ శక్తి ఉంది ఆ కళ్ళలో. నిండుగా ఉంది మనిషి సౌమ్యత ఉటిపడుతూ.
పాపం మూర్తి!

ఈమెను ఆశించటానికి తనకి అర్హత లేదేమో అనుకున్నాడు. బాధ పడ్డాడు ఎంతో!

అసలు మూర్తి లాంటి మనిషిని ఆశించటానికి జ్యోతికి అర్హత ఉందా? అనిపించింది రమణకి.

"ఏం కావాలి మీకు?" అంది జ్యోతి.

"నేను మూర్తి స్నేహితుడిని."

ఉలిక్కి పడింది జ్యోతి.

"నా పేరు రమణ. విశాఖనుంచి వచ్చాను."

"లోపలికి రండి."

కూచున్నాడు రమణ లోపలికెళ్ళి. తలొంచుకుని కూచుంది జ్యోతి.

"పాపం మూర్తి పోయాట్ట. మీకు తెలుసా?"

రమణ వ్యంగ్యానికి తలెత్తింది జ్యోతి అప్పుడు చూశాడు రమణ.

ఆమె కళ్ళలో గిర్రున తిరిగాయి నీళ్ళు. ఏదో మాట్లాడబోయింది. తన గురించో, సుధాకర్ గురించో చెబుతుం దేమో అనుకున్నాడు రమణ.

"నేను సుధాకర్‌ని కూడా కలిశా లేండి."

"ఈ డైరీ మీ కిమ్మన్నాడు మూర్తి. వాడి ఆఖరి కోరికేమో. పిచ్చివెధవ!"

"రమణగారూ..."

"అసలు నేనిక్కడుంటే వాడు ఆత్మ హత్య చేసుకునే అవసరం లేకుండా నేనే కాల్చి పారేసేవాడిన్ని" లేచాడురమణ.

"చదవండి ఆ డైరీ ఏవో పిచ్చి పిచ్చి రాతలనుకోండి. కాని ఆత్మ శాంతి నుందంటారా? మీ కటువంటి మూఢ నమ్మకాలున్నాయో లేదో. నేను వెళ్తాను. సాయంత్రం మళ్ళీ వెళ్ళిపోవాలి విశాఖ.."

"కాసేపుండండి. మీతో మాట్లాడాలి"

"లేదు వెళ్ళిపోవాలి. నమస్కారం!" అంటూ రెండు చేతులూ జోడించాడు

ఓ క్షణం అలాగే ఆమెను చూసి బయటకొచ్చేశాడు రమణ.

* * *

హోటలుగదికి చేరుకున్నాడు రమణ.

వేణుకి ఫోను చేశాడు రమ్మని.

తాగాలనిపించింది రమణకి చచ్చి పోయేదాకా. కిందకెళ్ళి ఓ ఫుల్ బాటిల్ పట్టుకొచ్చాడు.

తాగటం మొదలెట్టాడు

అరగంటలో వేణు వచ్చాడు. రెండో గ్లాసు నింపాడు రమణ.

"ఎన్ని రోజులుంటావు!" అడిగాడు

"సాయంత్రం వెళ్ళిపోతున్నాను."

"అదేమిటి రమణా! అసలే బాధగా వుంది అప్పుడే వెళ్ళిపోతానంటావేం? నాలుగు రోజులుండలేవా?"

"మూర్తిని మరిచిపోవాలనుంది. అసలు మూర్తి అనే ఇడియట్ వాడె వడో నాకు తెలియకుండా, గుర్తురాకుండా ఉండాలని ఉంది."

"రమణా అందరం పోవాల్సిన వాళ్ళమే."

"వేదాంతం చెబుతున్నావా?"

"కాదు లాజిక్ చెబుతున్నా! వాడి నుదుటన అలా రాసి ఉందేమో తొంద రగా పోయాడు."

"వేణూ!"

"దాన్ని గురించి నువ్వూ వాడిలా ఓ సమస్య సృష్టించుకుని నలిగిపోవద్దు"

వింతగా అనిపించింది రమణకి. వేణు ఇంత తొందరగా ఎలా మనసుకి

సమాధానం చెప్పుకోగలిగాడా అని.

"అవును. వాడు సమస్య కొనితెచ్చు కున్నాడు"

మాట్లాడలేదు వేణు.

"వాడికేం తక్కువని ఇలా వృధా చేసుకున్నాడు జీవితాన్ని?" ఇది అందరికీ అర్థంకానిది. నాకు తెలుసు.

"రమణా ! దానికి కారణం ఎవరు చెప్పగలరు చెప్పు ? నువు చెప్పగలవా ? నే చెప్పగలనా? జ్యోతి తన జీవితంలో జ్యోతి అనుకున్నాడు వాడు. నేను చెప్పాను ఎన్నోసార్లు అంతగా ఆశలు పెంచుకోవద్దని. నేను చెప్పినందుకు నా మీద కోపం వచ్చింది తెలుసా వాడికి?"

"వేణూ! మూర్తి అందరిలాంటి మనిషీ కాదు. ఈ వయసులో ఎంతో మందికి ఇటువంటి సమస్యలెదురవుతాయి. ఎదుటి మనిషి అభిప్రాయం తెలియకపోయినా, తెలుసుకోకుండా పిచ్చిగా ఆరాధిస్తారు. కొంత మంది సాధిస్తారు అనుకొన్నది. చాలా మంది ఓడిపోతారు చిత్తుగా. ఓడి పోయిన వాళ్ళలో - చపల చిత్తులూ, కొద్దిగా ప్రయత్నం చేసి వెనక్కి తిరిగిన వాళ్ళూ రాజీపడతారు బతుకుతో. దానికి కారణం ఆ ప్రేమకి వాళ్ళంత ప్రాముఖ్యత ఇవ్వకపోవటం మూలానా, వేరే ఇంకే మార్గం లేదు కనకా. కొద్ది మంది మాత్రం, బహుకొద్ది మంది మర్చి పోలేరాబాధని. జీవితాంతం ఆ జ్ఞాపకాలతో చిత్రహింస అనుభవిస్తూనే వుంటారు. ముందుకుపోలేరు. వెనక్కి తిరగలేరు. చచ్చే ధైర్యంలేక త్రిశంకు స్వర్గంలో గడిపేస్తారు జీవితాన్ని. వారు ఏ తృప్తిని ఆశించారో' ఆ తృప్తి - బతుకులో మరోచోట, మరో విషయంలో పొందటా నికి ప్రయత్నిస్తారు."

"హాయిగా పెద్దవాళ్ళు చూపించిన పిల్లని పెళ్ళి చేసుకున్నవాళ్ళకి ఏ గొడవా ఉండదు కదా?"

"సిల్లీగా మాట్లాడకు. నువు మీ పెద్దవాళ్ళు చూపించిన పిల్లని పెళ్ళి చేసుకున్నావా? లేదు. నువ్వు ప్రేమిం చావు. దక్కించుకున్నావు నీక్కావలసిన మనిషిని. ఆ మనిషి కాదన్నా వేరే మనిషిని పెళ్ళిచేసుకునే వాడివి. మూర్తి లాంటి వాళ్ళు జీవితంలో ఓటమి భరిస్తా రేమో గుండె ధైర్యంలో, కానీ ప్రేమలో భరించలేరు."

"బాగానే వుంది నువు చెప్పింది. మరి మూర్తి లాంటి వాళ్ళు బతుకిలా కావల సిందేనా?"

"ఇటువంటి గడ్డు సమస్యలకి ఒక దారి, ఒక నిర్వచనం అంటూ చెప్పలేరు ఎవరూ. ఎవరికీ సాధ్యం కాదది. ప్రతి వాడూ ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని చెబుతావా ? లేకపోతే ప్రతి మనిషీ పెద్దవాళ్ళు చూపించిన మనిషిని కళ్ళు మూసుకుని పెళ్ళి చేసుకోవాలని చెబుతావా ?"

"ఏమో!"

"ఏం చెప్పలేం మనం. ఎందుకంటే ఒకో మనిషికి ఒకో దారి గమ్యానికి చేర్చుతుంది. తను ఏ మార్గంలో నడిచే గమ్యం చేరుకుంటాడో తెలిసిన మనిషిది అదృష్టం. తెలియనివాడిది దురదృష్టం."

ప్రేమగురించీ, పెళ్ళి గురించీ తర్కించుకున్నారు ఇద్దరూ అలిసిపోయే దాకా.

గుండె బరువెక్కింది రమణకి. అంత తాగినా ఎక్కాల్సినంత నిషా ఎక్కలేదు.

"రైలెన్నిగంటలకి" అడిగాడు వేణు.

"ఎనిమిది గంటలకి"

"ఇప్పుడు టైమెంతయిందో తెలుసా?''
వాచీ చూసుకున్నాడు రమణ.
''అరె! ఏడున్నరయింది. తొందరగా వెళ్ళాలి స్టేషనుకి. టికెట్ కూడా కొనుక్కోలేదు."
"రేపెళ్ళకూడదటూ పోనీ?"
"లేదురా! వెళ్ళిపోతాను."
ఇద్దరూ స్టేషనుకి చేరుకున్నారు. టికెట్ తీసుకొని జనరల్ కంపార్ట్మెంటు కోసం వెతుకుతుంటే జ్యోతి కనపడింది రమణకి.
బుక్‌స్టాల్ దగ్గర నుంచుని వుంది.
"రమణగారూ!" అంటూ పిలిచింది. దగ్గరకెళ్ళాడు రమణ.
"ఇదిగో డైరీ!"
"మళ్ళీ నాకెందుకిస్తున్నారు?"
"మీతో ఒకమాట చెప్పాలి."
"వేణూ ! ఇదిగో సూట్‌కేస్. కాస సీటు చూసిపెట్టు. నేనిప్పుడే వస్తాను" అంటూ వేణు చేతికి పెట్టె అందించాడు.
"నేను రాక్షసిని కాదు" అంది జ్యోతి.
"........."
"నేనూ మనిషినే. మూర్తి ఎలా నన్ను ప్రేమించాడో మీకు తెలుసు, నాకూ తెలుసు. కానీ——"
"ఏమిటి?"
"మూర్తికున్న మనసులాంటిది నాకూ ఉండొచ్చని మీరెందుకనుకోరు?"
"నేను మిమ్మల్ని ఏం అనలేదుగా?"
"ఏం అనలేదు కాబట్టే చెబుతున్నాను. సుధాకర్ నాకు మూడేళ్ళనుంచీ తెలుసు. రెండేళ్ళనుంచీ మేం పెళ్ళి......"
"నాకంతా తెలుసులెండి" అన్నాడు రమణ జ్యోతిని ఆపుచేస్తూ.
"నా స్థానంలో మీరుంటే ఏం చేసేవారు?"
"మీ స్థానంలో వున్నవాళ్ళెవరైనా సరే మూర్తితో చెప్పాలి నిజం. మీరు చెప్పలేదు. అదే మీరు చేసిన పాపం."
"పాపం చేశానంటారా?"
"ఈ డైరీ మీ దగ్గరే ఉంచుకోండి" తిరిగి ఇచ్చేశాడు డైరీ రమణ.
చప్పట్లు కొట్టాడు వేణు రమ్మని.
"నే వెళ్తాను. మిమ్మల్ని ఒక్కమాట అడగాలనుంది. అడగనా?"
"అడగండి."
"నిజం చెప్పగలరా? చెప్తారా?"
"నే చెప్పేది నిజమో, అబద్ధమో తెలుసుకోగలరా మీరు?"
"తెలుసుకోగలను."
"అయితే చెప్తాను అడగండి."
గార్డు విజిల్ వేశాడు.
"మీరు సుధాకర్‌ని ప్రేమిస్తున్నారు. అవునా?"
"అవును."
"మధ్యలో అడుగుపెట్టిన మనిషి మూర్తి. వాడంటే మీకు కొద్దిగా కూడా ప్రేమ లేదా?"
ప్రతిమలా చూసింది జ్యోతి రమణని.
"మాట్లాడరేం?"
"నాకు మూర్తంటే...జాలి."
"అంతేనా...?"
బిత్తరపోయి చూసింది జ్యోతి.
రైలు కదిలిపోతోంది.
సమాధానంకోసం చూడలేదిక రమణ. వెనక్కి తిరిగి పరిగెత్తాడు. వెళ్ళిపోతున్న రైలును ఎలాగో అవస్థపడి ఎక్కాడు.
వేణు చేయి వూపాడు. రమణ బదులిచ్చాడు.
జ్యోతితో మాట్లాడిన బుక్‌స్టాల్ వేపు చూశాడు రమణ.
అక్కడే నిలబడి వుంది జ్యోతి స్థాణువులా.



# ఆల్ రౌండర్

రాష్ట్రస్థాయి క్రికెట్ పోటీలు జరుగుతున్నాయి. ఏ రోజు ఫలితాలు ఆ రోజే వెల్లడయ్యే 'వన్ డే' క్రికెట్ మ్యాచ్ అది. గ్యాలరీ నిండిపోయి జనం కిటకిటలాడుతున్నారు. గ్రౌండంతా సందడిగా ఉంది.

క్రికెట్ మ్యాచ్ ప్రారంభమయింది. జనం ఈలలు, అరుపులు, చప్పట్లు !

ఆల్ రౌండర్ ఆనందరావు చాలా హుషారుగా మెరుపుదాడిలా ఫాస్ట్‌బౌలింగ్ చేస్తున్నాడు.

అంచేత అతడి ధాటికి తట్టుకోలేక బ్యాట్స్ మేన్ లు అల్లాడిపోతున్నారు. ఆనందరావు చేస్తున్న ప్రతి బౌలింగ్‌కి బ్యాట్స్‌మేన్‌ల నోట్లోని పళ్ళూడిపోతున్నాయి.

అతిశయించిన ఉత్సాహంతో వీరవిహారం చేస్తున్నాడు ఆనందరావు. దాదాపు బ్యాటింగ్ చేస్తున్న వారందరి పళ్లూ రాలేయి.

ఆనందరావు టీమ్‌కి బ్యాటింగ్ అవకాశం వచ్చింది.

అందుకనే ఆనందరావు ఈసారి మరింత విజృంభించాడు. ప్రతిసారీ బాల్ చుట్టూ గ్యాలరీలో వున్న జనంలోకి పడుగెత్తేలా ఆనందరావు సిక్సర్ల మీద సిక్సర్లు కొడుతున్నాడు. ప్రేక్షకుల్లో పాతికమందికి పైగా బాల్ తగిలి పళ్లు రాలిపోయి హాహాకారాలు చేశారు.

ఆ రోజుకి క్రికెట్ మ్యాచ్ ముగిసింది.

గ్రౌండ్‌కి పక్కనే ఆనుకుని వున్న దంత వైద్యశాల ముందు కొందరు బ్యాట్స్‌మేన్‌లు, ఆట చూడ్డానికి వచ్చి పళ్ళూడగొట్టుకున్న క్రికెటాభిమానులూ దవడలు పట్టుకొని మూలుగుతూ క్యూలో నిలబడి వున్నారు.

ఇంకా డాక్టర్ రాలేదు.

కాసేపు గడిచింది. డ్రెస్ చేసుకుని, స్టెతస్కోపు సరిజేసుకుంటూ నవ్వుతూ



తలుపు తెరిచాడు పళ్ల డాక్టర్.

అతణ్ని చూసి దవడలు పట్టుకు మూలుగుతున్న వారంతా ఒక్కసారిగా షాక్ తిన్నారు.

ఆ దంతవైద్యుడు ఆల్ రౌండర్ ఆనందరావే ! !

— కొల్లూరి లక్ష్మీకామేష్

కతలు

# సెలవు కావాలి

మా బాస్ పేరు వ్యాఘ్రేశ్వరరావు. పేరు గొప్పేకాని మనిషి సన్నగా ఏవటలా, ఊదకుండానే పడిపోయేలా ఉంటాడు. చాదస్తం ఎక్కువ. ఆఫీసులో అందరితోనూ చనువుగానే మసలుతాడు. కాని సెలవులు ఇవ్వటానికి ఏడుస్తాడు.

మా ఎకౌంటెంటుకి అత్యావసరంగా సెలవు కావలసి వచ్చింది. బిక్కుబిక్కుమంటూ పులిబోనులో అడుగు పెట్టాడు. "ఈ మాత్రం దానికే రెండు రోజులు సెలవెందుకండీ! మా తాతగారికి జబ్బు చేసినపుడు అసలు నేను వెళ్ళనే లేదు. రేపో ఎల్లుండో ఆడిట్‌వాళ్ళు వస్తారనుకుంటా! మరీ అవసరమైతే ఓరోజు తీసుకోండి" అంటూ ఓ చిన్నసైజు ఉపన్యాసం ఇచ్చి వంకాయ కోసవ వెయ్యటానికి చిరాకుపడే కూరగాయలమ్మిలా ముఖం చిట్లించాడట బాస్‌గారు. పెళ్ళి చేసుకొని హనీమూన్ వెళ్తానన్న మస్తాన్‌రావుని "నేనే హనీమూన్ వెళ్ళలేదు" అని ఈసడించి మొండి చెయ్యి చూపించటం, తండ్రి తద్దినం పెట్టటానికి ఓ రోజు సెలవు కావాలని అడిగిన తాతాచారిని "నేనూ ఏటా మా నాన్నగారి తద్దినం పెడుతున్నాను. పదిగంటల్లోగా ఆ పని అయిందనిపించేసి ఆఫీసుకి వచ్చేయటంలా" అని ధర్మసూక్ష్మం చెప్పి దయచేయమనటం నాకు తెలుసు.

ఇప్పుడు నాకు అర్జంటుగా రెండు రోజులు సెలవు కావాలి. పెళ్ళి చూపులకు రమ్మని ఇంటి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. అది చూడగానే వ్యాఘ్రేశ్వర రావుగారి సీలుగుడు జ్ఞాపకం వచ్చి ఓసారి బుర్ర గిర్రున తిరగబోయి ఆగింది. ఏమైనాసరే అని తెగించి సెలవు చీటీ పట్టుకొని గుహాప్రవేశం చేశాను.

"రెండు రోజులు సెలవు కావాలి సార్!"

"ఏం?"

"ఊఁ...మరి..."

"ఏమిటలా నసుగుతావు?"




"అదేసార్! మా అక్కయ్యా... ఎవరితోనో...లేచి...పోయింది...సార్. అర్జంటుగా ఇంటికి వెళ్ళాలి సార్!"

ఫైళ్ళు చూస్తూ పరధ్యానంగా ఉన్న మా బక్కశార్దూలం "ఆఁ! ఇందులో ఏముందోయ్! మా ఆవిడ కూడా..." అని పాత చరణాలే పాడబోయి "ఆఁ... ఆఁ...సరే...సరే! వెళ్ళు వెళ్ళు!" అంటూ కంగారుగా నా చేతిలో లీవులెటర్ లాగేసుకొని బరబరా సంతకం గీకేసి ఫైళ్ళలో ముఖం దాచుకొన్నాడు.

— హేల

# పాసవ్వనీ

దయానిధిగారికి దయా గుణం ఎక్కువ. ఆయన ఓ ఆఫీసులో ఉన్నతస్థాయి ఆఫీసరు. ఆఫీసులోనేకాక యింట్లోనూ ఆయనకి తీరిక తక్కువే. ఆఫీసులో ఫైళ్లూ, గుమాస్తాలూ ఆయన కాలాన్ని తినేస్తుంటే, ఇంట్లో పిల్లలూ, భార్యా ఆయన విరామకాలాన్ని మింగేస్తుంటారు. ఆయనకున్న దయాగుణమే వాళ్లని ఆయన కసరకుండా, విసుక్కోకుండా అడ్డుకుంటోంది.

ఆ ఏడాది ఆ ఆఫీసులో డిపార్ట్‌మెంటల్ పరీక్షలు జరిగాయి. పేపర్లు దిద్దే భారం ఉన్నత స్థాయి ఆఫీసర్ల మీదే పడింది. క్షణం తీరని దయానిధిగారికి ఓ యాభై పేపర్లు దిద్దే పని తప్పలేదు. సాలోచనగా పేపర్ల కట్టనీ, దాని మందాన్నీ గమనిస్తున్న దయానిధిగారికి ఉన్నట్టుండి ఓ దయ గల అయిడియా వచ్చింది. చటుక్కున ఫోనెత్తి పి.ఏ.ని అడిగాడు.

"ఏమోయ్! ఇప్పుడు నాకు కొన్ని పరీక్ష పేపర్లు పంపావ్ కదా, వీటిలో పాస్‌మార్కు ఎంత?"

"నలభై పర్సెంట్ సార్"

"ఐ సీ" అని ఫోన్ పెట్టేసి, రెడ్ పెన్ చేతిలోకి తీసుకున్నారు దయానిధి గారు. పేపర్ల కట్ట వూడదీసి, చకచక అక్కడక్కడ టిక్కులు పెడుతూ ఏ పేపర్లోనూ నలభై మార్కులకి తగ్గకుండా మార్కులు వేసుకుంటూ పోయారు–

'పోనీయ్ అభాగ్యులు. ఏదెలా రాసినా పాసు కావాలనేకదా రాస్తారు. పాసవ్వనీ' అనుకుంటూ.

గంట సేపట్లో పేపర్లన్నీ దిద్దటం అయిపోయింది. నలభైకి, అరవైకి మధ్య పద్దాయి మార్కులు అన్ని పేపర్లలోనూ.

పరీక్షా ఫలితాలు వచ్చేసరికి దయానిధిగారు దిద్దిన పేపర్లు రాసిన ఒక్క వ్యక్తీ పరీక్ష పాస్ కాలేదని తెలిసిందాయనకి!

'అయ్యో! ఇదేమిటి?' అనుకుంటూ పి.ఏ.ని పిల్చారాయన.



"ఇదేమిటోయ్! నా పేపర్లలో అందరికీ నలభై, అరవై మధ్యే వచ్చాయి మార్కులు. అంతా ఎలా తప్పారు?" అంటూ అడిగారు.

"అవున్సార్. ఆ పేపర్ నూటయాభై మార్కులకి యివ్వబడింది. మీరు దిద్దిన పేపర్లు దేనికీ నలభై పర్సెంట్ మార్కులు రానేలేదు!" అన్నాడు పి. ఏ. చల్లగా.

దయానిధిగారు కలంతో తల బాదుకున్నారు.

—శివరామ్

# ఋణం

అందిన చోటల్లా అప్పులు చేస్తూ ఎగ నామం పెట్టేసుండే గుర్నాధం రోడ్డున నడిచేటప్పుడు తనకు అప్పిచ్చిన ఆసామి ఎవరైనా తగుల్తాడేమోనని జాగ్రత్తపడి దొంగలా వెళ్తుంటాడు.

గుర్నాధానికి గడ్డం బాగా పెరిగింది. ఆ ప్రాంతంలో వుండే బార్బరు షాపుకి వెళ్తే, ఆ షాపు ప్రొప్రయిటరు పాపారావు గుర్నాధాన్ని నమ్మకంగా కుర్చీలో కూర్చోబెట్టి గడ్డానికి సబ్బు పట్టించి, సగంగీకి, ఆ తర్వాత మెడమీద కత్తి పెట్టి తనకి రావాల్సిన పాత బాకీని వసూలు చేసేంత కోపంలో వున్నాడు. అంచేత తెలివిగల గుర్నాధం పక్క వీధిలోవున్న పరమేశం బార్బరు షాపు కెళ్ళాడు.

కుర్చీలో కూర్చున్నాక పరమేశం టర్కీ టవల్ని గుర్నాధం భుజాల మీద కప్పి గడ్డానికి సబ్బు పట్టించాడు. గడ్డం చేసేందుకు కత్తి నూరుతున్నాడు.

అంతలో ఎక్కడినుంచి ఊడిపడ్డాడో గానీ గుర్నాధానికి అప్పిచ్చిన వీర్రాజు పోలీసు కుక్కలా వాసనపట్టేసి సుడి గాలిలా వచ్చిపడ్డాడు.

ఉన్నపళంగా గుర్నాధం చొక్కా పుచ్చుకుని, కళ్ళెర్రజేసి గొంతు చించుకు అరిచాడు. "అప్పు తీసుకుని, అయిదు రోజుల్లో ఇస్తానని బొంకి ఆర్నెల్లు దాటినా అయిపులేకుండా పోయావు. ఏమిటి నీ యవ్వారం.. ఇప్పుడే తాడోపేడో తేల్చి పారేస్తాను. నేను మాట అన్నానంటే అదే మాట మీద నిలబడే మనిషిని, నీవూ వున్నావు ఎందుకయ్యా వెధవ జన్మ" అంటూ ఇష్టం వచ్చినట్టు దులిపేశాడు గుర్నాధాన్ని.

వీర్రాజుని కోపం తగ్గేవరకు తిట్టనిచ్చి, "చూడు వీర్రాజూ! నీవు చెప్పింది బాగానే ఉంది. అలా అరిస్తే లాభమేమిటి? కనీసం గడ్డం చేయించుకునేంత వరకైనా నోరెత్తకుండా వుండు. తర్వాత మాట్లాడదాం!" అన్నాడు తాపీగా.

"సరేనయ్యా! నీవు గడ్డం చేయించుకునే వరకూ ఆగుతాను. తర్వాత మళ్ళా వాయిదా వేశావంటే ఊరుకునేది లేదు"



అంటూ పక్కనేవున్న బెంచీమీద చతికిల పడ్డాడు వీర్రాజు.

గుర్నాధం తన భుజంమీద వేసివున్న టవల్ని తీసి గడ్డానికి పట్టించివున్న సబ్బు నురగని శుభ్రంగా తుడిచేసుకుని, గడ్డం చేయించుకోకుండానే ముసిముసిగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు. ఆ తర్వాత గుర్నాధం జీవితంలో ఎప్పుడూ తన గడ్డం గీయించుకోనే లేదు.

—రమణ

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/ HD /402

